## నాగేశభట్ట విరచిత

# పరమ లఘు మంజూష

(ప్రథమ భాగము)

## బాలబోధి న్యాఖ్యాంధ్ర వ్యాఖ్యాసహితము

వ్యాఖ్యాత

ఆచార్య శ్రీపాద సత్యనారాయణ మూర్తి

# పరమలఘుమంజూష

(తాత్పర్యనిరూపణాంతము)

బాలబోధివ్యాఖ్యాంధ్రవ్యాఖ్యాసహితము

వ్యాఖ్యాత

ఆచార్య శ్రీపాద సత్యనారాయణ మూర్తి

ప్రొఫెసర్, వ్యాకరణ విభాగాధ్యక్షుడు

రాష్ట్రియసంస్కృతవిద్యాపీఠమ్

తిరుపతి

Parama Laghu Manjusha



ప్రథమ ముద్రణ, ఫిబ్రవరి, 1999

మూల్యము : రూ. 125/-



 

*The book is published with the financial assistance of*
*TIRUMALA TIRUPATI DEVASTHANAMS*
*under their scheme 'Aid to publish Religious books'*

ప్రతులకు

Smt. S.V. PHANISWARI
W/o. Prof. S.S. MURTY
18-1-46/J9
Santi Nagar, K.T. Road
TIRUPATI - 517 507 Phone : 30423

LASERTYPESETTED AT
ANNAPURNA GRAPHICS, 53 (Upstairs) R.S. Gardens, TIRUPATI - Ph. 30184

అస్మజ్జననీజనకులు



**బ్ర॥ వే॥ శ్రీపాద సుబ్బారావు సీతామహాలక్ష్మి** గారల

పాద పద్మములకు సవినయముగ సమర్పించు గ్రంథ పుష్పము

# విషయ సూచిక

# ఉపోద్ఘాతము

ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక దుఃఖత్రయ సంకులితమగు సంసారమున మనుష్యుడు నిరతిశయ సుఖమును కాంక్షించును. పాపకర్మ ఫలితమే దుఃఖత్రయము. ఐహిక పారలౌకిక సుఖములకు మూలము ధర్మము. తత్సాధనభూతములు వేదములు. 'వేదో ఽఖిలో ధర్మమూలమ్' అని మనువుచే చెప్పబడినది. ఇష్టప్రాప్తి, అనిష్టపరిహారములకు అలౌకికమగు ఉపాయము వేదమని సాయణాచార్యులు చెప్పిరి. 'ఇష్టప్రాప్త్యనిష్టపరిహార-యోరలౌకికముపాయం యో గ్రంథో వేదయతి స వేదః'. వేదార్థముయొక్క సమ్యక్జ్ఞానము కలిగించుటలో శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పమనునవి వేదాంగములుగ ప్రసిద్ధములు. పరావిద్య, అపరావిద్యయని విద్య రెండువిధములుగ ప్రసిద్ధము. వేదచతుష్టయము మరియు షడంగములు అపరావిద్యగ ప్రసిద్ధములు. ఉపనిషత్తుల సారాంశభూతమగు బ్రహ్మవిద్య పరావిద్యయని తాత్పర్యము.

> ఛందః పాదౌ తు వేదస్య హస్తౌ కల్పోఽథ పఠ్యతే।
> జ్యోతిషామయనం చక్షుః నిరుక్తం శ్రోత్రముచ్యతే॥
> శిక్షా ఘ్రాణం తు వేదస్య ముఖం వ్యాకరణం స్మృతమ్।
> తస్మాత్ సాంగమధీత్యైవ బ్రహ్మలోకే మహీయతే॥

అని పాణినీయ శిక్షలో ఛందస్సు మున్నగునవి వేదమునకేవిధముగ అంగములో చూపించెను. లౌకిక వైదికవాక్యముల పాదవిరామములను వ్యవస్థాపన జేయు పింగళాది మహర్షి ప్రణీతమగు గ్రంథవిశేషము ఛందస్సు యనబడును. వైదికమంత్రముల ప్రయోగక్రమమును కల్పించు ఆపస్తంబాది ముని ప్రణీతము కల్పమనబడును. వేదవిహితకర్మలననుష్ఠించుటకు శుభప్రదమగు కాలమును నిర్ణయించునది జ్యోతిషము. ఆయా స్వర్ణముల

స్థానప్రయత్నోచ్చారణ క్రమమును చూపునది శిక్ష. వ్యుత్పత్తిని చూపుచు ఆయా పదముల అర్థనిర్ణాయకము నిరుక్తమనబడును. శబ్దసాధుతా సంపాదకము వ్యాకరణము. 'ముఖం వ్యాకరణం స్మృతమ్' అని వ్యాకరణ శాస్త్రమునకు ముఖస్థానీయత్వము కల్పించబడినది. శరీరమును రక్షించుటకు అంగములవలె వేదముయొక్క స్వరూపము, తదర్థము తెలుసుకొనుటకు శిక్షాదులు మిక్కిలియుపకరించును. అందు ముఖస్థానీయమగు వ్యాకరణము యొక్క ఉపయోగమెంతయో ఊహించుకోవచ్చును.

నామాఖ్యాతే చోపసర్గనిపాతాశ్చేతి వైయాకరణాః
అను నిరుక్త (13-2) వచనము

నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్।
బహు వ్యాహరతానేన న కించిదపభాషితమ్॥
అను రామాయణ (కిష్కింధాకాండ 3-29) వచనము

సర్వార్థానాం వ్యాకరణాద్వైయాకరణ ఉచ్యతే।
తన్మూలతో వ్యాకరణం వ్యాకరోతీతి తత్తథా॥
అను మహాభారత (ఉ.ప. 43-61) వచనము

పురాకల్పే ఏతదాసీత్, సంస్కారోత్తరకాలం బ్రాహ్మణా వ్యాకరణం స్మాధీయతే'

అను మహాభాష్యకారుల వచనము మున్నగు గ్రంథ సందర్భములచే సంస్కృతభాషావ్యాకరణముయొక్క ప్రాచీనత్వము తెలియుచున్నది.

ఐంద్రం చాంద్రం కాశకృత్స్నం కౌమారం శాకటాయనమ్।
సారస్వతం చాపిశలం శాకలం పాణినీయకమ్॥

మున్నగు రీతిని ఐంద్ర చాంద్రాది బహువిధ వ్యాకరణములు స్మరింపబడుచున్నవి. ఉపలభ్యమానములగు వ్యాకరణములలో లౌకిక

వైదికశబ్ద వ్యుత్పాదకముగు పాణినీయ వ్యాకరణమునకు విశిష్టస్థానము గలదు. 'ఇదమక్షరచ్ఛందో వర్ణశః సమనుక్రాంతం యథా ఆచార్యా ఊచుః, బ్రహ్మ బృహస్పతయే ప్రోవాచ, బృహస్పతిరింద్రాయ, ఇంద్రో భారద్వాజాయ, భారద్వాజ ఋషిభ్యః, ఋషయో బ్రాహ్మణేభ్యస్తం ఖల్విమమక్షర సమామ్నాయమిత్యాచక్షతే, న భుక్త్వా న నక్తం ప్రబ్రూయాత్ బ్రహ్మరాశిః' అని ఋక్తంత్రవ్యాకరణమున 'అ ఇ ఉ ణ్' మున్నగు పదునాలుగు సూత్రములకు ఆమ్నాయత్వము చెప్పబడినది. పరమేశ్వరుని అనుగ్రహము వలన లభించిన పదునాలుగు సూత్రములు మూలముగా గల పాణినీయవ్యాకరణమునకే వేదాంగత్వము స్వీకరింపబడినది. పరాశరోపపురాణమున -

> పాణినీయం మహాశాస్త్రం పదసాధుత్వలక్షణమ్ ।
> సర్వోపకారకం గ్రాహ్యం కృత్స్నం త్యాజ్యం న కించన ॥

అని పాణినీయ వ్యాకరణము ప్రశంసింపబడినది. వ్యాక్రియన్తే శబ్దాః అనేనేతి వ్యాకరణమ్. సాధు - అసాధుశబ్ద విభాగపూర్వకముగ వ్యుత్పాదన చేయునది వ్యాకరణము. ఇది తప్పక అధ్యయనము చేయవలెనని అభియుక్తోక్తి గలదు.

> యద్యపి బహు నాధీషే తథాపి పఠ పుత్ర! వ్యాకరణమ్ ।
> స్వజనః శ్వజనో మాభూత్ సకలం శకలం సకృత్ శకృత్ ॥

'బ్రహ్మ బృహస్పతయే . . . . . .' అను ఋక్ తంత్రవచనముచే వ్యాకరణశాస్త్రమునకు ప్రథమవక్త బ్రహ్మ. పిమ్మట వరుసగ బృహస్పతి, ఇంద్రుడు, భరద్వాజుడు, మహర్షులు వక్తలు. పిమ్మట గార్గ్య, శాకల్యాది మహావైయాకరణుల పరంపర నష్టము కాగా పాణిని మహర్షి తపస్సునాచరించి పరమేశ్వరుని అనుగ్రహముచే 'అ ఇ ఉ ణ్' మున్నగు పదునాలుగు సూత్రముల రూపములో అక్షరసమామ్నాయమును పొంది

అష్టాధ్యాయిని రచించి శిథిలప్రాయమగు వ్యాకరణ శాస్త్రమునకు వెలుగు జూపెను. కాత్యాయనుడు లేక వరరుచి సూత్రములకు పూరకముగ వార్తికములను, రచించెను. సూత్రవార్తికములకు వ్యాఖ్యగ పతంజలి మహర్షి మహాభాష్యమును రచించెను. ఇవన్నియు క్రీ॥ పూ॥ కొన్నివందల సంవత్సరములకు పూర్వమే ఉద్భవించినవి. ఈ విధముగ మునిత్రయ ప్రవర్తితమగు వ్యాకరణ శాస్త్రము భర్తృహరి - కైయట - హరదత్త - వామన- జయాదిత్య - రామచంద్ర - భట్టోజీదీక్షిత - కొండభట్ట - నాగేశభట్టాదుల స్వీయవ్యాఖ్యలచే భూషింపబడి నేటికి విరాజిల్లుచున్నది. పాణినీయ వ్యాకరణ వికాసమును మూడు విధములుగ విభజింపవచ్చును. 1. అష్టాధ్యాయీక్రమము 2. ప్రక్రియాక్రమము 3. దార్శనిక క్రమము. అష్టాధ్యాయిసూత్ర క్రమమునననుసరించి వ్యాఖ్యానము చేయబడిన గ్రంథములు పతంజలి మహాభాష్యము, వామన జయాదిత్యుల కాశికావృత్తి, భట్టోజీదీతుల శబ్దకౌస్తుభము మున్నగునవి ప్రసిద్ధములు. రెండవ విభాగమున పాఠకుల సౌకర్యముననుసరించి అష్టాధ్యాయి సూత్రక్రమమును విడిచి ప్రక్రియకు అనుకూలముగ సూత్రములను క్రమబద్ధముజేసి వ్యాఖ్యానము చేయబడినవి. ఇవి సుమారు క్రీ॥ శ॥ 12వ శతాబ్దమునుండి ప్రారంభమయినవి. ధర్మకీర్తి 'రూపావతారము, విమల సరస్వతి 'రూపమాల', రామచంద్రాచార్యుని (15వ శ॥) 'ప్రక్రియాకౌముది' ఈ క్రమమునకు సంబంధించినవి. పిమ్మట 16వ శతాబ్దమున భట్టోజీదీక్షితునిచే చేయబడిన వైయాకరణ సిద్ధాన్త కౌముది వ్యాకరణశాస్త్రమున ప్రసిద్ధముగ విరాజిల్లుచున్నది. ఈతని శిష్యుడగు వరదరాజుచే మధ్యసిద్ధాంతకౌముది, లఘుసిద్ధాంత కౌముది వ్రాయబడినవి.

దార్శనికపద్ధతి మూడవది. ఈ క్రమమున వికాసము జెందిన గ్రంథములన్నియు ఆర్థిక గ్రంథములుగ వ్యవహరింపబడును.

అర్థప్రవృత్తి తత్త్వానాం శబ్దా ఏవ నిబంధనమ్ ।
తత్త్వావబోధః శబ్దానాం నాస్తి వ్యాకరణాదృతే ॥

అను భర్తృహరి (1-13) వచనవుచే శబ్దముల అర్థతత్త్వము తెలుసుకొనుటకు వ్యాకరణము శాస్త్రమును మించిన ఉపాయము లేదు. కనుక శబ్దతత్త్వముతో బాటు అర్థతత్త్వము కూడా వ్యాకరణ సాధ్యమగుటచే ఆర్థికరంగమున వ్యాకరణ గ్రంథ వికాసము జరిగినది. స్ఫోటవాదమునకు ఆరంభకుడు స్ఫోటాయనుడు. 'అవజ్ స్ఫోటాయనస్య' అని సూత్రించి పాణిని యీ విషయమును సూచించెను. మహాభాష్యము పస్పశాహ్నికమున వ్యాడివిరచితమగు సంగ్రహమను గ్రంథముయొక్క ఉల్లేఖము గలదు. 'సంగ్రహే ఏతత్ ప్రాధాన్యేన పరీక్షితమ్ - నిత్యోవా స్యాత్ కార్యోవేతి' (మ. భా.) కాని యీ గ్రంథము లభించుటలేదు. పతంజలి మహాభాష్యమున సూత్రవార్తిక వ్యాఖ్యానమే గాక దార్శనిక విషయము లెన్నియో విప్రకీర్ణములై యున్నవి. వీటినన్నిటిని క్రమబద్ధముజేసి భర్తృహరి బ్రహ్మకాండ, వాక్యకాండ, పదకాండలతో కూడిన వాక్యపదీయమును రచించెను. ఇది సంపూర్ణముగ కారికాగ్రంథము. వ్యాకరణశాస్త్రమునకు దర్శనత్వమును బ్రహ్మకాండయందు భర్తృహరి స్పష్టపరచెను. దర్శనాంతరీయులు తమతమగ్రంథముల యందు స్వీయ సిద్ధాంతములను నిరూపించు సందర్భమున శాబ్దికమతమునుట్టంకించి నిరాకరించిరి. ఇట్టి స్థితిలో భట్టోజిదీక్షితులు శబ్దకౌస్తుభమును రచించి పరమత నిరాకరణ పూర్వకము శాబ్దికసిద్ధాంతములను స్థాపించెను. పిమ్మట వైయాకరణ సిద్ధాంతములన్నిటిని క్రోడీకరించుచు భట్టోజిదీక్షితులు వైయాకరణమతోన్మజ్జనమను కారికాగ్రంథమును వ్రాసిరి. ఈతని జ్యేష్ఠసోదరుడగు రంగోజీభట్టుయొక్క పుత్రుడు, సర్వతంత్రస్వతంత్రుడగు కౌండభట్టు కారికాగ్రంథమునకు వైయాకరణ భూషణము, పిమ్మట

భూషణసారమును రెండు వ్యాఖ్యలు వ్రాసెను. వైయాకరణ సిద్ధాంత సంరక్షణార్థమై నాగేశభట్టు వైయాకరణ సిద్ధాంతమంజూష, వైయాకరణ సిద్ధాంత లఘు మంజూష, పరమ లఘుమంజూష' యని మంజూషా త్రయమునును రచించెను. ఇతడు ఖండదేవ భట్టాచార్యులకంటె కనిష్ఠుడగుటచే వారి వారి గ్రంథములలోని విషయములన్నిటిని ఆలోడనము జేసెను. నాగేశభట్టు భట్టోజిదీక్షితుని పౌత్రుడు మరియు వీరేశ్వర దీక్షితుని పుత్రుడగు హరిదీక్షితుని వలన వ్యాకరణాది శాస్త్రములను, శ్రీరామరామభట్టాచార్యుని నుండి న్యాయశాస్త్రమును అధ్యయనము జేసెను. వైద్యనాథపాయగుండే నాగేశభట్టు ప్రధానశిష్యుడు, ఇతడు తమ గురువుల గ్రంథములన్నిటికి వ్యాఖ్యలు జేసెను. వైద్యనాథుని పుత్రుడు బాలంభట్టు అను నామాంతరము గల బాలశర్మ. ఇతడు కూడా నాగేశుని శిష్యుడే. నాగేశభట్టు వ్యాకరణము - దర్శనము - ధర్మశాస్త్రము- జ్యోతిషము. తంత్రము మున్నగు శాస్త్రములయందు సుమారు నూరు గ్రంథములను రచించెను.

'సర్వతంత్రార్థతత్త్వజ్ఞః సర్వత్రచ నిబంధకృత్' అని లఘుమంజూష చివరి శ్లోకమున నాగేశుడు స్వయముగ తన పాండిత్యమును ప్రకటించుకొనెను. మంజూషాద్వయమును వ్రాసిన నాగేశభట్టు పాఠకజన సౌలభ్యము కొఱకు పరమ లఘుమంజూషను రచించెను. వైయాకరణ సిద్ధాంతములను సులభముగ గ్రహించుట కిది యెంతయో యుపకరించును.

## పరమ లఘు మంజూషయందలి విషయములు

**1. శక్తి స్వరూపము :** - శాబ్దబోధను పుట్టించు జ్ఞానమున విషయమగు పదపదార్థ సంబంధము వృత్తియనబడును. తద్ధర్మావచ్ఛిన్న నిరూపిత వృత్తివిశిష్టజ్ఞానము తద్ధర్మావచ్ఛిన్న విషయక శాబ్దబోధను గూర్చి

కారణమగుటచే వృత్తిజ్ఞానము లేనివానికి శాబ్దబోధ కలుగదు. అది శక్తి, లక్షణా, వ్యంజనా భేదముచే మూడు విధములు. నైయాయిక మతమున 'ఈ పదము ఈ యర్థమును బోధించుగాక' అను పదవిశేష్యకము లేక 'ఈ పదము వలన ఈ యర్థము బోధింపబడుగాక' అను అర్థవిశేష్యకమగు ఈశ్వరేచ్ఛ శక్తి. ఇచ్ఛామాత్రము శక్తి యని నవ్యనైయాయికులు తలతురు. బోధజనకత్వము శక్తి యని ప్రాచీనవైయాకరణమతము.

నాగేశుని మతము ననుసరించి ఇచ్ఛారూపమగు శక్తి పదపదార్థములకు సంబంధమనుట యుక్తము గాదు. సంబంధులకంటె భిన్నమగుచు ప్రతియోగ్యనుయోగులు రెండిటియందుండునది, ఆశ్రయమగుట ద్వారా విశిష్టబుద్ధినియామకము సంబంధమని సంబంధసామాన్య లక్షణము. ఇచ్ఛ కలది పదము, ఇచ్ఛ కలది పదార్థము అను వ్యవహారము లేకపోవుటచే సంబంధులగు పద పదార్థములకు ఆశ్రయమగుట ద్వారా విశిష్టబుద్ధి నియామకము కాకపోవుటచే ఇచ్ఛకు సంబంధత్వము చెప్పుట కుదరదు. అట్లే బోధజకత్వము పద - పదార్థములయందున్నను బోధజనకత్వ సంబంధముచే పదము పదార్థ విశిష్టము లేక పదార్థము పదవిశిష్టమను విశిష్టబుద్ధి కలుగుట లేదు గనుక విశిష్ట బుద్ధినియామకము కాకపోవుటచే బోధజనకత్వము శక్తియని చెప్పు ప్రాచీనవైయాకరణమతము కూడ యుక్తము గాదు. వాచ్యవాచకభావరూప సంబంధమే పదపదార్థముల శక్తి రూపసంబంధమని నాగేశభట్టు మతము. అధ్యాసమూలకమగు పద - పదార్థముల తాదాత్మ్యముచే వాచ్యవాచక భావాపరపర్యాయమగు శక్తిజ్ఞానము కలుగును. శక్తిజ్ఞాపకము అధ్యాసమూలకమగు తాదాత్మ్యమని తాత్పర్యము. భేదాభేద ఘటితము తాదాత్మ్యము. వైయాకరణ మతమున బౌద్ధమగు శబ్దము వాచకము. బుద్ధిస్థమగు అర్థము వాచ్యము బౌద్ధములగు పద - పదార్థములకు తాదాత్మ్యము వాస్తవికము గాని అధ్యస్తము గాదు.

నైయాయికులు అపభ్రంశములకు శక్తినంగీకరించరు. అసాధుశబ్దముల వలన సాధు శబ్దస్మరణము కలిగి అర్థబోధ కలుగునని వారి మతము. వైయాకరణులు సాధుశబ్దములయందు వలె అసాధుశబ్దములకు కూడ శక్తి నంగీకరింతురు. రూఢి, యోగము, యోగరూఢి యని శక్తి మూడు విధములు. నానార్థకస్థలమున సంయోగము, విప్రయోగము మున్నగువానిచే శక్తి తత్తదర్థములయందు నియంత్రితమగును.

**2. లక్షణా స్వరూపము :–** శక్యసంబంధము లక్షణయని నైయాయికమతము. తాత్పర్యానుపపత్తి లక్షణాబీజము. గంగాయాం ఘోషః అను వాక్యమున గంగాపదమునకు ప్రవాహము శక్యార్థము. దాని యందు ఘోషముండుట అనుపపన్నము కావున ప్రవాహమునకు సమీపవర్తియగు తటము గంగాపదముచే లక్షితమగుచున్నది. గౌణీ, శుద్ధాభేదముచే లక్షణ రెండు విధములు. ప్రకారాంతరముచే జహత్స్వార్థా, అజహత్స్వార్థా యని రెండు భేదములు గలవు. తాత్స్థ్యము, తాద్ధర్మ్యము మున్నగునవి లక్షణా నిమిత్తములు.

స్వబోధ్య సంబంధము లక్షణయని మీమాంసకమతము. 'గభీరాయాం నద్యాం ఘోషః' అను వాక్యమున గభీరాయాం నద్యామ్ అను ఖండ వాక్యముచే గాంభీర్యవిశిష్ట నదీతటము లక్షితమగుచున్నది.

శక్యతావచ్ఛేదకారోపము లక్షణయని శాబ్దికమతము. వైయాకరణమతమున లక్షణావృత్తి అతిరిక్తముగ నంగీకరించక అప్రసిద్ధశక్తి రూపముగ స్వీకరింపబడినది. తాత్పర్యమున్నచో సకల శబ్దములు సర్వార్థములను బోధించును. దేవతలు, ఋషులు మరియు లోకవ్యవహారాదులచే తాత్పర్య నిర్ణయము చేయవలెను.

**3. వ్యంజనా స్వరూపము :–** నైయాయికులు వ్యంజనను లక్షణావృత్తి

యందు గతార్థము చేయుచున్నారు. వ్యాకరణ దర్శనమున వ్యంజనా వ్యాపారమవశ్య మంగీకరించవలెను. ప్రాకృత ధ్వని వలన స్ఫోటాత్మక శబ్దము వ్యంగ్యమగుట వ్యంజనావ్యాపారాధీనమే. ఇదియంగీకరించని యెడల ప్రాదిచాదులకు ద్యోతకత్వముపపన్నముగాదు. వ్యంగ్యార్థ బోధలో పదము, అర్థము, పదైక దేశము మరియు చేష్టాదులు వ్యంజకములు.

**4. స్ఫోట స్వరూపము :–** స్ఫోటప్రకరణమున శక్తికి ఆశ్రయమగు శబ్దము ఏది యని విచారణ చేయబడినది. ద్వితీయాది వర్ణముల ఉచ్చారణము వ్యర్థము కావలసివచ్చును గాన కేవలవర్ణములకు శక్త్యాశ్రయత్వ-మంగీకరించుట యుక్తము గాదు. వర్ణములకు ఉచ్చరిత ప్రధ్వంసిత్వమంగీకరించుటచే వీనికి యౌగపద్యము సంభవము కాదు గనుక వర్ణసముదాయముకూడా శక్త్యాశ్రయము గాదు. శబ్ద - బుద్ధి - కర్మలు ద్విక్షణావస్థాయులగుటచే 'ఇది పూర్వము, ఇది పరము' అను వ్యవహారము కుదరకపోవును. నష్ట విద్యమాన వర్ణములకు అవ్యవహితోత్తరత్వ సంబంధము యుక్తము గాదు. కనుక శ్రూయమాణములగు వర్ణములకు లేక వర్ణ సముదాయమునకు శక్త్యాశ్రయత్వమంగీకరించుట యనుపపన్నము.

వైయాకరణులు స్ఫోటాత్మక శబ్దమును శక్తికి నాశ్రయముగ చెప్పుచున్నారు. పరా - పశ్యన్తీ - మధ్యమా - వైఖరీ యని వాక్కు నాలుగు విధములు. పరావాక్కు పశ్యన్తీ మధ్యమా వైఖరులుగ అభివ్యక్తమగును. చేతన రూపమగు మధ్యమా వాక్కు యొక్క నాదాంశము వలన స్ఫోటాత్మకమగు నిత్యశబ్దమభివ్యక్తమగును. దానివలన అర్థబోధ కలుగును. వైఖరీ నాదము ప్రాకృత వైకృత భేదముచే రెండు విధములు. పరశ్రోత్రగ్రాహ్యమగు ప్రాకృత ధ్వనిచే నిత్యమగు స్ఫోటాత్మక శబ్దమభివ్యంగ్య మగునని వాక్యపదీయమున భర్తృహరి చెప్పెను.

**5. శాబ్దబోధ సహకారి కారణములు :–** వృత్తిజ్ఞానసహకారముచే పదజ్ఞానమువలన పదార్థబోధకలుగును. శాబ్దబోధ జనక జ్ఞాన విషయ పదపదార్థ సంబంధము వృత్తియనబడును. వైయాకరణమతమున స్ఫోటాత్మకమగు నిత్యశబ్దము వృత్తికాశ్రయము. పదపదార్థసంబంధ-రూపమగు వాక్యార్థము శాబ్దబోధయనబడును. ఆకాంక్ష, యోగ్యత, ఆసత్తి, తాత్పర్యమని శాబ్దబోధ సహకారి - కారణములు నాలుగు. ముఖ్యకారణముకంటె భిన్నమై ముఖ్యకారణముచే కలుగు కార్యమును పుట్టించునవి సహకారి కారణములనబడును. శాబ్దబోధకు వృత్తిజ్ఞానము ముఖ్యకారణము ఆకాంక్షాదులు సహకారి కారణములు. ఇందు తాత్పర్య జ్ఞానమునకు శాబ్దబోధకారణత్వము నిరసింపబడినది.

## ఉపసంహారము

దార్శనిక తత్త్వములను సంగ్రహముగ తెలుసుకొనుటకు పరమలఘుమంజూష ఎంతయో ఉపకరించును. వైయాకరణ సిద్ధాంత లఘుమంజూషకు కళా, కుంజికాటీకలు సుప్రసిద్ధములు. అట్లే అస్మద్గురువర్యులు కీ॥ శే॥ మహామహోపాధ్యాయ పేరి సూర్యనారాయణ శాస్త్రిగారి లఘుమంజూషావ్యాఖ్య (ప్రాతిపదికార్థము, సుబర్థము, ధాత్వర్థాది ప్రకరణములు) మంజూషాకారుని హృదయము నావిష్కరించుచు శాస్త్రజ్ఞులకెంతో యుపకరించుచున్నవి. అట్లే పరమలఘుమంజూషకు కూడ సంస్కృతమున కొన్ని వ్యాఖ్యలు గలవు. కాని ఆంధ్రపాఠకులకు సులభముగ నర్థమగురీతిలో తెలుగుభాషలో పరిపూర్ణ వ్యాఖ్య లేకపోవుట లోటుగ కనిపించుటచే ఆంధ్ర భాషాసరస్వతిని యథోచితముగ పరమలఘుమంజూషా వ్యాఖ్యాకుసుమముతో సమర్చించదలచితిని. శాస్త్రగ్రంథములను బాలురకు సయితమర్థమగు రీతిలో సరళ శైలిలో

తెలుగులో బాలబోధినీ వ్యాఖ్యారూపమున పాఠకుల కందించు నా యీ తొలిప్రయత్నమును పాఠకులాదరింతురని తలచెదను. నాకు శాస్త్రపాండిత్యము ఆంధ్రభాషాజ్ఞానము రెండును తక్కువే యయినను సాహసము జేసితిని. ఈ విషయమున నేనెంతవరకు కృతకృత్యుడనయితినో పండితులే నిర్ణయించెదరు. తెలిసియో తెలియకయో కలిగిన గ్రంథ విరోధములను సహృదయులైన పండితులు తెలియజేసిన మలిముద్రణలో సవరించుకొనగలనని సవినయముగ మనవి జేయుచున్నాను.

నాకు సంస్కృతభాషనేర్పుటలో ఆద్యగురువులు మా తండ్రిగారు. శాస్త్రాధ్యయనమునకు ప్రోత్సహించి తగు మార్గములనన్వేషించినవారు మా తల్లిగారు మరియు మా బాబాయి కళా సీతారామశర్మ గారలు. మాతాపితరుల పాదపద్మములకు నమోవాకములర్పించుచు నా యీ గ్రంథమును వారికి సమర్పించుచున్నాను.

సీతమ్మ సుబ్బరావయోః పిత్రోశ్చరణ యోరిమామ్ ।
పరమలఘుమంజూషా భాషావ్యాఖ్యాం సమర్పయే ॥

పుత్రవాత్సల్యముతో న్యాయ, వ్యాకరణాది శాస్త్రములనధ్యాపనము గావించుచు మమ్ములననుగ్రహించు మా గురువులు మహామహోపాధ్యాయ, వేదశాస్త్రభూషణ బ్ర॥ వే॥ గోడా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. నాకు లేశమయినను శాస్త్రజ్ఞానము కలిగిన యది వారి యనుగ్రహము మాత్రమే. అన్నపూర్ణస్వరూపిణియైన మాగురుపత్నిగారు ఎంతో వాత్సల్యముతో మమ్ములనాదరించుచున్నారు. వారిరువురి పాదపద్మములకు నా నమస్సుమాంజలులనర్పించుచున్నాను.

వ్యాకరణశాస్త్రమున మా విద్యాగురువులు వైయాకరణ భూషణసారము, వైయాకరణ సిద్ధాన్త లఘుమంజూష, భాట్టరహస్యము మున్నగు పలు గ్రంథముల వ్యాఖ్యాతలు మహామహోపాధ్యాయ, వైయాకరణ

సార్వభౌమ కీ॥ శే॥ పేరి సూర్యనారాయణశాస్త్రిగారు. వారికి నా హృదయపూర్వక నమస్కారములు.

వ్యాకరణ శాస్త్రాధ్యయనమునకు ప్రోత్సహించి అధ్యాపనము గావించిన మా గురుమిత్రులు న్యాయ, వేదాంత వ్యాకరణశాస్త్ర పారంగతులు విశ్వనాథ గోపాల కృష్ణశాస్త్రిగారికి, గురువులు ఆచార్య కె.వి. రామకృష్ణమాచార్యులు గారికి, విద్యార్థి దశనుండి నా భవిష్యత్తు తీర్చిదిద్దిన మా గురువులు హయగ్రీవోపాసకులు కీ॥ శే॥ ముక్కవిల్లి అన్నప్ప దీక్షితులు గారికి నా నమస్సులు.

అలంకార శాస్త్రాధ్యాపనముగావించిన మా గురువులు కీ॥ శే॥ కరి పెద్ది పురుషోత్తమ శర్మగారు, బ్ర॥ వే॥ రామచంద్రుల కోటీశ్వర శర్మగారలకు నా నమోవాకములు. నా యీ స్థితికి మూలభూతమయినగౌతమీ విద్యాపీఠ వ్యవస్థాపకులు, నిర్వాహకులయిన కాంద్రేగుల జమీందారు వారి వంశవృక్షమునకు నా హృదయపూర్వక నమస్కారములు.

శాస్త్రాభివృద్ధికి తగు ప్రోత్సాహము కల్పించుచు అన్ని విధముల సహాయ సహకారములందించు మా విశ్వవిద్యాలయ కులపతులు ఆచార్య ఎస్. బి. రఘునాథాచార్యుల వారికి నా నమస్సులు.

ఈ గ్రంథమునకు ఆర్థిక సహాయమందించడం ద్వారా శ్రీవెంకటేశ్వర స్వామి అమ్మవార్ల అనుగ్రహమునకు పాత్రుని గావించిన తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యమునకు నా ధన్యవాదములు.

అన్ని విధముల తగు ప్రోత్సాహము నిచ్చుచున్న నా సోదరులు చి॥ డా॥ శ్రీపాద సుబ్రహ్మణ్యం, వెంకటేశ్వరరావులకు మరియు నా ధర్మపత్నికి శుభాభినందనలు.

పుస్తకముద్రణము దోషరహిత మొనర్చుటలో ఓపికతో సహకరించిన అన్నపూర్ణ గ్రాఫిక్స్, తిరుపతి వారికి నా కృతజ్ఞతలు.

శ్రీపాద సత్యనారాయణమూర్తి

శ్రీగురుభ్యో నమః

# పరమ లఘు మంజూష

మూలము :- శివం నత్వా హి నాగేశేనానిన్ద్యా పరమా లఘుః ।
వైయాకరణసిద్ధాన్తమంజూషైషా విరచ్యతే ॥

వ్యాఖ్యానము : - జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

చేయతలపెట్టిన కార్యము నిర్విఘ్నముగ సమాప్తి నొందుటకు మంగళమాచరించుట పరిపాటి. విఘ్నధ్వంస ద్వారా సమాప్తిఫలకము మంగళము. శిష్టుల ఆచారముచే ''సమాప్తిని కోరువాడు మంగళమాచరింప వలయు'' నను శ్రుతి అనుమానము చేయబడుచున్నది. మంగళమునకు సమాప్తి ఫలమని కొందరు, విఘ్నధ్వంస మాత్రము ఫలము, కార్యసమాప్తి బుద్ధిప్రతిభాదికారణములచే కలుగునని మరికొందరు. 'వృద్ధిరాదైచ్' సూత్రభాష్యమున పతంజలిమహర్షి ''మంగళార్థం వృద్ధిశబ్దమాదితః ప్రయుఙ్క్తే. మంగళాదీని మంగళమధ్యాని మంగళాన్తాని చ శాస్త్రాణి ప్రథన్తే, వీరపురుషాణి భవన్తి, ఆయుష్మత్పురుషకాణి చాధ్యేతారశ్చ వృద్ధియుక్తా యథా స్యుః'' అని చెప్పిరి. గ్రంథరచనయను కార్యము

నిర్విఘ్నముగ సమాప్తినొందుటకు ఇష్టదేవతా నమస్కారము చేయుచు నాగేశభట్టు 'నా గురువులచే మంగళమాచరింపబడినది, నేను కూడా చేయవలెనను' శిష్యశిక్షకై గ్రంథస్థము చేయుచున్నాడు. శివం నత్వేతి। పరమేశ్వరుని నమస్కరించి దోషరహితమగు, అత్యంతము లఘుభూతమగు (శబ్దాల్పత్వమున లాఘవముగాని అర్థ గాంభీర్యమున గాదు) వైయాకరణ సిద్ధాన్తములకు మంజూష వంటి వైయాకరణ సిద్ధాన్త పరమ లఘుమంజూష యనెడి గ్రంథము నాగేశభట్టుచే వ్రాయబడుచున్నది.

వ్యాక్రియన్తే శబ్దాః అనేనేతి వ్యాకరణమ్. ప్రకృతి - ప్రత్యయ విభాగ పూర్వకము సాధుశబ్ద వ్యుత్పాదకము వ్యాకరణము. లోకసిద్ధమగు సాధు - అసాధు శబ్దసముదాయము నుండి సాధుశబ్దములను వేరుజేసి ప్రకృతి ప్రత్యయ విభాగము చేయుట ద్వారా వ్యుత్పాదన చేయునది వ్యాకరణ శాస్త్రమని తాత్పర్యము. వ్యాకరణమ్ అధీయతే విదన్తి వా వైయాకరణాః, తేషాం సిద్ధాంతాః వైయాకరణ సిద్ధాంతాః; తేషాం మంజూషా వైయాకరణ సిద్ధాన్త మంజూషా. వైయాకరణ సిద్ధాన్తములకు మంజూష వంటిది ప్రకృత గ్రంథమని తాత్పర్యము.

వ్యాక్రియన్తే = అసాధుశబ్దేభ్యః సాధుశబ్దాః పృథక్క్రియన్తే యేన తద్ వ్యాకరణమ్. వి, ఆఙ్ ఉపసర్గ ద్వయ పూర్వక కృఞ్ ధాతువు కంటె కరణార్థమందు ల్యుట్ ప్రత్యయము. వ్యాకరణమ్ అధీయతే విదన్తి వా వైయాకరణాః। 'తదధీతే తద్వేద' అను సూత్రముచే అణ్ ప్రత్యయము, 'న య్వాభ్యాం పదాన్తాభ్యాం పూర్వౌ తు తాభ్యామైచ్' అను సూత్రముచే ఐజాగమము. సిద్ధః = నిష్పన్నః, అన్తః = నిశ్చయః యేషాం తే సిద్ధాన్తాః, వైయాకరణానాం సిద్ధాన్తాః వైయాకరణ సిద్ధాన్తాః। వైయాకరణ సిద్ధాన్తానాం (మంజూషా ఇవ) మంజూషా వైయాకరణ సిద్ధాన్త మంజూషా। ఇచ్చట మంజూషా శబ్దమునకు మంజూషా సదృశమందు లక్షణ.

అ ఇ ఉ ణ్, ఋ ఌ క్ మున్నగు పదునాలుగు సూత్రములు మాహేశ్వర సూత్రములు. పాణినీయ వ్యాకరణము తన్మూలకమగుటచే మహేశ్వర నమస్కారము ఎంతో సముచితము.

ఆత్మనామ గురోర్నామ నామాతికృపణస్య చ ।
శ్రేయస్కామో న గృహ్ణీయా జ్యేష్ఠాపత్యకళత్రయోః ॥

అను స్మృతివచనముచే స్వీయనామగ్రహణము దోషము కదాయని శంకింపవచ్చును. కాని స్మృతివచనమున 'న గృహ్ణీయాత్' అనుదానికి 'నోచ్చారయేత్' = ఉచ్చరించుట దోషమని చెప్పుటచే లేఖనమున దోషము లేదు. ఇది శిష్టాచార సిద్ధము, 'రామో ద్విర్నాభిభాషతే, మనురబ్రవీత్, శాతాతపోఽబ్రవీత్' మున్నగు స్థలములలో ప్రతిజ్ఞావాక్యమున నామోచ్చారణము చేయబడినది. కనుక లేఖనమున లేక ప్రతిజ్ఞా వాక్యమున ఆత్మనామోచ్చారణము దోషావహము కాదు. నాగేశభట్టు వైయాకరణ సిద్ధాన్త మంజూషను పిమ్మట స్పష్ట ప్రతిపత్తికై వైయాకరణ సిద్ధాన్త లఘుమంజూషను,- పిమ్మట పాఠక సౌకర్యము కొఱకు పరమ లఘుమంజూషను రచించెను.

**అనుబంధ చతుష్టయము** :- గ్రంథాధ్యయన ప్రవృత్తి ప్రయోజక జ్ఞానవిషయత్వమ్ అనుబంధత్వమ్. గ్రంథము యొక్క అధ్యయనమందు ప్రవర్తించుటకు ప్రయోజకమగు జ్ఞానమున విషయమగుట అనుబంధమని చెప్పబడును. అది నాలుగు విధములు.

**విషయశ్చాధికారీ చ సంబంధశ్చ ప్రయోజనమ్ ।**
**అనుబంధం వినా గ్రంథే మంగళం నైవ శస్యతే ॥**

అను వచనముచే మంగళాచరణమందు అనుబంధ చతుష్టయము అత్యావశ్యకము. విషయము, అధికారి, సంబంధము, ప్రయోజనము అని

అనుబంధము నాలుగు విధములు. 'వైయాకరణ సిద్ధాంత పరమ లఘుమంజూషాఖ్య గ్రంథాధ్యయనము మదిష్ట సాధనము అనుజ్ఞానము గ్రంథాధ్యయన ప్రవృత్తి ప్రయోజకము. ఇచ్చట వైయాకరణ సిద్ధాంతములు విషయము. తజ్జ్ఞానము ప్రయోజనము. జిజ్ఞాసువు అధికారి. విషయ గ్రంథములకు ప్రతిపాద్య ప్రతిపాదక భావము సంబంధము. విషయ - అధికారులకు జ్ఞేయ జ్ఞాతృభావము సంబంధము.

**నమస్కారము :-** స్వనిష్ఠాపకృష్టత్వప్రకారక బోధానుకూలవ్యాపారము నమస్కారము. స్వపదముచే నమస్కర్తను గ్రహింపవలెను. నమస్కారము చేయువాని వ్యాపారము వలన నమస్కార్యుడగు గురువునకు 'నమస్కర్త తనను నా కంటె అపకృష్టుడుగ చెప్పుకొనుచున్నాడను బోధ కలుగును. బోధరూప ఫలమునకాశ్రయము గురువు.

**ఏషా విరచ్యతే :-** 'ఇదమేతదోః సన్నికృష్టే' । సన్నికృష్టమగు విషయమున ఇదమ్, ఏతచ్ఛబ్దములు ప్రయోగింపబడును. పరమ లఘుమంజూష యను గ్రంథము ఇంతవరకు సిద్ధము కాకపోవుటచే అసన్నికృష్టము. మరి 'ఏషా' యని 'ఏతచ్ఛబ్ద ప్రయోగమెట్లు ఉపపన్నమగునను శంకకు సమాధాన మిట్లు - పరమలఘు మంజూషకు సంబంధించిన విషయమంతయు గ్రంథకర్తకు బుద్ధిస్థమగుటచే ఏతచ్ఛబ్ద ప్రయోగముపపన్నము. దానిని విరచ్యతే = గ్రంథస్థము చేయుచున్నాడని తాత్పర్యము. విపూర్వక రచ ధాతువు కంటె వర్తమాన సామీప్యమందు భవిష్యదర్థమున వర్తమాన ప్రత్యయము.

**మూలము :– తత్ర వర్ణ – పద – వాక్యభేదేన స్ఫోట స్త్రిధా । తత్రాపి జాతివ్యక్తి భేదేన పునః షోఢా । అఖండ పదస్ఫోటః, అఖండవాక్య స్ఫోటశ్చేతి సంకలనయా అష్టౌ స్ఫోటాః ।**

**వ్యాఖ్యానము :-** పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ యని. వాక్కు నాలుగు విధములు, అందు వైఖరీధ్వనిచే స్ఫోటరూపమగు నిత్యశబ్ద మభివ్యక్తమగు

ననుట వైయాకరణ సమయము. అట్టి నిత్యమగు స్ఫోటశబ్దమునకే వాచకత్వమును వైయాకరణులు అంగీకరింతురు. స్ఫోటవాదము విచిత్రమగు ప్రక్రియ. ఇది స్ఫోట ప్రకరణమున నిరూపింపబడగలదు.

వర్ణ - పద - వాక్య భేదముచే స్ఫోట మూడు విధములు. అది జాతి, వ్యక్తి భేదముచే ఆరు విధములు. అఖండ పదస్ఫోట, అఖండ వాక్యస్ఫోటలతో కలిపి స్ఫోట ఎనిమిది విధములు.

1. వర్ణస్ఫోట 2. పదస్ఫోట
3. వాక్యస్ఫోట 4. వర్ణజాతిస్ఫోట
5. పదజాతిస్ఫోట 6. వాక్యజాతిస్ఫోట
7. అఖండ పదస్ఫోట 8. అఖండ వాక్యస్ఫోట

ఇచ్చట వర్ణమను పదముచే ప్రకృతిప్రత్యయములు గ్రాహ్యములు.

మూలము :- తత్ర వాక్యస్ఫోటో ముఖ్యః, తస్యైవ లోకే అర్థబోధకత్వాత్ తేనైవార్థసమాప్తేశ్చేతి। తదాహ న్యాయభాష్యకారః "పద సమూహో వాక్యమర్థ సమాప్తౌ" (న్యాయ భాష్యము 2-1-25) ఇతి। అస్య సమర్థమితి శేషః। తత్ర ప్రతివాక్యం సంకేతగ్రహాసంభవాత్ వాక్యాన్వాఖ్యానస్య లఘూపాయేనాశక్యత్వాచ్చ కల్పనయా పదాని ప్రవిభజ్య పదే ప్రకృతిప్రత్యయభాగాన్ ప్రవిభజ్య కల్పితాభ్యామన్వయవ్యతిరేకాభ్యాం తత్తదర్థవిభాగం శాస్త్రమాత్రవిషయం పరికల్పయంతి స్మ ఆచార్యాః।

వ్యాఖ్యానము :- ఎవరినైన యొక పనియందు ప్రవర్తింప చేయవలెను లేదా నివర్తింపచేయవలె నన్న వాక్యప్రయోగ మావశ్యకము. పదసముదాయము వాక్యము. కేవల పదార్థజ్ఞానము లోకమున సర్వత్ర ప్రవర్తకము లేదా నివర్తకము కాజాలదు. తదర్థమై నిరాకాంక్షమగు వాక్యార్థ మపేక్షింపబడుచున్నది. అట్టి వాక్యార్థబోధకు కారణభూతమగు వాక్యస్ఫోట

స్ఫోటభేదము లన్నిటిలో ముఖ్యముగా పేర్కొనబడుచున్నవి. సుబంత తిజంత పద సముదాయము వాక్యము. అట్టి వాక్యమే యర్థబోధక మగునని న్యాయభాష్యకారుడు వాత్స్యాయనుడు నుడివెను. ''పద సమూహో వాక్యమర్థసమాప్తౌ'' అని. ఇచ్చట పదమనగా సుబంత తిజంతములు. ''తే విభక్త్యంతాః పదమ్'' (న్యాయసూ. 2-2-60) అని గౌతమమహర్షి చెప్పెను.

పైన పేర్కొనినట్లు అఖండవాక్యస్ఫోటకు ముఖ్యత్వ మంగీకరించి, దానికే వాచకత్వము స్వీకరించిన ప్రకృతి ప్రత్యయ విభాగము ద్వారా పదవ్యుత్పాదకమగు వ్యాకరణశాస్త్రమునకు వాక్యప్రసక్తి లేని కారణమున వైయర్థ్య మాశంకించిన దానికిట్లు సమాధానము - ఈ పద మీయర్థమందు శక్తమను శక్తిజ్ఞానము లేనిచో అర్థబోధ కలుగదు. శక్తిగ్రహము పదములకు వలె వాక్యమునకు సంభవించదు. శక్తిగ్రహసహకారముచే పదజ్ఞానమువలన పదార్థబోధ కలుగును. అట్టి పదార్థముల పరస్పర సంసర్గమే వాక్యార్థము. పదార్థబోధ లేకుండా వాక్యార్థబోధ కలుగదు కదా. వాక్యములు విభిన్నరూపములగుటచే వాక్యమునకు వాక్యార్థమందు శక్తిగ్రహము సంభవించదు. పైగా వ్యాకరణశాస్త్రాతిరిక్తమగు లఘూపాయముతో సమస్త వాక్యజాలము చెప్పుట కుదరదు. కనుక తదర్థమై అసత్తగు సుబంతతిజంతమను పదవిభాగము వాక్యమున, ప్రకృతి ప్రత్యయ విభాగము పదమున కల్పింపబడినది. ఆయా ప్రకృతులు లేదా ప్రత్యయములవలన ఆయాయర్థములు ప్రతీతములగును, అవి లేకపోయిన తత్తదర్థములు ప్రతీతములు కావను అన్వయ వ్యతిరేకములచే ( తత్సత్త్వే తత్సత్త్వమితి అన్వయః, తదభావే తదభావః వ్యతిరేకః) ప్రకృతి ప్రత్యయముల కర్థకల్పన చేయబడినది. ఋషులు చేసిన యీ కాల్పనిక విభాగమంతయు వ్యాకరణశాస్త్రీయప్రక్రియానిర్వాహముకొఱకేయని తెలియవలెను.

ఉపాయాః శిక్షమాణానాం బాలానా ముపలాలనాః।
అసత్యే వర్త్మని స్థిత్వా తత స్సత్యం సమీహతే॥

వస్తుతః అఖండవాక్యస్ఫోటయే సత్యము. అదియే అర్థబోధకము.

**విశేషము :- తత్ర :-** తచ్ఛబ్దము బుద్ధిస్థార్థమును చెప్పును. నిర్ధారణ సప్తమ్యంతముకంటె స్వార్థికమగు 'త్రల్' ప్రత్యయము చేయగ 'తత్ర' శబ్దము నిష్పన్నమగును. తత్ర = వైయాకరణ సిద్ధాన్తసముదాయావయవభూతమని యర్థము, అది వాక్యస్ఫోట. వాక్యం చాసౌ స్ఫోటశ్చ = వాక్యరూపమగు స్ఫోటయని కర్మధారయసమాసము. 'వచోఽశబ్ద సంజ్ఞాయామ్' 7-3-67. శబ్దసంజ్ఞకానప్పుడు కుత్వనిషేధముచే 'వాచ్యమ్' అని, శబ్దసంజ్ఞయందు 'వాక్యమ్' అని యగును. కనుక ముఖ్యమగు శబ్దసంజ్ఞావ్యవహారము వాక్యమందేనని స్పష్టము. పదాదుల యందారోపితము. స్ఫుటతి అర్థః యేన సః స్ఫోటః, అర్థ విషయక బోధజనకము శబ్దస్ఫోట. చక్షుస్సు మున్నగు ఇంద్రియములచే గూడ ఘటాది విషయకార్థ బోధ కలుగుచుండుటచే చక్షురాదుల యందు స్ఫోటలక్షణమున కతివ్యాప్తిగలుగును గాన 'స్ఫుట్యతే = ధ్వనినా అభివ్యజ్యత ఇతి స్ఫోటః' అను వ్యుత్పత్తిని గూడ చెప్పవలయును. ధ్వనిచే వ్యంగ్యముగుచు అర్థవిషయక బోధజనకము స్ఫోటయని సిద్ధించినది.

''యేనోచ్చారితేన సాస్నాలాంగూల కకుద ఖురవిషాణినాం సంప్రత్యయో భవతి స శబ్దః'' అను మహాభాష్యకారుల వచనముచే రెండు విధముల వ్యుత్పత్తులు సిద్ధించుచున్నవి. 'యేనోచ్చారితేన = యేనోచ్చారిత ప్రకాశితేన' అను వ్యాఖ్యానముచే ధ్వనివ్యంగ్యత్వము, 'సాస్నాలాంగూల కకుదఖురవిషాణినాం సంప్రత్యయో భవతి' అను దానిచే అర్థ విషయక బోధజనకత్వము సిద్ధము.

వాక్యస్ఫోట పక్షము, ముఖ్యత్వము సాధ్యము, లోకే తస్యైవార్థ

బోధకత్వాత్ అనునది హేతువు. ఇచ్చట ముఖ్యత్వ రూపసాధ్యము లేని పదస్ఫోటయందు అర్థబోధజనకత్వ రూపహేతువుండుటచే సాధ్యాభావ వద్వృత్తి హేతువగుటచే వ్యభిచార దోష గ్రస్తము హేతువను శంక కలుగగ 'తేనైవార్థ సమాప్తేశ్చ' అని హేతువును పూరించుచున్నాడు. 'లోకే తస్యైవార్థ విషయక నిరాకాంక్ష బోధజనకత్వాత్' అని హేతు స్వరూపము.

అర్థ బోధ సమాప్తిలో సమర్థమగు పదసముదాయాత్మకము వాక్యమని న్యాయభాష్యకారుడు చెప్పెను. పదసముదాయాత్మకము వాక్యమని చెప్పిన, అనర్థక సముదాయమందు వాక్య లక్షణమున కతివ్యాప్తి కలుగును. క్రియాకారకములకు పరస్పరము నియతాకాంక్ష యుండును. అట్టి యాకాంక్ష నుపశమింపజేయు పద సముదాయాత్మకము వాక్యము.

వాక్యస్ఫోటయే ముఖ్యమన్నచో వాక్యావయవములగు పదములు, పదావయవములగు ప్రకృతి ప్రత్యయము లసత్తులగుటచే పాణిన్యాది మహర్షుల తద్వర్ణన అప్రామాణికము కావలసివచ్చునను శంక కలుగును. దానికి సమాధానము - **రేఖాగవయ** న్యాయముచే వాక్య తదర్థములను తెలియజెప్పుటకు ఉపాయములుగ తదవయవములు నిరూపింపబడుటచే అప్రామాణ్య దోషము లేదు. అర్థవత్ సూత్ర భాష్యమున భాష్యకారులు విశేష్య విశేషణభావరూప సంసర్గమందు వాక్యమునకు శక్తి నంగీకరించి సమాసగ్రహణమునకు నియమార్థత్వము చెప్పిరి. ఆ సందర్భమున ప్రదీపవ్యాఖ్యాకారుడు కైయటుడు వాక్యమునకు ధ్వనివ్యంగ్యత్వము, నిత్యత్వము చెప్పి పదార్థ సంసర్గరూప విశిష్టార్థ వాచకత్వమును పేర్కొనెను. ఈ రెండు గ్రంథముల వలన పదసముదాయాత్మకమగు వాక్యమును, పదార్థ సంసర్గరూప వాక్యార్థమును నిరూపించుటలో ఋషితాత్పర్యమని తెలియుచున్నది.

వాక్యస్ఫోటయందే వైయాకరణులకు ముఖ్య తాత్పర్యము. ప్రకృతి ప్రత్యయాద్యవయవములచే వాక్యస్వరూపము జ్ఞాతమగును గాన కేవలము అసత్తులగు అవయవములను (పకృతి ప్రత్యయాదులను) కల్పించిన సరిపడుచుండగ అవయవార్థముల నేల కల్పింపవలె నను శంకకలుగును. దానికి 'శ్రుతి వాక్యాదీనాం బలాబలవిచార కల్పనార్థం చ తత్కల్పనేతి బోధ్యమ్' అని లఘుమంజూషలో సమాధానము చెప్పెను. 'తత్కల్పనేతి అవయవ తదర్థ కల్పనేత్యర్థః। ఇదం చావయవకల్పనాతో న సిధ్యతీతి భావః' అని కళాటీక. శ్రుతిలింగవాక్య ప్రకరణ స్థాన సమాఖ్యానాం పరస్పరం సమవాయే పారదౌర్బల్యమర్థ విప్రకర్షాత్''. (జైమిని సూత్రము) శ్రుతి - లింగము - వాక్యము - ప్రకరణము - స్థానము - సమాఖ్య ఈ ప్రమాణములలో రెండిటికి ఒకచోట ప్రాప్తియున్న పూర్వము కంటె పరమునకు దౌర్బల్య విచారమున ప్రకృత్యాద్యర్థ విచారము కూడ అపేక్షితమే.

మూలము :- తత్ర శాస్త్రప్రక్రియా నిర్వాహకో వర్ణస్ఫోటః। ప్రకృతి ప్రత్యయాః తత్తదర్థవాచకా ఏవేతి తదర్థః। ఉపసర్గ నిపాత ధాత్వాది విభాగోఽపి కాల్పనికః। స్థానినో లాదయ ఆదేశాస్తిబాదయః కల్పితా ఏవ। తత్ర ఋషిభిః స్థానినాం కల్పితా అర్థాః కంఠరవేణైవోక్తాః। ఆదేశానాం తు స్థాన్యర్థాభిధాన సమర్థ స్యైవాదేశతేతి భాష్యాత్తే అర్థాః। ఏవం చ స్థానినాం వాచకత్వమాదేశానాం వేతి విచారో నిష్ఫల ఏవ, కల్పిత వాచకత్వస్యోభయత్ర సత్వాత్। ముఖ్యం వాచకత్వం తు కల్పనయా బోధితసముదాయరూపే పదే వాక్యే వా, లోకానాం తత ఏవార్థ బోధాత్।

ఉపేయప్రతిపత్త్యర్థా ఉపాయా అవ్యవస్థితా

(వై. భూ. సా. 68. కారిక)

ఇతి న్యాయేన వ్యాకరణభేదేన స్థానిభేదేఽపి న క్షతిః, దేశభేదేన లిపిభేదవ దితి దిక్।

**వ్యాఖ్యానము :-** స్ఫోటభేదములలో మొదటిదగు వర్ణస్ఫోటను వివరించుచున్నాడు. ఇచ్చట వర్ణపదముచే పదావయవములగు ప్రకృతి ప్రత్యయములు గ్రాహ్యములు. అవియే తత్తదర్థవాచకములు. కనుక వర్ణస్ఫోటపదమునకు పదావయవములగు ప్రకృతి ప్రత్యయములు తత్తదర్థవాచకములని యర్థము. ఈ స్ఫోట వ్యాకరణ శాస్త్రప్రక్రియా నిర్వాహకము. అనగా పదవ్యుత్పాదకమగు ప్రక్రియా నిర్వాహకమైన వ్యాకరణ శాస్త్రీయ సూత్రప్రవృత్తికి వర్ణస్ఫోట యుపకరించును. ప్రకృతి ప్రత్యయాది విభాగము వలె ఉపసర్గ - నిపాత - ధాత్వాది విభాగము కూడా శాస్త్రప్రక్రియా నిర్వాహము కొఱకు కాల్పనికమే. ఇట్లే లకారాది స్థానులు, తిబాద్యాదేశములు కూడా కల్పితములే. వానిలో స్థానులకు కల్పితములగు నర్థములు ''లః కర్మణి చ భావే చాకర్మకేభ్యః'' మున్నగు రీతిని ఋషులచే చెప్పబడినవి. స్థాన్యర్థమును చెప్పుటలో సమర్థమగునది ఆదేశము కాబట్టి స్థాన్యాదేశములు రెండిటికి కల్పితవాచకత్వము సిద్ధించుటచే స్థాన్యాదేశములలో వేనికి వాచకత్వమను విచారణ నిష్ఫలము. లోకమున పదము లేక వాక్యశ్రవణము వలననే యర్థబోధ కలుగుచుండుటచే ముఖ్యమగు వాచకత్వము ప్రకృతి ప్రత్యయ సముదాయముగ కల్పితమగు పదమునకు లేక వాక్యమున కంగీకరింప వలసియున్నది. ఉపేయ ప్రతిపత్త్యర్థాః తెలుసుకోదగిన యర్థము యొక్క జ్ఞానము కొఱకు (పొందదగిన వస్తువును పొందుటకు) ఉపాయాః = సాధనములు, అనంతములను వ్యాయముచే దేశభేదముచే స్థానులు భిన్నభిన్నములయినను గౌరవలాఘవపర్యాలోచనకు అవకాశము లేదు. ఈ కాల్పనిక విభాగమంతయు వాస్తవిక స్ఫోట స్వరూపజ్ఞానము కొఱకే.

పంచకోశాది వత్తస్మాత్ కల్పనైషా సమాశ్రితా ।
ఉపేయ ప్రతిపత్త్యర్థా ఉపాయా అవ్యవస్థితాః ॥

అనునది కౌండభట్ట విరచితమగు వైయాకరణ భూషణసారములోని కారిక. భట్టోజీదీక్షితులు వ్రాసిన వైయాకరణమతోన్మజ్జన మను కారికలకు కౌండభట్టు చేసిన వ్యాఖ్యానమే భూషణసారము. పంచకోశ ఘట్టము తైత్తిరీయోపనిషత్తు లోని భృగువల్లిలోనిది. వరుణపుత్రుడగు భృగువు తన తండ్రిని బ్రహ్మపదార్థమును గూర్చి యడుగగా వరుణుడు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, అనందమయ కోశము లైదింటిని తెళిపి అవాస్తవికములగు పూర్వపూర్వ కోశముల ద్వారా వాస్తవికమగు ఆనందమయము బ్రహ్మమని తద్ జ్ఞానము కలిగించెను. పంచమకోశము సత్యమైనను ఇది తెలుసుకొనుటకు మిగిలిన నాలుగు, సాధనములగుటచే వాటికి నైరర్థక్యములేదు. అట్లే వాస్తవికస్ఫోటను తెలుసుకొనుటకు కల్పితమయిన ప్రకృతి ప్రత్యయాది విభాగము నిరర్థకము గాదు.

## స్ఫోటనిరూపణము సమాప్తము

## అథ శక్తినిరూపణమ్

**మూలము :-** తత్ర "ప్రత్యక్షానుమానోపమానశబ్దాః ప్రమాణాని" (న్యాయసూ. 1-1-3) ఇతి గౌతమసూత్రే శబ్దశ్చాప్తోపదేశరూపః ప్రమాణమ్. ఆప్తో నామానుభవేన వస్తుతత్త్వస్య కార్త్స్న్యేన నిశ్చయవాన్, రాగాదివశాదపి నాన్యథావాదీ యః స ఇతి చరకే పతంజలిః తద్ధర్మావచ్ఛిన్నవిషయకశాబ్దబుద్ధిత్వావచ్ఛిన్నం ప్రతి తద్ధర్మావచ్ఛిన్న నిరూపిత వృత్తివిశిష్టజ్ఞానం హేతుః। అత ఏవ నాగృహీతవృత్తికస్య శాబ్దబోధః। అత ఏవ చ 'నహి గుడ ఇత్యుక్తే మధురత్వం ప్రకారతయా గమ్యతే' ఇతి సమర్థ సూత్రభాష్యం సంగచ్ఛతే। గుడాది శబ్దేన గుడత్వ జాత్యవచ్ఛిన్నో గుడపదవాచ్య ఇత్యేవ బోధో జాతిప్రకారకః, మధురత్వం తు 'గుడో మధుర ఐక్షవత్వాత్' ఇత్యనుమానరూపమానాంతరగమ్యమ్।

**వ్యాఖ్యానము :-** యథార్థము, అయథార్థమను భేదముచే జ్ఞానము రెండు విధములు. అందు యథార్థ జ్ఞానము ప్రత్యక్షము, అనుమితి, ఉపమితి, శాబ్ద భేదముచే నాలుగు విధములు. తత్కారణములగు ప్రమాణములు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దమని నాలుగు విధములు. (న్యాయ. సూ. 1-1-3) వానిలో సమస్త శబ్దములు ప్రమాణములు కాజాలవు. ఆప్తోచ్చరితమగు శబ్దమే ప్రమాణము. అనుభవబలముచే పదార్థతత్త్వమును వాస్తవికముగ తెలుసుకొనినవాడై సాంసారిక రాగద్వేషాదులకు లోనై అసత్యము పలుకనివాడు ఆప్తుడని చరకసంహితలో పతంజలి పేర్కొనెను.

ప్రత్యక్షము, అనుమితి, ఉపమితి, శాబ్దమను యథార్థ జ్ఞాన చతుష్టయములో శాబ్దబోధరూపప్రమకు ఆప్తోచ్చారితమగు శబ్దము యొక్క జ్ఞానము కారణము గాని స్వరూపతః శబ్దము కారణము గాదు. ఏ ధర్మము దేనికి అవచ్ఛేదకమో యది తద్ధర్మావచ్ఛిన్నమగును. ఘటత్వాదులు ఘటాదుల కవచ్ఛేదక ధర్మములు కనుక ఘటాదులు ఘటత్వాద్యవచ్ఛిన్నములు. జ్ఞానము, ఇచ్ఛ, కృతి మూడును సవిషయక పదార్థములు. శాబ్దబోధయనునది కార్యము. ఇది ఘట, పటాది విషయకము. ఘట, పటాదులు ఘటత్వ పటత్వాద్యవచ్ఛిన్నములు. ఘటత్వావచ్ఛిన్న విషయక శాబ్దబోధను గూర్చి ఘటత్వావచ్ఛిన్న నిరూపిత వృత్తివిశిష్ట జ్ఞానము కారణమగును. వృత్తియనగా ప్రకృతమున శక్తి. ఘటపదము ఘటరూపార్థమందు శక్తము అను శక్తిజ్ఞానము వలన ఘటత్వావచ్ఛిన్నార్థ నిరూపిత వృత్త్యాశ్రయము ఘటపదము. వృత్తివైశిష్ట్యము జ్ఞానమున ఎట్లో ముందు నిరూపింపబడును.

తద్ధర్మావచ్ఛిన్న నిరూపిత వృత్తి విశిష్టజ్ఞానము తద్ధర్మావచ్ఛిన్న విషయక శాబ్దబోధను గూర్చి కారణమని చెప్పుటచే వృత్తిజ్ఞానము లేని- ...

శాబ్దబోధ కలుగదు. శాబ్దబోధ వృత్తిజ్ఞానములకు కార్యకారణ భావమంగీకరించుటచే గుడ (బెల్లము) పదశ్రవణముచే గుడత్వ ప్రకారకబోధ కలునుగు గాని మధురత్వ ప్రకారకబోధ కలుగదు. అనగా శాబ్దబోధలో మధురత్వము ప్రకారముగ భాసించదు. గుడపదము గుడత్వావచ్ఛిన్నార్థమందు శక్తమను వృత్తిజ్ఞానమున గుడత్వము ప్రకారముగ= విశేషణముగ భాసించుటచే శాబ్దబోధలో కూడా గుడత్వమే ప్రకారముగ భాసించును గాని మధురత్వముగాదు అను సమర్థ సూత్రస్థ భాష్య ముపపన్నమగు చున్నది. 'గుడము, మధురము,' ఇక్షువికారమగుటవలన' అను అనుమాన ప్రమాణముచే మధురత్వము ప్రతీతమగును (అనుమేయమగును). కాని మధురత్వ ప్రకారక బోధమాత్రము కలుగదు.

**విశేషము** :- వాక్యరూప శబ్దమునకు వాచకత్వమును చెప్పి దానికే ప్రామాణ్యమును నిరూపించుచున్నాడు. తత్ర = వాక్యములలో. ఉపదిశ్యతే అసౌ ఉపదేశః, కర్మార్థమందు ఘఞ్ ప్రత్యయము. ఆప్తస్య ఉపదేశః = ఉచ్చారితః. ఆప్తకర్తృకోచ్చారణ క్రియాకర్మీభూతమగుశబ్దము. లేక ఉపదేశనముపదేశః, భావార్థమందు ఘఞ్ప్రత్యయము. ఆప్తస్య ఉపదేశః ఆప్తోపదేశః. తేన రూప్యతే = బోధ్యత ఇతి ఆప్తోపదేశరూపః, కర్మణి ఘఞ్ ప్రత్యయము. ఆప్తకర్తృకోచ్చారణబోధ్యమగు శబ్దము ప్రమాణమని తాత్పర్యము.

**తద్ధర్మావచ్ఛిన్నము** :- 'అవ' ఉపసర్గపూర్వక 'ఛిదిర్' (ద్వైధీకరణే) ధాతువుకంటె కర్మణి క్తప్రత్యయము చేయగా అవచ్ఛిన్నమను రూపము సిద్ధించును. అవాచ్ఛేదీతి అవచ్ఛిన్నః = వ్యావృత్తము = పృథక్కృతము. ఘటత్వావచ్ఛిన్నము = ఘటత్వమనుధర్మముచే వ్యావృత్తము = ఇతరములనుండి వేరుచేయబడినది ఘటము. ఏ ధర్మముతో నేది అవచ్ఛిన్నమో = పృథక్కృతమో, ఆ ధర్మము దానికి అవచ్ఛేదకమగును=

వ్యావర్తకమగును. ఘటత్వావచ్ఛిన్నము ఘటమగుటచే ఘటత్వము ఘటమునకవచ్ఛేదకము.

మూలము :- విశేష్యవిశేషణభావవ్యత్యాసే గృహీతశక్తికస్య పుంసో ఘటపదాద్ ఘటత్వవిశిష్టబోధ వారణాయ తద్ధర్మావచ్ఛిన్నేతి । జ్ఞానే వృత్తివైశిష్ట్యం చ స్వవిషయకోద్బుద్ధసంస్కార సామానాధికరణ్య - స్వాశ్రయ పదవిషయకత్వోభయ సంబంధేన బోధ్యమ్ । అతో నాగృహీతవృత్తికస్య, నాపి విస్మృతవృత్తికస్య, నాపి తత్పదమజానతో, నాపి ఘటపదా-శ్రయత్వేనోపస్థితాకాశస్య, నాపి జనకతయోపస్థితచైత్రాదేశ్చ బోధః। సంస్కారకల్పికా చ వృత్తిస్మృతిరేవ శాబ్దబుద్ధిరేవ వేత్యన్యదేతత్ ।

వ్యాఖ్యానము :- పైన పేర్కొనిన కార్యకారణ భావములో కార్యతావచ్ఛేదకకోటిలో తద్ధర్మావచ్ఛిన్నత్వమను విశేషణ నివేశము చేయక తద్విషయక శాబ్దబోధను గూర్చి తద్ధర్మావచ్ఛిన్న నిరూపిత వృత్తివిశిష్టజ్ఞానము కారణమని చెప్పిన దోషము చెప్పుచున్నాడు. 'ఘటపదము ఘటావచ్ఛిన్నఘటత్వమందు శక్తమని విశేషణ విశేష్యభావ వ్యత్యాసముతో శక్తిజ్ఞానము కల్గిన పురుషునికి ఘటత్వావచ్ఛిన్న ఘట విషయకబోధను వారించుటకై తద్ధర్మావచ్ఛిన్నమను విశేషణము గ్రహింపబడినది. కనుక తద్ధర్మావచ్ఛిన్న (=ఘటత్వావచ్ఛిన్న) విషయకశాబ్దబోధను గూర్చి తద్ధర్మావచ్ఛిన్న నిరూపితవృత్తిజ్ఞానము కారణమని సిద్ధించుటచే విపరీతజ్ఞానము (ఘటము ప్రకారముగ, ఘటత్వము విశేష్యముగ) వలన ఘటత్వ ప్రకారక ఘటవిశేష్యక బోధ కలుగదు.

జ్ఞానమందు వృత్తివైశిష్ట్యము స్వవిషయకోద్బుద్ధ సంస్కార సామానాధికరణ్య, స్వాశ్రయపద విషయకత్వోభయ సంబంధేన. అనగా జ్ఞానమందు వృత్తి పై రెండు సంబంధములతో నుండవలెను. వృత్తి విశిష్టము

జ్ఞానము కనుక వృత్తి స్వపద గ్రాహ్యము. ఇచ్చట రెండు సంబంధములు కలవు.

(1) స్వవిషయకోద్బుద్ధ సంస్కార సామానాధికరణ్యము

(2) స్వాశ్రయపదవిషయకత్వము.

ప్రథమతః అనుభవము, దానివలన సంస్కారము, అట్టి సంస్కారము వలన ఉద్బోధక సామగ్రీ సహకారముచే స్మృతి కలుగును. జ్ఞానము కించిద్విషయకమగుటచే అది విషయమందు విషయతాసంబంధముతో నుండును. ప్రకృతమున పదరూప విషయమున వృత్తివిషయకోద్బుద్ధ సంస్కారము, పదజ్ఞానము రెండును విషయతా సంబంధముతో సమానాధికరణములై యున్నవి. కనుక స్వ = వృత్తివిషయకోద్బుద్ధ సంస్కార సామానాధికరణ్యము పదజ్ఞానమున కలదు. సామానాధికరణ్యమన యేకాధికరణ వృత్తిత్వము. అదే విధముగా వృత్త్యాశ్రయపదవిషయకత్వము కూడా జ్ఞానమున కలదు. కావున సంబంధ ద్వయముతో వృత్తివిశిష్టము జ్ఞానమగుచున్నది.

శాబ్దబోధను గూర్చి వృత్తి విశిష్టజ్ఞానము కారణము, వృత్తివైశిష్ట్యము జ్ఞానమున సంబంధద్వయముచే యని సిద్ధించినది. ఇందు ప్రథమ సంబంధ నివేశముచే వృత్తిజ్ఞానరహితునకు వృత్తివిషయక సంస్కారము లేకపోవుటచే శాబ్దబోధ కలుగదు. అట్లే వృత్తిజ్ఞానము విస్మరించినవానికి ఉద్బుద్ధ సంస్కారము లేకపోవుటచే శాబ్దబోధ కలుగదు. స్వాశ్రయ పదవిషయకత్వమను ద్వితీయ సంబంధ నివేశముచే వృత్త్యాశ్రయ పదవిషయక జ్ఞానము లేనివానికి బోధకలుగదు. అట్లే ఏకసంబంధి జ్ఞానము అపరసంబంధిస్మారకమను నియమముచే ఎవనికి ఘటపదజ్ఞానము వలన ఆకాశరూప పదార్థోపస్థితి కలుగునో అట్టివానికి ఘటపదమందు ఆకాశత్వావచ్ఛిన్నార్థ నిరూపిత వృత్త్యాశ్రయత్వము లేకపోవుటచే

ఘటవిషయకశాబ్ద బోధకలుగదు. అట్లే ఘటపదవాచ్యమగు ఘటము
నిర్మాత యగుటచే జనకతా సంబంధేన ఉపస్థితమగు చైత్రాదుల యొ
బోధకలుగదు. ఏలన ఘటపదజ్ఞానమున్నను చైత్రత్వావచ్ఛిన్న నిరూ
వృత్త్యాశ్రయమగు చైత్రపదము శ్రావణ ప్రత్యక్ష విషయము కాదు కనుక

శక్తిజ్ఞానము వలన సంస్కారము పుట్టును. సంస్కార
అతీంద్రియమైనప్పటికి కార్యమును చూచి కారణమును అనుమాన
చేయుదురను న్యాయముచే వృత్తిస్మృతిరూపకార్యముచే కారణమ
సంస్కారము అనుమానము చేయబడును. అయం ఘటత్వావచ్ఛి
నిరూపిత వృత్తి విషయకోద్బుద్ధ సంస్కారవాన్ వృత్తి స్మరణవత్త్వాత్ అ
అనుమానాకారము. అట్లే శాబ్దబోధరూప కార్యజ్ఞానముచే కారణమ
వృత్తిస్మృతి అనుమానము చేయబడును. అయం ఘటత్వావచ్ఛి
నిరూపితవృత్తిమాన్ ఘటత్వావచ్ఛిన్న విషయక శాబ్దబోధవత్త్వాత్ అ
అనుమానము యొక్క ఆకారము. అదే విధముగ 'అయ
ఘటవిషయకశాబ్దబోధవాన్ ఘటవిషయక చేష్టాదిమత్త్వాత్' అ
శాబ్దబోధకార్యములగు చేష్టాదులచే శాబ్దబోధ అనుమానమ
చేయబడుచున్నది.

**విశేషము** :- విశేషణవిశేష్యభావవ్యత్యాసేన - విశేషణవిశేష్యయో
భావః విశేషణవిశేష్యభావః, తస్య వ్యత్యాసః, తేన. ''ప్రకృత్యాదిభ
ఉపసంఖ్యానమ్'' అని తృతీయావిభక్తి. దీనికి వైశిష్ట్యమర్థము. వ్యత్యాసమ
వైపరీత్యము. గృహీతా శక్తిః యేన సః గృహీతశక్తికః, తస్య. గ్రహధాతువునక
జ్ఞానమర్థము. తృతీయార్థము జ్ఞానమందు స్వరూప సంబంధముతో
నన్వయించును. వైపరీత్య విశిష్టజ్ఞానము = విపరీత జ్ఞానము = భ్రమాత్మ
జ్ఞానము = అయథార్థ జ్ఞానము. తద్వతి తత్ప్రకారక జ్ఞానము ప్రమ
తదభావవతి తత్ప్రకారకజ్ఞానము భ్రమ. ఘటత్వ ప్రకారక ఘట విశేష్య

శక్తిగ్రహము ప్రమ. ఘటప్రకారక ఘటత్వ విశేష్యక శక్తిగ్రహము భ్రమ.

మూలము :- సా చ వృత్తిస్త్రిధా శక్తిర్లక్షణా వ్యంజనా చ। తత్ర శక్తిః కః పదార్థ ఇతి చేత్ ? అత్ర తార్కికాః "అస్మాచ్ఛబ్దాదయమర్థో బోద్ధవ్యః" ఇత్యాకారా 'ఇదం పద మిమ మర్థం బోధయతు' ఇత్యాకారా వా ఈశ్వరేచ్ఛా శక్తిః, లాఘవాత్। సైవ సంకేతః సంబంధః।

శక్తేః యద్యపి విషయత్వ లక్షణః సంబంధః పదేఽర్థే బోధే చ, తథాపి బోధనిష్ఠ జన్యతానిరూపిత జనకతావత్త్వేన శక్తి విషయో వాచకః, పదజన్యబోధ విషయత్వేన శక్తివిషయో వాచ్య ఇతి నాతిప్రసంగః। యద్యపి ప్రథమం శక్తిగ్రహో వాక్య ఏవ, తథాపి ఆవాపోద్వాపాభ్యాం శాస్త్రకృత్-కల్పితాభ్యాం తత్తత్పదశక్తిగ్రహ ఇత్యాహుః।

వ్యాఖ్యానము :- పదపదార్థముల సంబంధ రూపము వృత్తి. అది శక్తి - లక్షణా - వ్యంజనాభేదముచే మూడు విధములు. అందు శక్తి స్వరూపమును నైయాయికు లిట్లు నిరూపించుచున్నారు - ఈ శబ్దము వలన యీ యర్థము (ఘటపదము వలన కంబుగ్రీవాదిమదర్థము) తెలుసుకోదగినదను పదప్రకారము, అర్థవిశేష్యకమగు ఈశ్వరేచ్ఛ లేదా 'ఈ పద మీయర్థమును బోధించుగాక' యను అర్థప్రకారక పదవిశేష్యకమగు ఈశ్వరేచ్ఛారూపము శక్తి. ఈశ్వరేచ్ఛయే పదపదార్థముల సంకేతము = సంబంధము. లౌకికేచ్ఛలు బహువిధములగుటచే ఈశ్వరేచ్ఛను శక్తిగా యంగీకరించుటలో లాఘవము గలదు.

జ్ఞానము, ఇచ్ఛ, ద్వేషము, కృతి, సంస్కారములు సవిషయక పదార్థములు. అనగా యత్కించిదర్థ నిష్ఠ విషయతా నిరూపకములు. కనుక పదము - అర్థము - జన్య జనక భావసంబంధము - బోధ ఈ నాలుగు ఈశ్వరేచ్ఛలో విషయములు. విషయతా సంబంధేన ఈశ్వరేచ్ఛావత్త్వము

వాచకత్వము అనగా విషయతా సంబంధముచే ఈశ్వరేచ్ఛ కల్గియుండుట వాచకత్వమని యంగీకరించిన పైన చెప్పిన వానిలో పదమునకు వాచకత్వమిష్టమైనను అర్థ - బోధ - సంబంధముల యందు కూడ వాచకత్వ లక్షణము సమన్వయమగు చుండుటచే అతివ్యాప్తి దోషము. అట్లే విషయతాసంబంధేన ఈశ్వరేచ్ఛావత్త్వము వాచ్యత్వమని లక్షణము చెప్పి అర్థమందు ప్రస్తుత లక్షణము సమన్వయమగుట యిష్టమైనను మిగిలిన మూడిటియం దతి ప్రసక్తమగును. కావున బోధనిష్ఠజన్యతా నిరూపిత జనకతావత్త్వేన ఇచ్ఛావిషయము వాచకము, పదజన్యబోధ విషయత్వేన ఇచ్ఛావిషయము వాచ్యమని చెప్పుటచే సంబంధాదుల యందతి ప్రసక్తిలేదు.

లోకమున వ్యవహారమంతయు వాక్య ప్రయోగాధీనమగుటచే వాక్యమందే శక్తిని కల్పించవలెను. పదములయందు శక్తి కల్పన మెట్లు ఉపపన్నమగునను దానికి సమాధానము చెప్పుచున్నాడు. యద్యపీతి । ఏ పదమునకే యర్థమందు శక్తియని శక్తిగ్రహమును తెలుసుకోవలయునని కోరికగల బాలుడు వృద్ధవ్యవహారమును (పెద్దల ప్రయోజక వ్యవహారమును అనగా ఉత్తమ వృద్ధుడు 'ఉదకమానయ' అని ప్రయోగించగనే మధ్యమ వృద్ధుడు జలమును తీసుకు వచ్చుట) చూచి మొదట యీ వాక్యమునకీయర్థమందు శక్తియని తెలుసుకొనును. అనగా ప్రథమావస్థలో వాక్యమందే శక్తిగ్రహము = జ్ఞానము కలుగుచున్నది. పిమ్మట భిన్నభిన్న వాక్యములను ప్రయోగించుచు ఉదకమానయ, ఉదకం నయ, అశ్వమానయ అశ్వం నయ' అను రీతిని పూర్వము ప్రయోగించిన పదములను ప్రయోగించుట, నూతన పదములను చేర్చుటవలన అన్వయ వ్యతిరేకములచే (ఈ పదము ప్రయోగించిన యిదియర్థము అనునది అన్వయము, ఈ పదము ప్రయోగించకపోయిన యీ యర్థము తెలియబడుట లేదనునది వ్యతిరేకము) పదమందు శక్తి గ్రహము కలుగును.

ఈ రీతిగా పదములయందు శక్తి కల్పన మసంగత మను శంక కవకాశము లేదు. కనుక ఈశ్వరేచ్ఛారూపము శక్తి యని నైయాయిక మతము.

**విశేషము** : - శాబ్దబోధజనక జ్ఞానవిషయ పదపదార్థ సంబంధత్వము వృత్తిత్వము. శాబ్దబోధజనకమగు జ్ఞానములో విషయభూతమగు పదపదార్థ సంబంధ విశేషమే వృత్తియనబడును. లక్షణము ప్రసిద్ధమను భావనతో విడిగా చెప్పక 'సా చ' అని సర్వనామముతో నిర్దేశించెను. వృత్తి త్రైవిధ్యము మతాంతర మనుసరించి చెప్పబడినది. వస్తుతః నాగేశుడు లక్షణావృత్తిని శక్తియందు గతార్థము చేసెను. ఈశ్వరేచ్ఛ శక్తియని నైయాయిక మతము. ఇచ్ఛాస్వరూపము రెండు విధములుగ చూపబడినది. బోద్ధవ్యః అననది కర్మణి తవ్యప్రత్యయాంతము. దానికి విషయత్వమర్థము. బోద్ధవ్యః = బోధవిషయము. అస్మాచ్ఛబ్దాదయమర్థో బోద్ధవ్యః అనువాక్యముచే ఏతచ్ఛబ్దజన్య బోధనిరూపిత విషయతావాన్ అర్థః అనువాక్యార్థము లభించుటచేమొదటి ఇచ్ఛ శబ్దజన్య బోధవిషయత్వ ప్రకారకము మరియు అర్థవిశేష్యకము. ఇదం పదమిమమర్థం బోధయతు అనునది రెండవ ఇచ్ఛాస్వరూపము. బోధయతు ( ప్రయోజకణిజంతము) = బోధనిరూపిత జనకతావాన్ అని యర్థము. అర్థవృత్తి విషయతానిరూపిత బోధనిరూపిత-జనకతావత్ పదమని అర్థవిషయక బోధజనకత్వ ప్రకారకము మరియు పద విశేష్యకమగు ఈశ్వరేచ్ఛ రెండవది. రెండు రకముల ఈశ్వరేచ్ఛ విషయతాసంబంధముచే పద-పదార్థ-సంబంధ-బోధలు నాల్గిటి యందుండుటచే వాచ్యవాచక లక్షణములతిప్రసక్తములగును. కనుక 'బోధనిష్ఠజన్యతా' అను విధములుగ తల్లక్షణములు చెప్పబడినవి.

**మూలము** : - తన్న । ఇచ్ఛాయాః సంబంధినో రాశ్రయతా నియామకత్వాభావేన సంబంధత్వాసంభవాత్; ''సంబంధో హి సంబంధిద్వయ భిన్నత్వే సతి, ద్విష్ఠత్వే చ సతి ఆశ్రయతయా విశిష్టబుద్ధి

నియామకః' ఇత్యభియుక్తవ్యవహారాత్। యథా ఘటవద్ భూతలమిత్యాదౌ సంయోగరూపః సంబంధః సంబంధిభ్యాం భిన్నో ద్విష్ఠో ఘటనిరూపిత సంయోగాశ్రయో భూతలమితి విశిష్టబుద్ధి నియామకశ్చ, నాత్ర తథా ఘటశబ్దః ఇచ్ఛావాన్ తదర్థో వా ఇచ్ఛావానితి వ్యవహారః।

వ్యాఖ్యానము :- న్యాయదర్శనకారులు చెప్పినట్లు ఈశ్వరేచ్ఛ శక్తియనుట యుక్తము గాదు. అది యెట్లన ఇచ్ఛకు సంబంధత్వము సిద్ధించినచో దానినే శక్తి యనవచ్చును. కాని ఇచ్ఛకు సంబంధత్వము కుదరదు. 'ఘటవద్ భూతలమ్' అన్నప్పుడు భూతలమందు ఘటము సంయోగసంబంధముతో నుండుటచే సంయోగ సంబంధమునకు అనుయోగి భూతలము, ప్రతియోగి ఘటము. ( ఆధారము అనుయోగి, ఆధేయము ప్రతియోగి) అనగా ఘటప్రతియోగిక భూతలానుయోగికము సంయోగసంబంధము. దీనికి సంబంధులు అనగా ప్రతియోగ్యనుయోగులు ఘటభూతలములు. సంబంధులకంటె భిన్నమగుచు ప్రతియోగ్యను-యోగులు రెండింటియందుండునది మరియు ఆశ్రయమగుటద్వారా విశిష్టబుద్ధి నియామకము సంబంధమని సంబంధ సామాన్య లక్షణము. ఘటభూతలముల సంబంధమగు సంయోగము సంబంధులకంటె = ఘటభూతలముల కంటె భిన్నము, ఘటభూతలోభయనిష్ఠము, మరియు 'ఘటప్రతియోగిక సంయోగమునకు ఆశ్రయము భూతలమను విశిష్టబుద్ధికి నియామకమగుటచే సంయోగము సంబంధమగుచున్నది. కాని ఇచ్ఛకలది పదము, ఇచ్ఛకలది పదార్థము ( ఇచ్ఛావాన్ ఘటశబ్దః, ఇచ్ఛావాన్ ఘటశబ్దార్థః) అను వ్యవహారము లేకపోవుటచే సంబంధులకు ఆశ్రయతా నియామకము కాని యిచ్ఛకు సంబంధత్వము లేదు. (సంబంధులు పద పదార్థములు) కనుక ఇచ్ఛకు సంబంధత్వముపపన్నము కాకపోవుటచే ఈశ్వరేచ్ఛ శక్తి యనుట సంగతము కాదు.

**విశేషము** :- ఘటరూపార్థ విషయక శాబ్దబోధమునకు ఘటరూపార్థ నిరూపిత వృత్తి విశిష్ట జ్ఞానము కారణము. శాబ్దబోధజనక జ్ఞాన విషయ పదపదార్థ సంబంధ విశేషము వృత్తియనబడును. శక్తి- లక్షణా- వ్యంజనాయని వృత్తి త్రైవిధ్యము న్యాయ మతము ననుసరించి చెప్పబడినది. నాగేశభట్టు లక్షణను శక్తి యందే గతార్థము చేసినాడు. వ్యాకరణ శాస్త్రమున **శక్తి వ్యంజన** యని రెండు వృత్తులు స్వీకరింపబడుచున్నవి. నైయాయికులు ఈశ్వరేచ్ఛను శక్తిగా చెప్పుచున్నారు. ఈ శబ్దము వలన ఏతదర్థ విషయకబోధ కలుగవలయునను ఈశ్వరేచ్ఛ శబ్దజన్యబోధ విషయత్వ ప్రకారము మరియు అర్థ విశేష్యకము. ఈ పదము ఏతదర్థ విషయక బోధను కల్గించ వలయునను ఆకారము గల ఇచ్ఛ అర్థ విషయక బోధజనకత్వ ప్రకారము మరియు పద విశేష్యకము. ఈ విధముగ ఇచ్ఛాస్వరూపము రెండు విధములుగ చెప్పబడినది. వ్యాకరణ దర్శనమున వాక్యస్ఫోటకు వాచకత్వమును స్వీకరించుటచే శక్త్యాశ్రయము వాక్యము. న్యాయదర్శనమున శక్తి పదములయందు అగు. ప్రకృతి ప్రత్యయములయందు స్వీకరింపబడుచున్నది. లోకమున వాక్యవ్యవహారముచే బోధ కల్గుచున్నను వాక్యమందు భ్రమాత్మకమగును కాని, ప్రమ కాదని వారియభిప్రాయము.

నాగేశభట్టు ఈశ్వరేచ్ఛ శక్తి యను నైయాయిక మతమును నిరసించినాడు. విషయతా సంబంధముచే ఈశ్వరేచ్ఛ కలిగియుండుట వాచకము లేక వాచ్యమని యంగీకరించిన అతిప్రసంగము కనుక (వ్యాఖ్యానమున వివరింపబడినది) బోధనిష్ఠజన్యతా నిరూపిత జనకతావత్త్వేన ఈశ్వరేచ్ఛావిషయము వాచకము, బోధవిషయత్వేన రూపేణ ఈశ్వరేచ్ఛావిషయము వాచ్యమని యంగీకరించవలెను. కాని బోధనిష్ఠ జన్యతా నిరూపిత జనకత్వము ప్రసిద్ధమగుటను శబ్దనిష్ఠేచ్ఛ రూపమున

శక్తి పదపదార్థముల సంబంధమని చెప్పవచ్చును. కాని వెనుక వివరించినట్లు ప్రయోజ్య ప్రయోజక వృద్ధ వ్యవహారమును గమనించు బాలుడు ప్రయోజ్య వృద్ధుని చేష్టాదులచే ప్రయోజ్యునకు తదర్థ విషయక బోధ కల్గినట్లు అనుమానము చేయును. అయం ప్రయోజ్యవృద్ధః ప్రయోజకవృద్ధ ప్రయుక్త శబ్దార్థ విషయకబోధవాన్ తద్విషయక చేష్టావత్త్వాత్ అని అనుమానాకారము.

ప్రయోజ్యవృద్ధునకు కలిగిన జ్ఞానమునకు కారణము శబ్దమని బాలు డనుమానము జేయును. 'ప్రయోజ్యవృద్ధస్య జ్ఞానం, ప్రయోజకవృద్ధోచ్చారిత శబ్దజన్యం, తాదృశవాక్యాన్వయవ్యతిరేకానువిధాయిత్వాత్.' ఈ విధముగ ప్రయోజకవృద్ధోచ్చరిత శబ్దము ప్రయోజ్య వృద్ధజ్ఞానమునకు కారణమగుటచే బోధకారణత్వము శబ్దమునకు సిద్ధించినది. ఏ శబ్దము వినుట వలన అర్థబోధ కలుగుచున్నదో యట్టి శబ్దము అర్థముతో యవశ్యము సంబంధము కలిగియుండవలెను. అసంబద్ధమునకు కారణత్వము యుక్తము గాదు. కారణత కించిద్ధర్మావచ్ఛిన్నము మరియు కించిత్సంబంధావచ్ఛిన్నమగును. శక్తిరూప సంబంధము కారణతావచ్ఛేదక సంబంధము. ఈశ్వరేచ్ఛ శక్తి. అది బోధజనకత్వ ఘటితము. అర్థబోధముగూర్చి శక్తిజ్ఞానము కారణమగుటచే అర్థబోధకువ్యక్తియందు శబ్దమందు బోధకారణత్వము బాధితమగుటచే బోధకారణత్వఘటితేచ్ఛారూపము శక్తి యనుట యెట్లు కుదురును? అట్లే అవచ్ఛేద్యావచ్ఛేదక భావము భిన్నపదార్థములకు సంబంధించును గాని ఒక్కదానికి గాదు. బోధకారణతావచ్ఛేదకమగు శక్తిసంబంధము బోధకారణత్వ ఘటితమైన, తనకు తను అవచ్ఛేదక మగుట అనుపపన్నము, ఈ విధముగ బోధజనకత్వ ఘటితేశ్వరేచ్ఛ శక్తి యనుట నిరస్తమగుటచే బోధజనకత్వము శక్తి యను దీక్షితాదిమతము గూడ నిరస్తమే. ఏలయన

బోధజనకత్వజ్ఞానానంతరమే సంబంధత్వము కల్పింప వలెను గనుక. శక్తిపదవాచ్యము సంబంధము.

ఏదో విధముగా యీశ్వరేచ్ఛను శక్తిగా నంగీకరించినను వినిగమకము లేకపోవుటచే పదపదార్థముల సంబంధరూపమగు శక్తి ఈశ్వరేచ్ఛయన్నట్లు ఈశ్వరీయబోధను గూడ శక్తిగా నంగీకరించవలెను. ఇట్లు ఈశ్వరీయేచ్ఛ, ఈశ్వరీయబోధ - రెండింటిని పదపదార్థముల సంబంధముగ నంగీకరించిన గౌరవము. ఇచ్ఛకు శక్తిత్వమంగీకరించిన 'ఇదమస్మాద్భవతు' (ఈ శబ్దము వలన యీయర్థబోధ కలుగ వలయును) అను రీతిని ఇచ్ఛావిషయంత్వమును శబ్దనిష్ఠబోధజనకత్వముగ నంగీకరింపవలయును. అట్లైన సర్వత్ర కార్యకారణభావస్థలమున దేనికి నియతముగ కారణత్వము సిద్ధింపదు. 'దండాత్ ఘటో జాయతామ్' అను ఇచ్ఛ యొక్క విషయత్వమే దండాదులకు కారణత్వ నియామక మగుచుండగ కార్యకారణ భావము యొక్క వాస్తవిక స్వరూపము విచ్ఛిన్నము కావలసివచ్చును. అనగా ఇచ్ఛామాత్రముచే దండమునకు ఘటజనకత్వము సిద్ధింపవలసివచ్చును.

జ్ఞానరూపకార్యస్థలములోనే ఈశ్వరేచ్ఛ కారణతానియామకము, ఇతరత్ర కాదని చెప్పుట సరిగాదు. ఏలయన సంయోగము, సంయుక్త సమవాయము మున్నగు ఇంద్రియార్థ సన్నికర్షలవలన జ్ఞానము పుట్టుచున్నది. అనగా చక్షురాదిప్రమాణములు ప్రమేయములగు ఘటపటాదులతో సంయోగాది సంబంధములతో సంబద్ధములై ప్రత్యక్ష జ్ఞాన జనకములగుచున్నవి. అచ్చట జనకత్వము లేక తద్ఘటితమగు ఇచ్ఛ సంబంధము గాదు. 'ధూమాత్ వహ్నిజ్ఞానం జాయతామ్' అను ఇచ్ఛా విషయత్వము లేక బోధజనకత్వము హేతుసాధ్యములకు సంబంధమనిన సరిపడుచుండగ వ్యాప్తి సంబంధము విచ్ఛిన్నము కావలసి వచ్చును.

సంయోగాది సంబంధములతో ఘటాది సంబద్ధములగు చక్షురాదులకు ఘటాది బోధకత్వము సిద్ధము. ప్రకృతమున ప్రమాణ ప్రమేయములకు సంబంధాంతర మునుచితముగాని జనకత్వము లేక జనకత్వఘటితమగు ఇచ్ఛకు సంబంధత్వము యుక్తము గాదు.

వస్తుతః ఇచ్ఛకు సంబంధత్వ మనుపపన్నము. రెండు సంబంధులయందుండునది సంబంధము. ఇచ్ఛ సమవాయసంబంధముచే ఆత్మయందుండును గనుక సమవాయము వృత్తినియామక సంబంధము. స్వవిషయబోధ విషయతా సంబంధము వృత్తినియామకము కాకపోవుటచే తత్సంబంధముతో ఇచ్ఛ తన విషయమునందుండదు. అనగా స్వ విషయబోధ విషయతా సంబంధముతో ఇచ్ఛకు ఆశ్రయము విషయము గాదు. వృత్తినియామక సంబంధముతో ఉభయ సంబంధియగునది సంబంధము. వృత్త్యనియామక విషయతా సంబంధముతో ఇచ్ఛ పదపదార్థముల యందుండును గాన ఇచ్ఛ పద పదార్థ సంబంధమనుట యుక్తము గాదు. 'విషయం ఇచ్ఛావాన్' అను లోకవ్యవహారము లేకపోవుటచే ఇచ్ఛావిషయములగు పదపదార్థములు ఇచ్ఛకు సంబంధులుగ వ్యవహరింపబడును గాని ఇచ్ఛకు ఆశ్రయములుగ గాదు.

బోధ జనకత్వము శక్తి యను ప్రాచీన వైయాకరణ మతము గూడ యుక్తము గాదు. 'బోధజనకతా సంబంధేన పదం పదార్థవత్' అను విశిష్టబుద్ధి లేకపోవుటచే, విశిష్టబుద్ధినియామకము కాదు గనుక పద-అర్థముల సంబంధము బోధ జనకత్వ మనుట నిరస్తము. బోధజనకత్వము పద అర్థములయందు స్వరూప సంబంధముతోనున్నను దీనిని రెండిటికి సంబంధముగ స్వీకరించుట యుక్తము గాదు. జ్ఞానమాత్రమందు విషయము = అర్థము, మరియు కర్త = శబ్దము రెండును కారణములయినను జ్ఞానకారణతాసంబంధేన కర్తా విషయవాన్, విషయః

కర్తృమాన్ అను వ్యవహారము లేకపోవుటచే విశిష్టబుద్ధి నియామకము జ్ఞాన జనకత్వ సంబంధము కాకపోవుటచే బోధజనకత్వమును పదపదార్థముల సంబంధముగ చెప్పుట సరిగాదని తాత్పర్యము. కనుకనే నాగేశభట్టు వైయాకరణ సిద్ధాన్త లఘుమంజూషలో ''జ్ఞానే విషయస్య కర్తుశ్చ కారణత్వేఽపి తయోః పరస్పరం విశిష్టబుద్ధ్యదర్శనాత్। అర్థపదయోః సంబంధస్య దురుపపాదత్వాత్' అని పేర్కొనెను సమగ్రవిచారము కొఱకు వైయాకరణ సిద్ధాన్త లఘుమంజూషను చూడవలెను.

మూలము :- తస్మాత్ పదపదార్థయోః సంబంధాన్తరమేవ శక్తిః, వాచ్యవాచకభావాపరపర్యాయా। తద్గ్రాహకం చ ఇతరేతరాధ్యాసమూలకం తాదాత్మ్యమ్। తదేవ సంబంధః। ఉభయ నిరూపిత తాదాత్మ్యవానుభయ ఇత్యర్థ పదయోర్వ్యవహారాత్। శక్తేరపి కార్యజనకత్వే సంబంధస్యైవ నియామకత్వాత్। దీపాదిగత ప్రకాశ కత్వశక్తావపి ఆలోక విషయ సంబంధే సత్యేవ వస్తుప్రకాశకత్వం నాన్యథేతి దృష్టత్వాత్।

వ్యాఖ్యానము : న్యాయశాస్త్ర సమ్మతమగు ఈశ్వరేచ్ఛా రూపశక్తి, ప్రాచీన వైయాకరణాభిమతమగు బోధజనకత్వరూపశక్తి నిరస్తమగుటచే స్వాభిమతమగు శక్తి స్వరూపమును నిరూపించుచున్నాడు తస్మాదితి। వాచ్యవాచకభావరూప సంబంధమే పదపదార్థముల శక్తి రూపసంబంధము. ఇతరేతరాధ్యాసమూలకమగు తాదాత్మ్యము శక్తిగ్రాహకము. అనగా వాచ్యవాచక భావమను సంబంధమునకు జ్ఞాపకము పదపదార్థముల తాదాత్మ్యము. ఆ తాదాత్మ్యము పదపదార్థముల పరస్పరాధ్యాసము వలన తెలియును. అన్యస్మిం అన్యధర్మావభాస మధ్యాస మనబడును తన్మూలకము తాదాత్మ్యము. ముత్యపుచిప్పను చూచి వెండి అనుకొనుట భ్రమాత్మక జ్ఞానము. 'ఇదం రజతమ్' అనునపుడు శుక్తియందు రజతత్వ ధర్మాభాసముచే ఇదంపదార్థ రజతపదార్థములకు తాదాత్మ్యమో,

అదేవిధముగ పదపదార్థముల తాదాత్మ్యము అధ్యాసమూలకమే గాని వాస్తవికముగాదు. అట్టి తాదాత్మ్యముచే వాచ్యవాచక భావాపరపర్యాయమగు శక్తిజ్ఞానము కలుగుచున్నది. కనుక శక్తిజ్ఞాపకము అధ్యాసమూలకమగు తాదాత్మ్యమని సిద్ధించినది. పద - అర్థోభయనిరూపిత తాదాత్మ్యము కలది ఉభయమను వ్యవహారము వలన పద - అర్థోభయనిష్ఠము మరియు విశిష్టబుద్ధి నియామకమగుటచే తాదాత్మ్యమునకు సంబంధత్వము సిద్ధించినది. (పదనిరూపిత తాదాత్మ్యము పదార్థమందు, పదార్థనిరూపిత తాదాత్మ్యము పదమందును కలదు)

శక్తి కార్య నిష్పాదకమగుటలో సంబంధమే నియామకము. అనగా ఏదేని శక్తి కార్యమును పుట్టించుటలో శక్తికంటె భిన్నమగు సంబంధము నపేక్షించుచున్నది. ఎట్లన దీపమందు వస్తువులను ప్రకాశింపజేయు శక్తి గలదు. కాని యాశక్తి దీపమునకు వస్తువులకు సంయోగాది సంబంధమున్నప్పుడే కార్యోత్పాదకమగు చున్నది. అట్లే వాచ్యవాచకభావరూపమగు శక్తి పదపదార్థములకు తాదాత్మ్యరూప సంబంధమున్నప్పుడే శాబ్దబోధరూపకార్యమును కల్గించుటకు సమర్థమగు నని చెప్పవలెను.

**విశేషము** :- ఇచ్చట వాచ్యవాచక భావరూపశక్తికి ప్రకాశకము తాదాత్మ్య సంబంధమని చెప్పబడినది. దానిని దీపదృష్టాంతముచే సమర్థించుట ఒక విశేషము. అట్లే ఘటబోధజనన సామర్థ్యమే ఘటాదిపదములకు శక్తియని శబ్దకౌస్తుభకారాదిమతము. అనగా పదపదార్థముల బోధ్యబోధక భావనియామకము శక్తి = సామర్థ్య విశేషము సంబంధము. ఏతదతిరిక్తముగ వాచ్యవాచక భావరూప సంబంధమును కల్పించుట గౌరవమను దీక్షితాదిమతమును కూడా దీపదృష్టాంతముచే నిరసించుట మరియొక విశేషము. అట్లే పదపదార్థముల బోధ్యబోధకభావనియామకము శక్తి ...సు

సంబంధమే గాని తదతిరిక్తముగ తాదాత్మ్య సంబంధము అవసరము లేదను మతము కూడ నిరస్తమే.

మూలము :- తదుక్తం హరిణా -

ఉపకారః స యత్రాస్తి ధర్మస్తత్రానుగమ్యతే ।
శక్తీనామప్యసౌ శక్తిర్గుణానామప్యసౌ గుణః ॥
(వాక్యపదీయము 3-3-6) ఇతి ।

ఉపకారః - ఉపకార్యోపకారకయోః బోధశక్త్యోః ఉపకార స్వభావః సంబంధో యత్రాస్తి తత్ర ధర్మః శక్తిరూపః కార్యం దృష్ట్వాఽనుమీయతే। అసౌ సంబంధః శక్తీనామపి కార్యజననే ఉపకారకః గుణానామపి ద్రవ్యాశ్రితత్వనియామక ఇతి హేలారాజః ।

వ్యాఖ్యానము :- శక్తి కార్యనిష్పాదకమగుటలో సంబంధము నియామకమను విషయమున, భర్తృహరిని ప్రమాణముగ చూపుచున్నాడు. ఉపకార్యము= అర్థము. ఉపకారకము = శబ్దము. పరస్పరము రెండిటికి ఉపకారకత సంబంధము. కార్యమనగా బోధ. శక్తిరూపః సంబంధః = శక్తిః రూపం యస్య సః । వాచ్యవాచకభావరూపసంబంధము లేక తాదాత్మ్యసంబంధము. శక్తియే సంబంధమను మతనిరాసమున తాదాత్మ్య సంబంధమును గ్రహించవలెను. 'తస్యాపి శక్త్యుపకారకత్వాత్ శక్తిరితి వ్యవహారః' అని గ్రంథకర్త చెప్పుటచే తాదాత్మ్యము కూడ శక్తిపదముచే వ్యవహరింపబడును. ఎచ్చట ఉపకార్యోపకారములకు ఉపకార స్వభావమగు సంబంధముండునో అచ్చట శక్తిరూపసంబంధ మనుమానము చేయబడును. అసంబద్ధముల కుపకారము సంభవించదు. అసౌ = అనుమీయమానమగు సంబంధము శక్తులకు శక్తి. అనగా శక్తికి బోధరూపకార్యోత్పత్తిలో నియామకము. అట్లే గుణములకు గుణము. అనగా గుణములకు ద్రవ్యాశ్రితత్వనియామకము

సంబంధమని కారికార్థము. శక్తిరూప సంబంధమనుమానము చేయబడుచున్నది. శక్తిరూప సంబంధమనగా శక్తినిరూపక తాదాత్మ్య సంబంధము. ఈ సందర్భమున హేలారాజ వ్యాఖ్యానమును కూడా ప్రమాణముగ చూపుచున్నాడు. ఉపకార్యోపకారకములకు (అర్థశబ్దములకు) ఉపకార స్వభావమగు సంబంధము ఎచ్చట కలదో అచ్చట శాబ్దబోధరూపకార్యమును చూచి శక్తినిరూపకమగు తాదాత్మ్య సంబంధము అనుమానము చేయబడుచున్నది. అనుమీయమానమగు తాదాత్మ్య సంబంధము ఏదేని శక్తికార్యమును పుట్టించుటలో ఉపకారకమగుచున్నది. మరియు గుణములు ద్రవ్యము నాశ్రయించి యుండుటలో సంబంధమే నియామకమగుచున్నది.

**విశేషము** :- హరికారికలో 'అనుగమ్యతే' అనుదానికి 'అనుమీయతే' అని యర్థము. శబ్దః స్వార్థనిరూపితతాదాత్మ్యవాన్ స్వార్థప్రతియోగిక వాచ్యవాచకభావరూప శక్తిమత్త్వాత్ అని అనుమానాకారము. శబ్దమందు స్వార్థప్రతియోగికశక్తిరూప సంబంధముండుటచే స్వార్థనిరూపితతాదాత్మ్య సంబంధము కల్గినదని అనుమానము చేయబడును. దీపమందు వస్తుప్రకాశకత్వ శక్తియున్నను తద్భిన్నమగు సంయోగ సంబంధమున్నప్పుడే దీపగతశక్తి సార్థకమగును. కనుకనే అనుమీయమానమగు సంబంధము శక్తులకు శక్తిగా పేర్కొనబడినది. గుణములకు ద్రవ్యాశ్రితత్వ నియామకము సంబంధము అనగా గంధమను గుణము పృథివియందు మాత్రమే యుండునను నియంత్రణము పృథివీ గంధములకు సమవాయ సంబంధముచేతనే సిద్ధించును. కనుక వాచ్యవాచకభావరూపమగు శక్తి, పదపదార్థముల తాదాత్మ్యరూప సంబంధము చేతనే బోధజనకమగుచున్నది. గంధ, శీతస్పర్శాదిగుణములు పృథివీజలాది ద్రవ్యాశ్రితములను వాస్తవికస్వరూప నియామకము లేక వ్యవస్థాపకము సమవాయ సంబంధమయినట్లు వాచ్యవాచకభావాపరపర్యాయమగు

పదపదార్థముల శక్తి అర్థజ్ఞానమును కల్గించుటలో తాదాత్మ్య సంబంధము చేతనే సార్థకమగుచున్నదని తాత్పర్యము.

**మూలము :-** స సంబంధః పదే వాక్యే చ। తదాహ న్యాయ భాష్యకారః - 'సమయజ్ఞానార్థం చేదం పదలక్షణాయా వాచోఽన్వాఖ్యానం వ్యాకరణం, వాక్యలక్షణాయా వాచోఽర్థ లక్షణమ్' ఇతి। అనేన పదేష్వివ వాక్యేష్వపీశ్వర సమయ ఇతి స్పష్టమేవోక్తమ్। తస్మాదితరేతరాధ్యాసః సంకేతస్తన్మూలకం తాదాత్మ్యం చ సంబంధ ఇతి సంఘాతార్థః। తదుక్తం పాతంజలభాష్యే -

''సంకేతస్తు పదపదార్థయోః ఇతరేతరాధ్యాసరూపః స్మృత్యాత్మకో యోఽయం శబ్దః సోఽర్థో యోఽర్థః స శబ్దః ఇతి। (యో. భా॥ 3-17) స్మృత్యాత్మక ఇత్యనేన జ్ఞాతస్యైవ సంకేతస్య శక్తిబోధకత్వం దర్శితమ్।

**వ్యాఖ్యానము :-** వాచ్యవాచకభావాపరపర్యాయమగు శక్తిరూప సంబంధము పదనిష్ఠము వాక్యనిష్ఠము కూడా అగుచున్నది. న్యాయదర్శన రీత్యా పదనిష్ఠము. వైయాకరణమతమున శక్తి పదగతమైనప్పటికి అఖండ వాక్యస్ఫోట వాచకమనునది సిద్ధాంతమగుటచే వాక్యనిష్ఠము. శక్తి ఉభయ నిష్ఠమను విషయమును న్యాయభాష్యకారుడగు వాత్స్యాయనుడు కూడా చెప్పినాడు. ''సంకేత జ్ఞానము కొఱకు ప్రకృతి ప్రత్యయాది విభాగపూర్వకముగ పదస్వరూపమును అన్వాఖ్యానము చేయునది వ్యాకరణశాస్త్రము. అట్లే సంకేతజ్ఞానము కొఱకు వాక్యరూప శబ్దముల నన్వాఖ్యానము చేయునది అర్థ లక్షణము అనగా మీమాంసా శాస్త్రము'' అని. అర్థః = వాక్యార్థః లక్ష్యతే అనేనేతి అర్థలక్షణమ్. కనుక పదమందువలె వాక్యమందుకూడా ఈశ్వర సంబంధమగు సంకేతమున్నట్లు స్పష్టము. వాక్యవిషయమున శక్తిగ్రాహకములుగ ఆకాంక్షాయోగ్యతాదులు (తద్ జ్ఞానము) కారణములుగ అపేక్షింపబడుచున్నవి.

వాచ్యవాచకభావరూప సంబంధమే శబ్దార్థముల శక్తి-రూపసంబంధముగ స్వీకరింపబడినది. శబ్దార్థముల తాదాత్మ్య సంబంధముచే శక్తిజ్ఞానము కలుగును, పరస్పరాధ్యాసముచే శబ్దార్థములకు తాదాత్మ్య జ్ఞానము కలుగును. తాదాత్మ్యమునే సంకేతముగ చెప్పుచున్నారు. శక్తిగ్రాహకమగు తాదాత్మ్యము ఇతరేతరాధ్యాసమూలకమని సముదాయార్థము. పతంజలి మహర్షి రచించిన యోగసూత్రములకు వ్యాసమహర్షి వ్రాసిన భాష్యము పాతంజలభాష్యము. అందు పైన పేర్కొనబడిన విషయమే చెప్పబడినది. పద - అర్థముల ఇతరేతరాధ్యాసరూపము సంకేతము. 'రూప్యతే అనేనేతి' రూపశబ్దము కరణఘఞంతము. ఇతరేతరాధ్యాసరూపము = ఇతరేతరాధ్యాసగ్రాహ్యమని యర్థము. కనుక ఇతరేతరాధ్యాస మూలకము, స్మృతివిషయమగు, ఏది శబ్దమో అదే యర్థము, ఏది యర్థమో అదే శబ్దమను శబ్దార్థముల తాదాత్మ్యము సంకేతము. ఇచ్చట తాదాత్మ్యము వాస్తవికముగాదు. కాని ఇతరేతరాధ్యాస (= మిథ్యాజ్ఞానము) మూలకము. స్మృత్యాత్మకః అనుటచే జ్ఞాతమగు సంకేతము శక్తిరూపసంబంధమునకు ప్రకాశకమని తెలియబడుచున్నది.

**విశేషము** :- లఘుమంజూషలో అధ్యాసమూలకమగు తాదాత్మ్యము సంకేతముగచెప్పబడినది. కాని పరమలఘుమంజూషలో పరస్పరాధ్యాసము సంకేతముగ చూపబడినది. కాని పాతంజల భాష్యమున పరస్పరాధ్యాస రూపము = పరస్పరాధ్యాసచే గ్రాహ్యమగు తాదాత్మ్యము సంబంధమని చెప్పుటచే లఘుమంజూషా వచనము యుక్తముగా తోచుచున్నది. స్మృత్యాత్మకః అనుచోట స్మృతిః ఆత్మా యస్య సః అను విగ్రహమున స్మృతి విషయి, తాదాత్మ్యము విషయము; రెండింటికి అభేదమంగీకరించి బహువ్రీహి సమాసము చెప్పవలెను. లేక స్మృతిశబ్దమునకు

తద్విషయమందు లక్షణ. కనుక స్మృతివిషయము ఆత్మగా = స్వరూపముగా కలది యని యర్థము. అనగా స్మృతమని వివరణ చెప్పవలెను. జ్ఞాతమగు తాదాత్మ్యము సంకేతము. అదియే శక్తి గ్రాహకమని తాత్పర్యము. పదపదార్థముల అధ్యాసమూలకమగు తాదాత్మ్యము శక్తిగ్రాహకమగుటచే శక్తిగా వ్యవహరింపబడుచున్నది. వస్తుతః తాదాత్మ్యము వేరు. శక్తి రూపసంబంధము వేరు. రెండు పదార్థములకు వాస్తవిక భేదముండి, అభేదము నారోపించిన తాదాత్మ్యముగ చెప్పబడును. భేదాభేదరూపమగు తాదాత్మ్యమునకు సంబంధత్వము నిరాకరింపబడుటచే తాదాత్మ్యమునే శక్తిరూప సంబంధముగ అంగీకరించలేము. తాదాత్మ్యమును సంబంధమనుట పరమతమునను సరించి చెప్పబడినది. అధ్యాస మూలకమగు తాదాత్మ్యమే సంకేతము. అది శక్తిగ్రాహకము కనుక సంకేత శక్తులు భిన్నభిన్నములు.

లఘుమంజూషలో 'ఇతరేతరాధ్యాసో రూప్యతే అనేనేతి కరణే ఘఞ్' అని పాఠము గలదు. కుంజికాటీకాకారులు కరణఘఞంత పాఠమును స్వీకరించి ఇతరేతరాధ్యాసగ్రాహ్య ఇత్యర్థః అని వ్యాఖ్యానము చేసిరి. కళాటీకాకారులు 'అత్రేతరేతరేత్యాదిఘఞిత్యంతో ఒపపాఠః తద్భాష్యాది విరోధాత్' అని కరణఘఞంతమును అపపాఠముగ చెప్పిరి. (వ్యాసభాష్య విరోధము గ్రాహ్యము) వస్తుతః కరణార్థకల్యుట్ ప్రత్యయముచే ఘఞ్ ప్రత్యయము బాధింపబడును గావున కరణఘఞంతపాఠ ముచితము కాదు. అది ప్రక్షిప్తము కావచ్చును. ఇతరేతరాధ్యాసరూపః అనుస్థలమున కరణఘఞంత రూపశబ్దముతో గాక, కర్మఘఞంత రూపశబ్దముతో షష్ఠీతత్పురుష యనుట యుక్తము.

**మూలము :–** ఉక్త ఈశ్వర సంకేత ఏవ శక్తిరితి నైయాయికమతం న యుక్తమ్, 'అయమేతచ్ఛక్యః' 'అత్రాస్య శక్తిః' ఇత్యస్య సంకేతస్య శక్తితః

పార్థక్యేన ప్రసిద్ధత్వాత్। అత ఏవ న్యాయవాచస్పత్యే ఉక్తమ్ – ‘‘సర్గాదిభువాం మహర్షిదేవతానామీశ్వరేణ సాక్షాదేవ కృతః సంకేతస్తద్వ్యవహారాచ్చ అస్మదాదీనామపి సుగ్రహః తత్సంకేతః ఇతి।

తస్య చ తాదాత్మ్యస్య నిరూపకత్వేన వివక్షితోऽర్థః శక్యః, ఆశ్రయత్వేన వివక్షితః శబ్దః శక్త ఇత్యుచ్యతే। శబ్దార్థయోస్తాదాత్మ్యే చ ‘శ్లోకమశృణోదర్థం శృణోతి, అర్థం వదతి’ ఇత్యాది వ్యవహారః,

‘‘ఓమిత్యేకాక్షరం బ్రహ్మ’’ (బ్రహ్మవిద్యోప. 3) ‘రామేతి ద్వ్యక్షరం నామ మానభంగః పినాకినః, వృద్ధిరాదైచ్’ (పా. సూ. 1-1-1) ఇతి శక్తి గ్రాహక శ్రుతిస్మృతివిషయే సామానాధికరణ్యేన ప్రయోగశ్చ। తాదాత్మ్యం చ తద్భిన్నత్వే సతి తదభేదేన ప్రతీయమానత్వమితి భేదాభేద సమనియతమ్। అభేదస్యాధ్యస్తత్వాచ్చ న తయోర్విరోధః।

వ్యాఖ్యానము :- ‘అస్మాచ్ఛబ్దా దయమర్థో బోద్ధవ్యః’ అను అర్థవిశేష్యకము లేక ‘ఇదం పద మము మర్థం బోధయతు’ అను పద విశేష్యకమగు ఈశ్వరేచ్ఛారూపసంకేతము శక్తియని నైయాయికమతము. సంకేతమే శక్తియని వీరి యభిప్రాయము. ఇది యుక్తము గాదు. ‘ఈ యర్థము ఏతత్పద శక్యము, ఈ పద మీయర్థమందు శక్తము అను ఆకారము గల సంకేతము శక్తి కంటె భిన్నముగా ప్రసిద్ధముగా కనబడుచున్నది. సంకేతము శక్తి గ్రాహకము గాని శక్త్యభిన్నము లేక శక్తిరూపముగాదు. ఈ విషయమున న్యాయవార్తికతాత్పర్య టీకాకారుల వాచస్పతిమిశ్రుల వచనములను ప్రమాణముగాచూపుచున్నారు. ‘‘సామయికః శబ్దాదర్థప్రత్యయః’’ (వై॥సూ॥ 7-2-20) అను సూత్రస్థ న్యాయవాచస్పత్యమందు ‘సృష్ట్యారంభమున మహర్షి, దేవతలకు పరమేశ్వరునిచే తత్తదర్థములయందు తత్తచ్ఛబ్దముల సంకేతము స్పష్టము చేయబడినది. వారి వ్యవహారముచే ఈశ్వర సంకేతము మనచేకూడా తెలుసుకోబడుచున్నది’ అని స్పష్టము చేయబడినది.

యోగదర్శనము తత్త్వవైశారదీటీకలో 'సర్వశబ్దములు సకలార్థములను బోధించుటలో సమర్థములని వాచస్పతి మిశ్రులు. కనుక సర్వశబ్దములకు సర్వార్థములతో శక్తిరూప సంబంధము కలదు. ఈశ్వరీయ సంకేతము తత్ప్రకాశకము.

ఇతరేతరాధ్యాసమూలకమగు తాదాత్మ్యమునకు నిరూపకము అర్థము. ఇదియే శక్యమనబడును. అట్లే తాదాత్మ్యమునకు ఆశ్రయమగు శబ్దము శక్తము = శక్త్యాశ్రయమనబడును. 'పరస్మిన్ పూర్వదృష్టావభాసః అధ్యాసః అని శాంకర భాష్యము. అన్యమందు పూర్వమందు తెలియబడిన అన్యధర్మజ్ఞానమధ్యాసయనబడును. దీనినే మిథ్యాజ్ఞానము లేక భ్రమయందురు. శబ్దార్థములు భిన్నభిన్నములయినను శబ్దమందు అర్థతాదాత్మ్యము, అర్థమందు శబ్దతాదాత్మ్యము అధ్యస్తము. ఏ శబ్దము వినబడినది ? ఏ యర్థము తెలుసుకోబడినది ? అను ప్రశ్నకు ఘటశబ్దము వినబడినది. ఘటరూపార్థము తెలుసుకోబడినదను ఏకాకారమగు సమాధానము వలన రెండింటికి తాదాత్మ్యము సిద్ధించుచున్నది. శబ్దార్థములకు తాదాత్మ్యమునంగీకరించుట వలననే శ్లోకమును (శబ్దాత్మకము) వినెను, అర్థమును వినుచున్నాడు, అర్థమును చెప్పుచున్నాడు' మున్నగు వ్యవహారము లుపపన్నమగుచున్నవి. తాదాత్మ్యమునంగీకరించనిచో అర్థమునకు వినుట, చెప్పుట అసంభవము కనుక 'అర్థం శృణోతి' మున్నగు వ్యవహారములనుపపన్నములగును. శబ్దార్థముల తాదాత్మ్యాధ్యాసము వలననే 'ఓమ్ అను ఏకాక్షరము బ్రహ్మ, 'రామ యను రెండక్షరముల నామధేయము పరమేశ్వరుని మానభంగము చేసినది' అను శృతివాక్యములలో, 'వృద్ధిరాదైచ్' అను స్మృతి వాక్యములో సామానాధికరణ్య సంబంధముతో శబ్దార్థముల ప్రయోగము సంగతమగుచున్నది. సమానమధికరణం యస్య తస్యభావ

సామానాధికరణ్యమ్ । ఇచ్చట అధికరణ శబ్దము అర్థపరము. కనుక సామానాధికరణ్యము = సమానార్థబోధకత్వమని అర్థము. సంజ్ఞాసంజ్ఞులకు, విశేషణ విశేష్యములకు సామానాధికరణ్య సంబంధము. వృద్ధిరాదైచ్ అను సూత్రమున వృద్ధిశబ్దము సంజ్ఞావాచకము. ఆదైచ్ శబ్దము సంజ్ఞిబోధకము. వృద్ధి శబ్దమునకు ఆదైచ్ = ఆ, ఐ, ఔ, వర్ణములతో తాదాత్మ్యాధ్యాసముచే సంజ్ఞాసంజ్ఞులు రెండిటికి సమానార్థ బోధకత్వరూప సామానాధికరణ్య సంబంధముపపన్నమగును.

శబ్దార్థములకు తాదాత్మ్యమంగీకరించిన అగ్నిశబ్దమును పలికిన వెంటనే ముఖమందు మంట కలుగ వలసివచ్చును. మరియు 'ఈ శబ్దమునకు ఇది వాచకము' అను భేదవ్యవహారమనుపపన్నమగునను శంకకు సమాధానము చెప్పుచున్నాడు తాదాత్మ్యం చేతి । తద్భిన్నమై తదభేదేన ప్రతీయమానమగుట తాదాత్మ్యము. ఏ రెండు పదార్థములు వాస్తవికముగ భిన్నములైనను అభేదమారోపింపబడుటచే అభిన్నములుగ ప్రతీయమానమగుట తాదాత్మ్యము. అభేదము అధ్యస్తము = ఆరోపింపబడుటచే భేదాభేదములకు విరోధము లేదు. భేదము వాస్తవికము, అభేదము ఆరోపితము. ఈ భేదాభేదములలో భేదము వివక్షితమయిన 'ఈయర్థమున కీశబ్దము వాచకము, ఉఞ్‌నకు ప్రగృహ్యసంజ్ఞ (ఉఞః ప్రగృహ్యామ్) మున్నగు ప్రయోగములలో షష్ఠీ విభక్తి ఉపపన్నమగుచున్నది. అభేదమును వివక్షచేసిన 'వృద్ధిరాదైచ్' మున్నగు స్థలములలో ప్రథమావిభక్తి సంగతమగుచున్నది.

**విశేషము** :- శబ్దార్థముల తాదాత్మ్యాధ్యాసము ఈశ్వరకృతమని పాతంజలభాష్యమున స్పష్టము. ఈ విషయము 'స్థితోఽస్య వాచకస్య వాచ్యేన సహ సంబంధః' ఇత్యాది గ్రంథముచే పాతంజలభాష్యము లఘుమంజూషలో వివరింపబడినది. 'వాచకశబ్దమునకు వాచ్యార్థముతో

తాదాత్మ్యసంబంధము మొదటినుండి ఉన్నదే. ఈశ్వరకృతమగు తాదాత్మ్యరూప సంకేతము స్థితమగు నర్థమునే ప్రకాశింపజేయునని భాష్యమున స్పష్టము. సంకేతము శక్తిగ్రాహకము గాని, శక్తిరూపముగాదని పూర్వము వివరింపబడినది. మహర్షి, దేవతలకుపదేశింపబడిన సంకేతము వృద్ధవ్యవహారముచే అనుగతముగ తెలుసుకోబడుచున్నది. ఈ విషయమున న్యాయవాచస్పత్య, యోగవాచస్పత్యవచనములు అనుకూలమని వెనుక వివరింపబడినవి. 'అయమేతచ్ఛక్యః, అత్రాస్య శక్తిః అనుసంకేతము (శబ్దార్థముల తాదాత్మ్యరూపము)న శక్తి ఘటకమగుట వలన ఆత్మాశ్రయ దోషముచే సంకేతమే శక్తియనుట యుక్తము గాదు. సకల శబ్దములకు సర్వార్థములతో గల సంబంధమును ఈశ్వరీయ సంకేతము ప్రకాశింపజేయును గాన వాక్య పదీయకారుడగు భర్తృహరి ''నిత్యః శబ్దార్థ సంబంధః'' శబ్దార్థముల సంబంధము నిత్యమని చెప్పెను. 'సర్వే సర్వార్థవాచకాః' అనుమాట యోగి దృష్ట్యా, అస్మదాదిదృష్ట్యా కాదు. సకల శబ్దములకు సకలార్థములతో శక్తిరూపసంబంధమున్నను, యోగసామర్థ్యముచే శబ్దార్థోభయ రూపమగు పరావాక్కు యొక్క సాక్షాత్కారము యోగులకు మాత్రమే కలుగును. స్ఫోటాత్మక శబ్దబ్రహ్మ యొక్క వివర్తమే సకల శబ్దములు, అర్థములు.

**అనాది నిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరమ్ ।**
**వివర్తతేఽర్థ భావేన ప్రక్రియా జగతో యతః ॥**

అని భర్తృహరి పరా - పశ్యన్తీ - మధ్యమా - వైఖరీ వాక్కులలో శబ్దబ్రహ్మరూపమగు పరావాక్కునకు జగదుపాదాన కారణత్వమంగీకరించెను. శబ్ద - అర్థముల వివర్త్యుపాదానమగుటచే శబ్ద బ్రహ్మ ఉభయ రూపము. వివర్త భూతమగు ఉపాదేయ శబ్దము కంటె అభిన్నము శబ్దబ్రహ్మ = పరావాక్కు. దాని కంటె అభిన్నము ఉపాదేయమగు

అర్థము. కనుక 'తదభిన్నాభిన్నస్య తదభిన్నత్వమ్' అనున్యాయముచే శబ్దార్థములకు పరస్పరమభేదము సిద్ధించినది.

సకల శబ్ద - అర్థములకు ఉపాదానకారణము పరావాక్కు అను విషయము ఆగమశాస్త్రమున చెప్పబడినది -

క్రియాశక్తి ప్రధానాయాః శబ్ద శబ్దార్థ కారణమ్।
ప్రకృతేః బిందు రూపిణ్యాః శబ్దబ్రహ్మాభవత్ పరా ॥

సృష్టి చేయవలయుననను ఇచ్ఛా రూపమగు పరమేశ్వరుని మాయావృత్తిచే బిందు - బీజ - నాదములతో కూడిన త్రిగుణాత్మకమగు బిందురూపమగు 'ప్రకృతి కలుగును. శుద్ధచేతన రూపమగు బిందువు వలన సకల శబ్దార్థములకుపాదానభూతము, శబ్ద బ్రహ్మపరపర్యాయమగు పరావాక్కు అభివ్యక్తమగును.

**మూలము :- యత్తు తార్కికాః - శబ్దార్థయోస్తాదాత్మ్యస్వీకారే మధుశబ్దోచ్చారణే ముఖే మాధుర్య రసాస్వాదాపత్తిః, వహ్నిశబ్దోచ్చారణే ముఖే దాహోపత్తి రిత్యాహుః। తన్న; భేదాభేదస్యోపపాదితత్వాత్।**

**వ్యాఖ్యానము :-** శబ్దార్థములకు తాదాత్మ్యమంగీకరించిన మధుశబ్దము నుచ్చరించిన మాధుర్యరసాస్వాదము, వహ్నిశబ్దము నుచ్చరించిన ముఖమందు దాహము = మంట కలుగ వలసివచ్చును గాన తాదాత్మ్య మంగీకరించుట యుక్తముగాదని నైయాయికమతము. అదియుక్తముగాదు. భేదాభేదరూపము తాదాత్మ్యము. అందు భేదము వాస్తవికము, అభేదము ఆరోపితము గావున ప్రాగుక్త దోషమున కవకాశము లేదు.

**మూలము :- వస్తుతో బౌద్ధ ఏవార్థః శక్యః, పదమపి స్ఫోటాత్మకం ప్రసిద్ధమ్। తయోస్తాదాత్మ్యమ్। తత్ర బౌద్ధే వహ్న్యాదావర్థే దాహాదిశక్తిమత్త్వాభావాత్। అత ఏవ 'శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః ( యో॥ సూ॥ 1-9 ) ఇతి**

వికల్పసూత్రం సంగచ్ఛతే। శబ్దజ్ఞానమాత్రేణానుపాతీ = బుద్ధావనుపతనశీలో వస్తుశూన్యః = బాహ్యార్థరహితః విశేషేణ కల్ప్యతే ఇతి వికల్పః, బుద్ధి పరికల్పిత ఇతి తదర్థః।

అత ఏవ –

> ఏష వన్ధ్యాసుతో యాతి ఖపుష్పకృత శేఖరః।
> కూర్మక్షీరచయే స్నాతః శశశృంగధనుర్ధరః॥

ఇత్యత్ర వన్ధ్యాసుతాదీనాం బాహ్యార్థశూన్యత్వేఽపి బుద్ధిపరి-కల్పితం వన్ధ్యాసుతశబ్దవాచ్యార్థమాదాయార్థవత్వాత్ ప్రాతిపదికత్వమ్। అన్యథా అర్థవత్త్వాభావేన ప్రాతిపదికత్వాభావాత్ స్వాద్యుత్పత్తిర్న స్యాత్।

యత్తు శశశృంగమిత్యత్ర శృంగే శశీయత్వభ్రమ ఇతి తార్కికైరుక్తమ్। తన్న। శశశబ్ద వాచ్యజంతుదర్శన రూపబాధే సతి శశశృంగం నాస్తీతి వాక్యే శశశృంగమిత్యస్య ప్రాతిపదికత్వానాపత్తేః। అర్థపదయోస్తాదాత్మ్యాత్ తత్తదర్థతాదాత్మ్యాపన్నః శబ్దో భిన్న ఇతి హేతోరర్థభేదాత్ శబ్దభేద ఇతి వ్యవహారః। సమానాకారమాత్రేణ తు, ఏకోఽయం శబ్దో బహ్వర్థ ఇతి వ్యవహారః

వ్యాఖ్యానము :- శబ్దార్థములకు తాదాత్మ్యమంగీకరించిన అగ్నిశబ్దోచ్చారణముచే ముఖమున మంట పుట్ట వలసివచ్చునను నైయాయికుల ఆపత్తిని తాదాత్మ్యములోని అభేదరూపాంశము అధ్యస్తముగాని వాస్తవికము గాదని చెప్పి వారించినాడు. ఇప్పుడు శబ్దార్థములు రెండిటికి వాస్తవికాభేదము నంగీకరించి సమాధానము చెప్పుచున్నాడు. శబ్దార్థములు బౌద్ధ (బుద్ధిస్థము) బాహ్య భేదముచే రెండు విధములు. బుద్ధిస్థమగు దానిని బౌద్ధమందురు. వైయాకరణమతమున బౌద్ధమగు స్ఫోటాత్మక శబ్దము వాచకము. బుద్ధిస్థమగు అర్థము వాచ్యము.

బౌద్ధమగు అర్థముతో బౌద్ధమగు శబ్దము యొక్క తాదాత్మ్యము వాస్తవికము. బౌద్ధమగు వహ్నిరూపార్థమున దాహకత్వశక్తి లేకపోవుటచే పైన పేర్కొనిన నైయాయికుల ఆపత్తికి అవకాశము లేదు. బౌద్ధ పదార్థము నంగీకరించుటవలననే 'శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః' అను పాతంజలయోగ సూత్రము సంగతమగుచున్నది. 'శబ్దశ్చ తజ్జన్యజ్ఞానంచ' ఇతి ద్వంద్వః। తే అనుపాతినీ యస్య సః శబ్దజ్ఞానానుపాతీ ఇతి బహువ్రీహిః. శబ్దశబ్దమునకు శబ్ద ప్రయోగమందు లక్షణ. శబ్దప్రయోగము, తజ్జన్య జ్ఞానము రెండిటికి జనకమగునదియు, బాహ్యవస్తు శూన్యమగు అంతఃకరణ వృత్తి విశేషము వికల్పమనబడును. వక్త అర్థమును తెలుసుకొని శబ్దప్రయోగమును చేయును గాన అతని మానస జ్ఞానము వికల్పమే. అట్లే శబ్దజ్ఞానమాత్రముచే శ్రోతయొక్క బుద్ధియందు భాసించు బాహ్యపదార్థ రహితమగు అర్థ జ్ఞానము వికల్పము. బౌద్ధ పదార్థమంగీకరించుట వలననే బాహ్యవస్తుశూన్యమగు, అర్థజ్ఞాన జనకమగు నంతఃకరణ వృత్తివిశేషము వికల్పమని చెప్పుట ఉపపన్నమగుచున్నది. పైన చెప్పిన యోగసూత్రవ్యాఖ్యానము లఘుమంజూషలో గ్రంథకృదభిప్రేతము. వాచస్పతిమిశ్రుల వ్యాఖ్యానము పరమ లఘు మంజూషలో చూపబడినది. శబ్దజ్ఞానమాత్రేణానుపాతీ = శబ్దజ్ఞానమాత్రముచే బుద్ధిస్థము, బాహ్యార్థ వస్తు శూన్యము వికల్పము = బుద్ధి పరికల్పితమని తదర్థము.

బౌద్ధ పదార్థమునంగీకరించుట వలననే ''గగన కుసుమములను (ఆకాశపుష్పములను) శిరోభూషణము చేసుకొని, కూర్మక్షీరసముద్రమున స్నానమాచరించి, కుందేటి కొమ్ము ధనస్సును ధరించిన వంధ్యా పుత్రుడు వెడలు చున్నాడు'' అనుచోట ఆకాశపుష్పము, కూర్మ క్షీరము, కుందేలు కొమ్ము, వంధ్యాపుత్రుడు అను పదార్థములు లోకమున అత్యంత మప్రసిద్ధమయినను వంధ్యాసుతాది శబ్దములకు బౌద్ధమగు నర్థమును

తీసుకొని అర్థవత్తు లగుటచే 'అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్' అను సూత్రముచే ప్రాతిపదికత్వము సిద్ధించినది. బౌద్ధార్థము నంగీకరింపకపోయిన వంధ్యాసుతాది శబ్దములు అర్థవత్తులు కాకపోవుటచే అర్థవత్సూత్రముచే ప్రాతిపదిక సంజ్ఞ సిద్ధింపక సు - ఔ - జస్ మున్నగు విభక్తి ప్రత్యయములు పుట్టక పోవలసి వచ్చును.

నైయాయికులు శశశృంగము మున్నగు అప్రసిద్ధస్థలములలో శృంగమందు శశీయత్వభ్రమయని చెప్పి ఉపపాదన చేయుచున్నారు. అనగా శశశృంగమను వస్తువు ప్రసిద్ధము కాకపోయినను శృంగశశములు ఖండశః = విడివిడిగ ప్రసిద్ధములు. అనగా శశత్వేన శశము, శృంగత్వేన శృంగము ప్రసిద్ధము. అన్యత్ర ప్రసిద్ధమగు శృంగమందు (కుందేలుకు కొమ్ము లేకపోయినను ఇతర మహిషాది జంతువులకు అది ప్రసిద్ధమే) శశసంబంధిత్వము భ్రమయగును. మహిషశృంగమనినచో ప్రమ = యథార్థజ్ఞానము. మహిషసంబంధిత్వము శృంగమునకు సంభవము కనుక. శశ సంబంధిత్వము అప్రసిద్ధము కనుక భ్రమ = మిథ్యాజ్ఞానము. ఇట్లు భ్రమ విషయమగు పదార్థము నంగీకరించి అర్థవత్త్వమును సంపాదించుటచే ప్రాతిపదిక సంజ్ఞ సిద్ధించునని నైయాయికుల తాత్పర్యము. వారిమతము యుక్తము గాదు. కుందేలు ప్రత్యక్ష విషయమగుచుండగా తదభావ బుద్ధి అనగా కుందేలు లేదను అభావజ్ఞానము కలుగదు. అభావబుద్ధిని గూర్చి ప్రతియోగి జ్ఞానము ప్రతిబంధకమగుటచే శశముండగా, శశము లేదను అభావజ్ఞానము బాధితమగుటచే 'శశశృంగం నాస్తి' అను వాక్యములో ఏకదేశమగు 'శశము లేదను' అభావజ్ఞానము కలుగకపోవుట వలన ఏకదేశ మనర్థకమగుటచే సముదాయము కూడా అర్థవంతము కాదు. కనుక శశశృంగాది పదములకు ప్రాతిపదికత్వము సిద్ధింపకపోవును. కనుక తదర్థము బౌద్ధార్థమును స్వీకరించవలెనని గ్రంథతాత్పర్యము.

శబ్దార్థములకు తాదాత్మ్యము నంగీకరించుట వలననే ఆయా యర్థములతో తాదాత్మ్యమును పొందిన ఆయా శబ్దములు భిన్నభిన్నములగుటచే 'అర్థభేదము వలన శబ్ద భేదము' వ్యవహారముపపన్నమగుచున్నది. అర్థములు భిన్నభిన్నము లైనప్పటికి తద్వాచకములగు శబ్దములు సమానమగు వర్ణానుపూర్వి కలిగియున్నప్పుడు 'ఒకే శబ్దము అనేక యర్థములు కల్గినది' ను వ్యవహారము కలదు.

**విశేషము** :- లఘుమంజూష బౌద్ధార్థ నిరూపణ ప్రకరణమున - శిరోభాగమే రాహువగుటచే 'రాహోః శిరః' అను భేదప్రయుక్త వ్యవహారము ఎట్లు ఉపపన్నమగు నను గ్రంథ సందర్భమున మతభేదముచే అనేక సమాధానములు చెప్పబడినవి. రాహోః శిరః అనుచోట భేదము అధ్యస్తము, అభేదము వ్యావహారికమని భామతీకారులగు వాచస్పతి మిశ్రుల మతము. స్వర్ణం కుండలమ్, స్వర్ణస్య కుండలమ్ అని రెండు వ్యవహారములు కనబడుచుండుటచే భేదము మరియు అభేదము రెండును వ్యావహారికములే యని మరికొందరి మతము. అనేక అవస్థలతో గూడిన రాహువునకు ఏదో ఒక యవస్థతో గూడిన శిరస్సు అవయవమని వ్యావహారిక భేదమేగాని అధ్యస్తము గాదు. ఇది కైయటాద్యాచార్యుల మతము. ఈ ప్రకరణమున నాగేశుడు భాష్యకారాభిమతమగు సిద్ధాంతమును 'వస్తుతస్తత్ర వికల్పాత్మకమేవ జ్ఞానమ్' ఇత్యాది గ్రంథముచే వివరించుచు ''శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః'' అను పాతంజలసూత్రముచే వికల్పలక్షణమును వివరించెను. వస్తుతః రాహోః శిరః అనుచోట వికల్పజ్ఞానమని చెప్పవలెను. శబ్దప్రయోగము, తజ్జన్యజ్ఞానము రెండిటికి జనకమగు, బాహ్యావస్తు శూన్యమగు అంతఃకరణ వృత్తివిశేషము వికల్పాత్మక వృత్తి యనబడును. ''అత్యంతాసత్యపి హ్యర్థే జ్ఞానం శబ్దః కరోతి హి'' అని భర్తృహరి చెప్పెను. లోకమున పదార్థము అత్యంత మప్రసిద్ధమయినను శబ్దప్రయోగముచే

మానసమగు తదర్థజ్ఞానము కలుగును. దీనివలన బౌద్ధమగు పదార్థమునంగీకరించుట సిద్ధించినది. కనుక 'రాహోః శిరః' అన్నప్పుడు వికల్పాత్మకజ్ఞానమని సిద్ధించినది. ఇది రజతము కాదను బాధ నిశ్చయము తరువాత 'ఇది రజతమ'ను శబ్దప్రయోగము, తాదృశప్రతీతి రెండును లేకపోవుటచే వికల్పజ్ఞానము మిథ్యాజ్ఞానాంతర్భూతముగాదు.

కైయటాదులు 'రాహోః శిరః' అనుస్థలమున అవస్థాభేదమునంగీకరించి కల్పితమగు అవయవావయవిభేదముచే షష్ఠీవిభక్తిని ఉపపాదన చేసినారు. అదియుక్తముగాదు. రాహు పదశ్రవణముచే బోద్ధకు రాహుత్వేన రూపేణ అనేకావస్థావిశిష్ఠ పదార్థబోధ కలుగదు. కనుక రాహోః శిరః ఇత్యాది స్థలములో వికల్పాత్మక జ్ఞానమునే అంగీకరించవలెను. వికల్పాత్మకవృత్తిచే స్వస్మిన్ స్వభేదమునంగీకరించి అవయవావయ విభావసంబంధముచే షష్ఠీవిభక్తిని సాధించవచ్చును.

**మూలము :- సా చ శక్తిః సాధుష్వివాపభ్రంశేష్వపి, శక్తిగ్రాహకశిరోమణేః వ్యవహారస్య తుల్యత్వాత్ । వ్యవహారదర్శనేన చ పూర్వజన్మానుభూతశక్తిస్మరణమ్। అత ఏవ బాలానాం తిరశ్చాం చాన్వయ బోధః। న హి తేషాం తదైవ తత్సంభవః।**

**యత్తు తార్కికాః - అసాధుశబ్దేన సాధుశబ్దస్మరణద్వారా అర్థబోధ ఇత్యాహుః । తన్న; సాధుస్మరణం వినాపి బోధానుభవాత్ । తద్వాచకసాధుశబ్దమజానతాం బోధానాపత్తేశ్చ । న చ శక్తిభ్రమాద్ బోధోఽసాధుశబ్దేష్వితి వాచ్యమ్, నిస్సందేహ ప్రత్యయస్య బాధకం వినా భ్రమత్వాయోగాత్ । అత ఏవ స్త్రీ శూద్ర బాలాదీనాముచ్చారితే సాధావజ్ఞసంశయే తదపభ్రంశేనార్థనిర్ణయః। అత ఏవ 'సమానాయామర్థావగతౌ శబ్దైశ్చాపశబ్దైశ్చ శాస్త్రేణ ధర్మనియమః (మ. భా. పస్పశా.) ఇతి భాష్యమ్, "వాచకత్వాఽవిశేషేఽపి నియమః పుణ్యపాపయోః" (వా.ప. 3-3-30)**

ఇతి హరికారికా చ సంగచ్ఛతే। అత ఏవార్యమ్లేచ్ఛాధికరణం సంగచ్ఛతే। తత్ర హి యద్యపి ఆర్యా యవశబ్దం దీర్ఘశూకే ప్రయుఞ్జతే మ్లేచ్ఛాస్తు ప్రియంగౌ ప్రయుఞ్జతే, తమేవ బుధ్యంతే, తథాప్యార్యప్రసిద్ధేః బలవత్త్వాద్ వేదే దీర్ఘశూకపరత్వైవేతి సిద్ధాంతితమ్। తవ తు మ్లేచ్ఛబోధస్య శక్తిభ్రమమూలకత్వేన భ్రాంతివిషయరజతజ్ఞానస్యేవ మ్లేచ్ఛప్రసిద్ధేః వస్త్వసాధకతయా ఆర్యమ్లేచ్ఛప్రసిద్ధ్యోః కస్యాః బలవత్త్వమితి విచారాసంగతిః స్పష్టైవ।

సాధుత్వం చ వ్యాకరణాన్వాఖ్యేయత్వం పుణ్యజనకతావచ్ఛేదక-ధర్మవత్త్వం వా। తద్భిన్నత్వమసాధుత్వమ్।

వ్యాఖ్యానము :-

శక్తిగ్రహం వ్యాకరణోపమాన కోశాప్తవాక్యా ద్వ్యవహారతశ్చ।
వాక్యస్య శేషా ద్వివృతే ర్వదన్తి సాన్నిధ్యతః సిద్ధపదస్య వృద్ధాః॥

వ్యాకరణము, ఉపమానము, కోశము మున్నగునవి శక్తిగ్రాహకములుగ చెప్పబడినవి, దీనిలో వ్యవహారము శక్తిగ్రాహకశిరోమణిగా అంగీకరించబడుచున్నది. శక్తిగ్రాహకమగు వ్యవహారము సాధుశబ్దములయందు వలె అసాధుశబ్దములయందు కూడా తుల్యముగానుండుటచే వాచ్యవాచకభావాపరపర్యాయమగుశక్తి సాధుశబ్దములందువలె అసాధుశబ్దములందుకూడా కలదు. జన్మకాలమున శక్తిజ్ఞాపకమగు శబ్దము లేకపోవుటచే వ్యవహారదర్శనము శక్తికి జ్ఞాపకము కాజాలదు. శక్తి జ్ఞానము లేకపోయిన ఇష్టసాధనతాజ్ఞానము (ఇదం మదిష్టసాధనమనుజ్ఞానము) కలుగకపోవుటచే బాలుడు స్తన్యపానమందు ప్రవర్తించకపోవునను శంకకు సమాధానము చెప్పుచున్నాడు- వ్యవహారదర్శనేన అని. వ్యవహారదర్శనముచే పూర్వ జన్మానుభూత శక్తి విషయక సంస్కారముద్బుద్ధమై పిమ్మట శక్తి స్మృతమగును. ఈ విధముగ

పశుపక్ష్యాదులకు కూడా మానవోచ్చారితమగు శబ్దశ్రవణముచే పూర్వజన్మగత శక్తి స్మరణము కలుగును. శబ్దశ్రవణానంతరము బాలురు లేక పశుపక్ష్యాదులు తత్తత్కార్యముల యందు ప్రవర్తించుటవలన వారికి తప్పక శాబ్దబోధ కల్గినదని అనుమానము చేయవలెను. శక్తి స్మరణము నంగీకరింపకపోయిన బాలాదులకు బాల్యమున శక్తిజ్ఞానము లేకపోవుటచే అర్థబోధ కలుగక ప్రవృత్తి లేకపోవలసివచ్చును. బాలురకు శక్తి గ్రాహకసామగ్రి లేకపోవుటచే జన్మకాలమందు శక్తి జ్ఞానము కలుగదు. కనుక పూర్వ జన్మానుభూతశక్తిస్మరణము నంగీకరించవలెను. సాధుశబ్దములవలె అసాధుశబ్దములకు కూడ శక్తి నంగీకరించుట వలన అపభ్రంశ శబ్దములను విన్నతోడనే శక్తిజ్ఞానము కలిగి అర్థబోధ కలుగుచున్నదని గ్రంథకృదభిప్రాయము.

సాధుశబ్దములయందు వలె అసాధు శబ్దములయందు కూడా వైయాకరణులు శక్తినంగీకరించగా నైయాయికులు సాధుశబ్దములయందు మాత్రము శక్తినంగీకరింతురు. సాధుశబ్దములను స్మరించుటద్వారా అపభ్రంశ శబ్దముల వలన అర్థబోధ కలుగునని వారి యభిప్రాయము. ఇచ్చుట ( వీరి మతమున) (1) వ్యుత్పన్నులకు సాధుశబ్దస్మరణము వలన, (2) అవ్యుత్పన్నులకు శక్తిభ్రమం వలన బోధకలుగునం గాన అపభ్రంశములయందు శక్తి కల్పన అవసరము లేదని రెండు అంశములు కలవు. స్వీయమతమున కుపష్టంభకముగ వాక్యపదీయకారుని ప్రమాణముగ చూపుచున్నారు.

తే సాధుష్వనుమానేన ప్రత్యయోత్పత్తిహేతవః ।
అంబాంబేతి యదా బాలః శిక్ష్యమాణః ప్రభాషతే ॥
అవ్యక్తం తద్విదాం తేన వ్యక్తే భవతి నిశ్చయః । ఇతి హర్యుక్తేః ।

అపభ్రంశములు, సాధు శబ్ద విషయక అనుమానము = అను పశ్చాత్ మానం జ్ఞానం = స్మరణచే అర్థబోధకు కారణములగుచున్నవి. తల్లిదండ్రులు 'అంబ, అంబ' అని పలుకులు నేర్పుచుండగా బాలుడు 'అమ్మ, అమ్మ' అను విధముగ శబ్దములను ఉచ్చరించుచుండును. అపభ్రంశములగు పిల్లల మాటలచే సాధుశబ్దములు స్మృతములై అర్థబోధ కలుగుచున్నదని భర్తృహరి చెప్పెను. కనుక అసాధు శబ్దములయందు ప్రత్యేకముగ శక్తి నంగీకరింప వలసిన పని లేదని నైయాయికుల యాశయము.

మంజూషాకారుడు నైయాయిక మతమును నిరసించుచున్నాడు తన్నేతి. సాధుశబ్ద స్మరణము లేకపోయినను అపభ్రంశ శబ్దములను విన్నతోడనే అర్థబోధ కలుగుట అనుభవములో కనబడుచున్నది. మరియు అపభ్రంశ బోధ్యార్థవాచక సాధుశబ్దములను తెలియని పురుషునకు అర్థబోధ కలుగక పోవలసి వచ్చును. కాని వారికి అర్థ బోధ కలుగుచునే యున్నది. వస్తుతః ఉచ్చరితములగు శబ్దములే అర్థబోధకములుగాని స్మృతములగు సాధుశబ్దముల వలన అర్థబోధ కలుగుట సంభవించదు. అసాధుశబ్దములయందు శక్తి లేకపోయినను శక్తిభ్రమవలన అర్థబోధ కలుగునని చెప్పుట కూడా యుక్తముగాదు. అనగా పటపదము చిత్రపదార్థ నిరూపితమగు శక్తి కలదను శక్తి భ్రమ ఒకరికి కలుగును. పిమ్మట పామరులలో పటపదము చిత్రపదార్థ నిరూపితమగు శక్తి కలదను జ్ఞాన పరంపర కల్గుచున్నది. మొదటి భ్రమాత్మక జ్ఞానముతో సదృశమగుటచే ఉత్తరోత్తర జ్ఞానమందు భ్రమత్వ వ్యవహారము కల్గుచున్నదని శక్తి భ్రమవాదుల తాత్పర్యము . నాగేశుడు పైమతమును నిరసించుచున్నాడు నిస్సందేహేతి. యథార్థము, అయథార్థమని ప్రత్యక్షము రెండు విధములు. అందు తదభావవతి తత్ప్రకారకజ్ఞానము అయథార్థము. రజతత్వ ధర్మము లేని శుక్తి యందు 'ఇది రజతమను' రజతత్వ ప్రకారక జ్ఞానము అయథార్థము

లేక భ్రమ యనబడును. హ్రదము ( మడుగు) వహ్నిమత్తు అను జ్ఞానము కలుగగా, తదుత్తర కాలమున 'హ్రదము వహ్న్యభావవత్తు' అను బాధజ్ఞానము కలుగుచుండుటచే హ్రదో వహ్నిమాన్ అనునది భ్రమాత్మకమగుచున్నది. ఆ విధముగ ప్రకృతమున అసాధు శబ్ద శ్రవణము వలన బోధ కలుగువారికి 'గోణీ ఇత్యాదులు అసాధు శబ్దములు వాచకములను శక్తి జ్ఞానో'త్తర కాలమున 'గోణ్యాదులు వాచకములు కావను బాధ జ్ఞానము' లేకపోవుటచే 'అసాధుశబ్దములు వాచకములను శక్తిభ్రమ'ను చెప్పుట సరికాదు.

అసాధు శబ్దములకు కూడా వాచకత్వమంగీకరించుట చేతనే స్త్రీ శూద్ర బాలాదులు అసామర్థ్యము వలన అస్పష్టముగ సాధుశబ్దములనుచ్చరించగ పండితులకు మొదట అర్థసంశయము కల్గినను పిమ్మట అపభ్రంశశబ్దములను స్మరించుట ద్వారా అర్థ నిర్ణయము చేసుకొనుచున్నారు. కనుకనే సాధుశబ్దములవలె అసాధుశబ్దశ్రవణము వలన అర్థబోధ సమానముగ కలుగుచుండగా సాధుశబ్ద ప్రయోగము వలననే అభ్యుదయము కల్గునని మహాభాష్యకారులు పస్పశాహ్నికమున పేర్కొనుట, మరియు సాధ్వసాధుశబ్దములకు వాచకత్వశక్తి సమానముగానున్నను సాధుశబ్ద ప్రయోగము వలన ధర్మము, అసాధుశబ్ద ప్రయోగము వలన అధర్మము కలుగునని' భర్తృహరి వచనము ఉపపన్నమగుచున్నవి. అపభ్రంశములకు వాచకత్వమును స్వీకరించుటలో మీమాంసకసమ్మతిని చూపుచున్నాడు - అత ఏవేతి । అత ఏవ - అపభ్రంశములకు వాచకత్వము నంగీకరించుట వలననే మీమాంసకుల ఆర్యమ్లేచ్ఛాధికరణముపపన్నమగుచున్నది. ఆర్యులనగా శిష్టులు. తదితరులు మ్లేచ్ఛులు = అనార్యులు. ఆర్యులు యవశబ్దమును దీర్ఘమగు కంటకములు కల్గిన ధాన్యమను నర్థమున ప్రయోగించు చుండగా మ్లేచ్ఛులు = అనార్యులు

ప్రియంగువను ధాన్య విశేషమున ప్రయోగించుచున్నారు. ఈ విధముగ యవ శబ్దముచే రెండర్థములు లభించుచుండగ ఆర్యమ్లేచ్ఛ వ్యవహారములో ఆర్యవ్యవహారము బలవత్తరమగుటచే యవశబ్దము దీర్ఘశూకపరముగ వేదవాక్యార్థ నిర్ణాయకమగు ఆర్యమ్లేచ్ఛాధికరణమున సిద్ధాంతీకరింపబడినది. భర్తృహరి ''శబ్దతత్త్వవిదః శిష్టాః శబ్దార్థేషు వ్యవస్థితాః।'' శబ్ద తత్త్వవేత్తలగు శిష్టులు శబ్దార్థ నిర్ణయమున ప్రామాణికులుగ గ్రహింపబడుచున్నారని శిష్టవ్యవహారమునకు బలవత్త్వమును చెప్పినాడు.

అపభ్రంశశబ్దములకు శక్తి నంగీకరింపని నైయాయికుల మతమున మ్లేచ్ఛులకు కలుగు అర్థబోధ శక్తిభ్రమమూలమగుటచే, శుక్తియందు రజత భ్రమ కలుగగా రజత జ్ఞానము వస్తుసాధకము కానట్లు మ్లేచ్ఛప్రసిద్ధి కూడా వస్తుసాధకము కాకపోవుటచే ఆర్యమ్లేచ్ఛ వ్యవహారములలో బలాబలవిచారము అసంగతము కావలసివచ్చును. శుక్తి (ముత్యపు చిప్ప) మిలమిల మెరియు రూపముచే రజతము (వెండి)గా భ్రమింపబడుచున్నది. అనగా శుక్తిని చూచి ఇది రజతమని భ్రమపడినాడు. రజతభ్రమతో దానియందు ప్రవర్తించినను ప్రయోజనము సిద్ధించదు. అట్లే మ్లేచ్ఛవ్యవహారము భ్రమమూలకమగుటచే ప్రమభ్రమలలో బలాబలవిచారమునకవకాశము లేకపోవుటచే ఆర్యమ్లేచ్ఛాధికరణ మసంగతము కావలసివచ్చునని తాత్పర్యము.

అపభ్రంశములయందు శక్తినంగీకరించినను వాటికి సాధుత్వము లేదని చెప్పుచు సాధుత్వ స్వరూపమును వివరించుచున్నాడు. 'పుణ్యాజనకతావచ్ఛేదక ధర్మవత్త్వం వా' అను వాక్యమున వాశబ్దము చార్థకము. 'వ్యాక్రియన్తే శబ్దాః అనేనేతి వ్యాకరణమ్' అను వ్యుత్పత్తిచే సాధుశబ్దవ్యుత్పాదకము వ్యాకరణశాస్త్రము.

వ్యాకరణ శాస్త్రముచే అన్వాఖ్యేయములగు శబ్దములయందుండు పుణ్యజనకతావచ్ఛేదక జాతి విశేషరూప ధర్మము సాధుత్వమనబడును. అయం శబ్దః అస్మిన్ అర్థే సాధుత్వవాన్ శిష్టైః ప్రయోగాత్ అని అనుమానము. ఇచ్చట సాధుత్వము కల్గిన శబ్దము వ్యాకరణ శాస్త్రాన్వాఖ్యేయము. అదియే పుణ్యజనకము. తద్విశేషణమగు సాధుత్వము పుణ్యజనకతావచ్ఛేదకము. తద్భిన్నమసాధుత్వము, ఏకఃపూర్వపరయోః ( అష్టాధ్యాయి 6-1-94) అను సూత్రభాష్యమున '' ఏకః శబ్దః సమ్యక్ జ్ఞాతః శాస్త్రాన్వితః సుప్రయుక్తః స్వర్గే లోకే చ కామధుగ్ భవతి'' అని చెప్పబడినది. ఏకః శబ్దః = ఒక్క శబ్దమైనను సమ్యక్జ్ఞాతః = సాధుశబ్దముగ తెలుసుకోబడి, శాస్త్రాన్వితః = శాస్త్రవ్యుత్పాదన మార్గముచే జ్ఞాతమై, సుప్రయుక్తః = శిక్షాశాస్త్రమందు ప్రతిపాదింపబడిన రీతిలో ఉచ్చరింపబడిన ఇహ పరలోకములలో సకలాభీష్టములను పూర్తిచేయును.

పుణ్యజనకతావచ్ఛేదకధర్మ విశేషము సాధుత్వమేల కావలయును? తత్తదర్థములయందు తత్తచ్ఛబ్దముల వ్యాకరణ వ్యుత్పాద్యత్వమే పూర్వోక్తధర్మ విశేషమని శంక కలుగవచ్చును దానికి లఘుమంజూషాకారుడు సమాధానము చెప్పినాడు. 'యదిహ పరినిష్ఠితం తత్సాధు' అని భాష్యకారులు వ్యాకరణశాస్త్రమును శబ్దసాధుతా జ్ఞాపకముగా చెప్పియున్నారు అని. కనుక పుణ్య జనకతావచ్ఛేదక జాతి విశేషము సాధుత్వమని చెప్పవలయును. వర్తమానకాలమున శబ్దసాధుత్వజ్ఞాపకమగు వ్యాకరణశాస్త్రము పాణినీయ వ్యాకరణమే.

గౌః అను శబ్దము యొక్క అర్థమును బోధించుటలో గావీ, గోణీ, గోతా, గోపోతలికా మున్నగు అపభ్రంశ శబ్దములు చాలా కలవను ''గౌరిత్యస్య శబ్దస్య గావ్యాదయో ఽపభ్రంశాః'' అను భాష్యము కూడా అపభ్రంశములకు శక్తినంగీకరించుటలో ప్రమాణము.

**విశేషము** :- వృత్త్యా అర్థబోధజనకత్వమర్థవత్త్వమని ఋ ౯క్సూత్రమున భాష్యకారుడు చెప్పెను. అపభ్రంశములకు శక్తినంగీకరించిన వృత్తివంత్తులగుటచే 'అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్' అనుసూత్రముచే ప్రాతిపదికసంజ్ఞ రావలసివచ్చునను శంక కలుగగా ప్రాతిపదికత్వము అపభ్రంశములకిష్టమేనని కొందరి మతము. ఈ విషయమున అత ఏవ పస్పశాయామేవం హి శ్రూయతే యర్వాణస్తర్వాణో నామ ఋషయో బభూవుః తే తత్రభవంతో యద్వానస్తద్వాన ఇతి ప్రయోక్తవ్యే యర్వాణస్తర్వాణ ఇతి ప్రయుఞ్జతే, యాజ్ఞే కర్మణి పునర్నాపభాషంతే' ఇతి భాష్యే ఉక్తమ్ అని భాష్యవచనములను ప్రమాణముగ చూపినారు. 'యర్వాణ, తర్వాణ' పేరుగల ఇద్దరు ఋషులు కలరు. వారు యద్వానః, తద్వానః అని ప్రయోగింపవలసివచ్చినపుడు యర్వాణః, తర్వాణః అని ప్రయోగించెడివారు. కాని 'యాజ్ఞికకర్మలలో అపశబ్దములనుచ్ఛరించెడివారుకాదు' అని భాష్య తాత్పర్యము. యర్వాణః తర్వాణః అనునవి ణకారాంత ప్రథమాబహువచనములు. నాగేశభట్టు ''పరేతు'' అని సిద్ధాంతమును చెప్పినాడు. 'సాధ్వనుశాసకము వ్యాకరణశాస్త్రము' అను భాష్యవచనముచే అర్థవత్సూత్రముచే ప్రాతిపదిక సంజ్ఞలో ఉద్దిష్టములు సాధుశబ్దములే. కనుక అసాధు శబ్దములకు ప్రాతిపదిక సంజ్ఞరాదు. యర్వాణః, తర్వాణః అనునవి అర్థవత్తులైనప్పటికి సాధుత్వము లేదు. కనుక వాటికంటె చేయబడిన స్వాదులు కూడా అసాధువులే.

**మూలము** :- సా చ శక్తిస్త్రిధా, రూఢిర్యోగో యోగరూఢిశ్చ, శాస్త్రకల్పితావయవార్థభానాభావే సముదాయార్థ నిరూపితా శక్తిః రూఢిః, యథా మణినూపురాదౌ। శాస్త్రకల్పితావయవార్థనిరూపితా శక్తిర్యోగః, యథా పాచకాదౌ। శాస్త్రకల్పితావయవార్థాన్విత విశేష్యభూతార్థనిరూపితా శక్తిర్యోగరూఢిః, యథాపంకజపదే। తత్ర పఙ్కజనికర్తృ పద్మమితి బోధాత్।

పద్మే అనుపపత్తి ప్రతిసంధానం సంబంధప్రతిసంధానం చ వినా న లక్షణావసరః । క్వచిత్ తాత్పర్యగ్రాహకవశాత్ కేవలరూఢ్యర్థస్య కేవలయోగార్థస్య చ బోధః 'భూవహౌ పఙ్కజముత్పన్నమ్' కల్హారకైరవముఖేష్వపి పఙ్కజేషు' ఇత్యాదౌ । స్పష్టం చేదమ్ అర్థాద్ (పా. సూ. 6-1-19) ఇతి సూత్రే భాష్యే । అశ్వగంధాదిపదమోషధివిశేషే రూఢమ్, అశ్వసంబంధిగంధవత్తయా వాజిశాలాబోధే యౌగికమ్ । ఇదం యౌగిక రూఢమిత్యుచ్యతే । ఏవం మండపపదం గృహవిశేషే రూఢం, మండపానకర్తరి యౌగికమ్ ।

**వ్యాఖ్యానము** :- వాచ్యవాచకభావాపర పర్యాయమగు శక్తి రూఢి, యోగము, యోగరూఢి యని మూడు విధములు. వ్యాకరణశాస్త్రముచే ప్రకృతి ప్రత్యయవిభాగ పూర్వకము సాధుశబ్దములు అన్వాఖ్యానము చేయబడుచున్నవి. ఏ శబ్దమందు అవయవములగు ప్రకృతి ప్రత్యయములు అర్థబోధకములు కాక సముదాయమే అర్థబోధకమగునో, ఆ పదమందు తదర్థ నిరూపితమగు శక్తి రూఢి యనబడును. అనగా ఏ పదములను వినుటవలన అవయవార్థము భాసించక సముదాయార్థముపస్థిత మగునో అట్టివి రూఢములగును. సముదాయార్థోపస్థాపకమగు శక్తి రూఢి శక్తి యనబడును. మణి నూపురాది శబ్దములు సముదాయశక్తిచే రత్నవిశేషమును, ఆభరణ విశేషమును బోధించు చున్నవి. ఇచ్చట అవయవార్థమునకు భానము లేదు. శాస్త్రకారులచే కల్పింపబడిన ప్రకృతి ప్రత్యయరూపావయవములకు సంబంధించిన అర్థనిరూపితశక్తి యోగశక్తియనబడును. పాకార్థక పచ్ ధాతువుకంటె కర్త్రర్థమందు ణ్వుల్ (అకాదేశము) ప్రత్యయము చేయగా నిష్పన్నమయిన పాచకశబ్దముచే 'పాకకర్త' అనునర్థము యోగశక్తి (అవయవశక్తి) చే తెలియబడుచున్నది. అవయవార్థాన్వితమగు సముదాయార్థమును బోధించు శక్తి

యోగరూఢియనబడును. పంకజపదము వలన బురద యందు పుట్టిన పద్మమును అవయవార్థాన్విత సముదాయార్థము యోగశక్తిచే బోధింపబడుచున్నది. 'పంకజనికర్తృ పద్మమ్' అనుబోధలో 'పంకజనికర్తృ' అను అంశము యోగశక్తిచే, మరియు పద్మవిషయక బోధ రూఢిశక్తిచే కలుగుచున్నది. అవయవశక్తి సమానాధికరణమగు సముదాయశక్తి యోగరూఢియని తాత్పర్యము. పంకజపదమునకు పద్మత్వవిశిష్టమందు లక్షణయనిన సరిపడుచుండగా సముదాయశక్తి నంగీకరించుట నిష్ప్రయోజనమను శంకకు సమాధానము చెప్పుచున్నాడు. అన్వయమునకు అనుపపత్తి కలుగుట లక్షణాబీజము. ప్రకృతమున పంకజ పదము వలన పద్మమను బోధ, అన్వయానుపపత్తి ప్రతిసంధానము మరియు శక్య సంబంధ ప్రతిసంధానము లేకుండగనే కలుగుచుండుటచే లక్షణకవకాశము లేదు. క్వచిత్ తాత్పర్య గ్రాహక పదాంతర సాన్నిధ్యముచే 'భూమౌ పంకజముత్పన్నమ్' అను వాక్యమున పంకజ శబ్దముచే కేవలము పద్మమను రూఢ్యర్థము గ్రహింపబడుచున్నది. పంకజనికర్తృరూప యోగార్థమునకు గ్రహణము లేదు. 'కల్హారకైరవముఖేష్వపి పంకజేషు' అనుస్థలమున పఙ్కజ పదము బురదయందు పుట్టినదను యోగార్థమును బోధించును. యోగరూఢి స్థలమున తాత్పర్యవశముచే కేవలయోగార్థ బోధ లేక కేవల రూఢ్యర్థ బోధ కలుగునను విషయము ''ఆర్ధాత్'' (అష్టాధ్యాయి 6-1-19) సూత్రభాష్యమున స్పష్టము చేయబడినది. అచ్చట పరిమాణపదము యోగరూఢి శక్తిచే సర్వతోమానమగు ప్రస్థాదిపరిమాణ విశేష బోధకమయినప్పటికి 'తదస్య పరిమాణమ్, సంఖ్యాయాః సంజ్ఞా' అను సూత్రములలో పరిమాణ పదముచే యోగరూఢ్యర్థము స్వీకరించిన విశేష్య విశేషణభావ మనుపపన్నముగాన రూఢ్యర్థమును విడిచి కేవల యోగార్థమగు పరిచ్ఛేదకత్వము గ్రహించవలెనని చెప్పుట వలన



(వచనాదిమతీ వినక్ష్యా భవిష్యతి' అని భాష్యము. రూఢిపరత్వైవ పరిచ్ఛేదకత్వమాశ్రయిష్యత ఇత్యర్థ ఇతి కైయటః) యోగరూఢిస్థలమున తాత్పర్య గ్రాహకవశమున కేవలరూఢ్యర్థము లేక కేవలయోగార్థ బోధ కలుగునని సిద్ధించినది. అశ్వగంధ అనుపదము ఓషధి విశేషమందు రూఢము. అశ్వసంబంధి గంధవత్తయిన అశ్వశాలను బోధించుటచే యౌగికము. ఇట్టివి యౌగిక రూఢములనబడుచున్నవి. అట్లే మండపపదము గృహవిశేషమందు రూఢము. మండపాన కర్తయందు యౌగికము. అర్థభేదముచే శబ్దభేదమంగీకరించుటచే అశ్వగంధాది శబ్దములొక యర్థమున యౌగికములు, మరియొక యర్థమున రూఢములు కనుక శక్తి రూఢి, యోగ, యోగరూఢి భేదముచే మూడు విధములు.

మూలము :- సైషా శక్తిః సంయోగాదిభిః నానార్థేషు నియమ్యతే । తదుక్తం హరిణా -

సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా ।
అర్థః ప్రకరణం లింగం శబ్దస్యాన్యస్య సన్నిధిః ॥
సామర్థ్యమౌచితీ దేశః కాలోవ్యక్తిః స్వరాదయః ।
శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః ॥

ఇతి । (వాక్యప ॥ 2-317, 318)

ఏతే సంయోగాదయో నానార్థేషు శబ్దేషు శబ్దార్థస్యానవచ్ఛేదే = సందేహే తదపాకరణ ద్వారా విశేషార్థ నిర్ణాయకా ఇతి తదర్థః । సంయోగ విప్రయోగయోరుదాహరణే సవత్సా ధేనురవత్సా ధేనురితి । సాహచర్యస్య రామలక్ష్మణావితి । సాహచర్యం సాదృశ్యం సదృశయో రేవ సహప్రయోగ ఇతి నియామాత్ । రామార్జున గతిస్తయోరిత్యాదౌ విరోధేన తత్ । 'అంజలినా జుహోతి', 'అంజలినా సూర్యముపతిష్ఠత' ఇత్యత్ర జుహోతీత్యాది

పదార్థవశాద్ అంజలిపదస్య తత్తదాకారాంజలిపరత్వమ్ । సైంధవమానయేత్యాదౌ ప్రకరణేన తత్। 'అక్తాః శర్కరా ఉపదధాతి' ఇత్యాదౌ 'తేజో వై ఘృతమ్' ఇతి ఘృతస్తుతిరూపాల్లిఙ్గాదక్తా ఇత్యస్య ఘృత సాధనకాఙ్క్షన పరత్వమ్। రామో జామదగ్న్య ఇతి జామదగ్న్య పదసన్నిధానాత్ రామః = పరశురామః । 'అభిరూపాయ కన్యా దేయా' ఇత్యాదౌ అభిరూపతరాయేతి సామర్థ్యాత్ ప్రతీయతే।

యశ్చ నింబం పరశునా యశ్చైనం మధుసర్పిషా ।
యశ్చైనం గంధమాల్యాద్యైః సర్వస్య కటురేవ సః ॥

ఇత్యత్రౌ చిత్యాత్ పరశునేత్యస్య ఛేదనార్థత్వమ్, మధుసర్పిషా ఇత్యస్య సేచనార్థత్వమ్, గంధమాల్యాద్యై రిత్యస్య పూజనార్థత్వమ్ । 'భాత్యత్ర పరమేశ్వర' ఇత్యత్ర రాజధానీరూపదేశాత్ పరమేశ్వరపదం రాజబోధకమ్। చిత్రభానుర్భాతీత్యాదౌ రాత్రావగ్ని దివా సూర్యే। వ్యక్తిర్లిఙ్గమ్। మిత్రోభాతి మిత్రంభాతీత్యాదౌ ఆదౌ సూర్యః అంత్యే సుహృత్।స్థూలపృషతీమిత్యాదౌ స్వరాత్ తత్పురుష బహువ్రీహ్యర్థ నిర్ణయః।

ఇతి శక్తినిరూపణమ్

వ్యాఖ్యానము :- శక్తి యొక్క స్వరూపము, తద్భేదములు నిరూపించి పిమ్మట శక్తి జ్ఞాన తాత్పర్యనిర్ణాయకములను నిరూపించుచున్నాడు. ఒకే శబ్దమునకు అనేకార్థములు కల నానార్థక స్థలమున వాచ్యవాచకభావాపర పర్యాయమగు శక్తి సంయోగము, విప్రయోగము మున్నగు వానిచే తత్తదర్థముల యందు నియమింపబడుచున్నది. అనగా నానార్థకస్థలములో వక్తృతాత్పర్య నియామకములు సంయోగాదులు. భర్తృహరి వాక్య పదీయమున ఈ విషయమును స్పష్టపరచెను -

సంయోగము, విప్రయోగము, సాహచర్యము, విరోధము,

అర్థము, ప్రకరణము, లింగము, అన్యశబ్ద సాన్నిధ్యము, సామర్థ్యము, ఔచిత్యము, కాలము, వ్యక్తి, స్వరము మున్నగునవి నానార్థక శబ్దములలో ఏ యర్థము గ్రహింప వలెనను సంశయము కలిగినపుడు దానిని పోగొట్టుట ద్వారా విశేషార్థ నిర్ణాయకములగును. విశేషార్థ స్మృతి హేతువులని తాత్పర్యము. అనగా సంయోగాదులు ఒక యర్థమందు తాత్పర్య నిర్ణయము చేయుచు తదర్థ మాత్ర విషయక శాబ్దబోధను కలిగించుటలో సహకారులగు చున్నవి. సంఖ్యా సంజ్ఞావిధాయక సూత్ర భాష్యమున ఈ విషయము స్పష్టము. తత్రహి ''వతుసాహచర్యాత్ తద్ధిత ఏవ డతిర్నతు పాతేర్డతిః'' ఇత్యుక్తమ్। సంబంధజ్ఞానమున్నను సంయోగాది జ్ఞానము లేక తజ్జన్య ప్రథమార్థ తాత్పర్య జ్ఞానముగాని ప్రతిబంధకమగుటచే ద్వితీయార్థ బోధ కలుగదు.

(1) సంయోగము = ప్రసిద్ధ సంబంధము. ఉదా. సవత్సా ధేనుః। ధేను శబ్దమునకు నవప్రసూత యనియర్థము. అది గేదె లేక ఆవు-కావచ్చును. కనుక ధేను శబ్దముచే దేనిని గ్రహింపవలెనని సందేహము కలుగుచున్నది. ఇచ్చట వత్స శబ్దము ఆవు దూడ యందు ప్రసిద్ధము. కనుక 'సవత్సా' అను వత్స సంయోగముచే ధేను శబ్దము దూడతో కూడిన ఆవును బోధించును.

(2) విప్రయోగము :- వియోగము సంయోగ పూర్వకమగుటచే 'అవత్సా ధేనుః' అను వాక్యమున ధేను శబ్దముచే వత్స వియోగజ్ఞానముచే గోరూపార్థ బోధ కలుగును. ధేను శబ్దము నవప్రసూతయగు ఆవును మాత్రము బోధించుననను మతమున క్రమముగ 'సశంఖ చక్రో హరిః, అశంఖచక్రోహరిః' అనునవి ఉదాహరణములుగ తెలుసుకొనవలెను. సశంఖచక్రో హరిః అను స్థలమున హరి శబ్దము సూర్యాద్యర్థముల యందు శక్తమగుటచే ఏ యర్థము గ్రహింపవలెనను సందేహము కలుగును. ప్రసిద్ధ

శంఖ చక్ర సంబంధము విష్ణువుకే సంభవించునుగాన హరి శబ్ద శక్తి విష్ణురూపార్థమందు నియంత్రితమగుచున్నది. అట్లే అశంఖ చక్రో హరిః అను వాక్యమున శంఖ చక్ర వియోగము హరి శబ్దమునకు విష్ణు రూపార్థమందు తాత్పర్య గ్రాహకము.

(3) **సాహచర్యము** :- సహచరస్య భావః సాహచర్యమ్ । సహ చరణము ప్రాయశః సదృశములైన వానికే లోకమున కనబడుచుండుటచే సాహచర్య శబ్దముచే సాదృశ్యము గ్రహింపవలెను. 'సదృశార్థయోః శబ్దయోరేవ ద్వంద్వేన సహప్రయోగః' అని సామాన్య నియమము. సాహచర్యమనగా సాదృశ్యమని చెప్పుట వలననే కావ్యప్రకాశకారుడగు మమ్మటభట్టు చెప్పిన ''సాహచర్యము సహచరత్వము. ఒక కార్యమందు ప్రసిద్ధమగు పరస్పర సాపేక్షత్వము'' ను మాటలు నిరస్తములయినవి. 'రామలక్ష్మణౌ' అను స్థలమున రామ శబ్దమునకు దశరథాపత్యమగు శ్రీరామచంద్రుడు, భార్గవరాముడు, బలరాముడు అనునర్థముల యందు శక్తి యున్నను లక్ష్మణ సాహచర్యముచే రామశబ్దమునకు దశరథాపత్య మందు శక్తి నియంత్రితమగు చున్నది. రామలక్ష్మణౌ అను స్థలమున రామ శబ్దము బహ్వర్థకమైనట్లు లక్ష్మణ శబ్దము కూడా దశరథాపత్యము, దుర్యోధనాపత్యములను చెప్పుటచే నానార్థకమగుచున్నది. రామ శబ్దముచే దశరథాపత్యమను బోధ కలుగగ లక్ష్మణ శబ్దముచే దశరథ సంతతియగు లక్ష్మణుడను జ్ఞానము కలుగును. అట్లే లక్ష్మణ శబ్దమునకు దశరథాపత్యమని అర్థ నిశ్చయము కల్గిగిన తరువాత రామశబ్దార్థ బోధ కలుగును. ఈ విధముగ పరస్పరము అపేక్షింపబడుచున్నవి. అనగా రామనిష్ఠ దాశరథిత్వజ్ఞానాధీనము లక్ష్మణనిష్ఠ దాశరథిత్వజ్ఞానము అట్లే లక్ష్మణనిష్ఠ తాదృశజ్ఞానాధీనము రామ నిష్ఠతాదృశజ్ఞానమగుటచే అన్యోన్యాశ్రయ దోషమని శంక కలుగుచున్నది. దీనికి నాగేశభట్టు లఘుమంజూషలో 'రామలక్ష్మణౌ' ఇత్యాదౌ

సాహచర్యేణోభయోర్యుగపదేవ నియమనమితి నాన్యోన్యాశ్రయః అని సమాధానము చెప్పెను. అనగా సాహచర్యముచే ఒక్కమారుగ రామలక్ష్మణ శబ్దముల వలన దాశరథి రూపార్థ జ్ఞానము కలుగును గాని పౌర్వాపర్యముగ (క్రమముగ) కాదు, కనుక అన్యోన్యాశ్రయ దోషము లేదు. రామలక్ష్మణౌ అను స్థలమున శాబ్దబోధ అనుభవసిద్ధము గావున అన్యోన్యాశ్రయ దోషమునకు కారణమగు క్రమిక బోధ లేదని, సాహచర్యముచే ఏకకాలమందే రామలక్ష్మణ శబ్దములకు తత్తదర్థములయందు నియమనమని చెప్పవలెను. సాహచర్య శబ్దమునకు లక్షణచే సాదృశ్యమని అర్థము చెప్పవలెను గాని సహచరత్వముగాదని పూర్వము చెప్పబడినది.

(4) విరోధితా = విరోధము. ఉదా : - రామార్జున గతిస్తయోః । రామార్జునులవంటి వారి నడవడిక. ఇచ్చట రామ శబ్దము, అర్జున శబ్దము రెండును నానార్థకములైనప్పటికి పరస్పర విరోధముచే రామార్జున శబ్దములకు క్రమముగ పరశురామ కార్తవీర్యార్జునులయందు శక్తి నియంత్రితమగుటచే తత్తదర్థ బోధ శ్రోతకు కలుగుచున్నది. అనగా పరస్పర విరోధముచే రామశబ్దముచే పరశురాముడు, అర్జున శబ్దముచే కార్తవీర్యార్జునుడు గ్రహింపబడుచున్నారు. రామార్జునయోరివ తయోర్గతిః' అని విరోధముచే భార్గవ కార్తవీర్యబోధ కలుగుచున్నదని తాత్పర్యము. విరోధము స్ఫురించుకాలమందే శక్తి నియమనము కూడ జరుగుటచే అన్యోన్యాశ్రయ దోషమునకవకాశము లేదు. 'రామరావణౌ' అనునది అసంకీర్ణోదాహరణము.

(5) అర్థము = ప్రయోజనము. 'అంజలినా జుహోతి' (అంజలితో హోమము చేయవలె) అంజలినా సూర్యముపతిష్ఠతే' (అంజలితో సూర్యోపస్థానము చేయవలె) మున్నగు స్థలములలో హవనము, సూర్యోపస్థానము మున్నగు క్రియలు తత్తదాకారముగల అంజలులచే

సంపన్నములగును. కనుక తత్తత్కార్య సంపాదన రూపప్రయోజనము వలన నానార్థకమగు అంజలి పదము ( భిన్నభిన్నాకారములను బోధించు అంజలి పదము) తత్తదాకారము గల అంజలిని బోధించుటలో నియంత్రితమగు చున్నది. 'స్థాణుం భజ భవచ్ఛిదమ్' అను వాక్యమున అన్య సాధ్యమగు భవచ్ఛేదనరూప ప్రయోజనము నానార్థకమగు స్థాణుపదశక్తిని ఈశ్వర రూపార్థమందు నియంత్రించు చున్నది.

(6) **ప్రకరణము** :- వక్తృశ్రోతృబుద్ధి రూపమగు ప్రకరణము శక్తినియామకము. 'సైంధవమానయ' అను వాక్యమున సైంధవ పదమునకు అశ్వము, లవణము అను రెండర్థములు కలవు. సైంధవమును తీసుకురమ్మనమని వక్త పలుకగా శ్రోతకు ఏది తీసుకు వెళ్ళవలెనని మొదట సందేహము కలుగును. పిమ్మట భోజన ప్రకరణమయిన లవణ రూపార్థబోధ, యుద్ధప్రకరణ మయిన అశ్వరూపార్థబోధ కలుగును. ఈ విధముగ ప్రకరణము శక్తినియామకమగుచున్నది.

(7) **లింగము** :- ఇతర వ్యావర్తకమగు ధర్మ విశేషము లింగము అనగా జ్ఞాపకము. ఉదా : - ''అక్తాః శర్కరా ఉపదధాతి' । మృత్తికామిశ్రాః క్షుద్రపాషాణాః శర్కరాః । అంజన మిశ్రితమగు శర్కరలను ఉపధానము చేయవలెనని వాక్యార్థము. ఇచ్చట అంజనము ఘృతము లేక తైలనిర్మితమను సామాన్యార్థ బోధకలుగుచుండగా ''తేజో వై ఘృతమ్'' అను ఘృతస్తుతిరూపలింగముచే అక్తాః అన్నప్పుడు అంజనము ఘృతనిర్మితము గ్రహింపవలెనని తెలియబడుచున్నది. ఘృత స్తుతి రూపలింగము ఘృత సాధనకాంజనరూపార్థ జ్ఞాపకము. 'కుపితో మకరధ్వజః' అనునది ప్రసిద్ధమగు ఉదాహరణ. ఇచ్చట మకరధ్వజ శబ్దమునకు 'సముద్రుడు, మన్మథుడు' అని బహ్వర్థములు గలవు. కాని చేతన ధర్మమగు కోపరూపలింగము మకరధ్వజ శక్తిని మన్మథ రూపార్థమందు

నియమించుచున్నది. లింగమనగా చిహ్నమని కొందరు. అది యుక్తముగాదు. అసాధారణ చిహ్నము లింగము. కోపము మన్మథుని అసాధారణ ధర్మము గాదు. కనుక వ్యావర్తక ధర్మము లింగమని చెప్పవలెను.

(8) అన్యశబ్దసాన్నిధ్యము :- 'రామో జామదగ్న్యః' అను స్థలమున జామదగ్న్య పదసన్నిధానముచే నానార్థకమగు రామశబ్ద శక్తి పరశురాముడను నర్థమందు నియంత్రితమగుచున్నది. అనగా అన్యశబ్దసన్నిధి వలన రామశబ్దము పరశురామార్థ బోధ కలుగుటలో నియామకము. జామదగ్న్యపద సన్నిధానము వలన నానార్థకమగు రామశబ్దము పరశురాముడను నర్థమును బోధించుచున్నదని తాత్పర్యము.

(9) సామర్థ్యము = కరణత్వమ్ । ఇది శబ్దనిష్ఠము అర్థనిష్ఠమని రెండు విధములు. మొదటి దానికుదాహరణ 'అభిరూపాయ కన్యా దేయా.' = అందమయిన వానికి కన్యనీయవలెనని యర్థము. కన్యాదానము అందమైన వానికే చేయును గాన తిరిగి 'అభిరూపాయ' అని చెప్పవలసిన పనిలేదు. శబ్దసామర్థ్యముచే మిక్కిలి సుందరుడను నర్థము సిద్ధించుచున్నది. 'మధునా మత్తః కోకిలః' అనునది అర్థ సామర్థ్యమునకుదాహరణ. కోకిల మాదన సామర్థ్యము వసంతర్తువుకు మాత్రము సంభవము గాన నానార్థకమగు మధుశబ్దముచే తదర్థ బోధ కలుగుచున్నది.

(10) ఔచిత్యము :- 'యశ్చ నింబం పరశునా' ఇత్యాది శ్లోకము ఉదాహరణ. వేప చెట్టును గొడ్డలితో (నరకువానికి) తేనె మరియు నేతితో (తడుపువానికి) గంధమాల్యాదులచే (పూజించువానికి) అందరికి కటువుగానే యుండును. ఇచ్చట 'పరశునా, మధుసర్పిషా, గంధమాల్యాద్యైః' అను పదములు కరణకారక విభక్త్యంతములు. కారకములు క్రియతో నన్వయించును. ఇచ్చట క్రియలు గ్రహింపబడక పోవుటచే అనేక క్రియా సందేహములు కలుగగ ఔచిత్యముచే ఛ్చేదన, సేచన,

పూజనార్థక క్రియలు అధ్యాహృతమగుచున్నవి.

(11) దేశము :- భాత్యత్ర పరమేశ్వరః అనువాక్యమున నానార్థకమగు పరమేశ్వర శబ్దము 'అత్ర' అను దేశ నిర్దేశముచే రాజరూపార్థమును బోధించుచున్నది.

(12) కాలము :- చిత్రభానుర్భాతి = అగ్ని లేక సూర్యుడు ప్రకాశించుచున్నాడు. ఇచ్చట చిత్రభాను శబ్దము అగ్ని లేక సూర్యుని బోధించుటచే నానార్థకము. ఈ వాక్యము రాత్రియందు ప్రయోగించిన చిత్రభాను శబ్దమునకు అగ్ని యర్థము. పగలు ప్రయోగించిన సూర్యుడర్థము. ఈ విధముగ కాలము నియామకమగుచున్నది.

(13) వ్యక్తి :- వ్యక్తి శబ్దముచే లింగము గ్రాహ్యము. ఇది ప్రాచీన సంజ్ఞ. కనుకనే ''లుపి యుక్తవద్వ్యక్తివచనే'' అను పాణిని సూత్రము సంగతమగుచున్నది. కోశకారులు సూర్యుడర్థమున మిత్రశబ్దమునకు పుంలింగమున నంగీకరించుటచే 'మిత్రో భాతి' అను స్థలమున మిత్రశబ్దమునకు సూర్యుడర్థము. స్నేహితుడర్థమున నపుంసకలింగముగ చెప్పుటచే 'మిత్రం భాతి' అను వాక్యమున మిత్ర శబ్దమునకు స్నేహితుడర్థము. ఇచ్చట లింగము నియామకము.

(14) స్వరము :- ఉదాత్త, అనుదాత్త, స్వరిత భేదముచే స్వరము మూడు విధములు. ''స్థూలపృషతీ మాగ్నివారుణీ మనడ్వాహీమాలభేత'' అన వాక్యమున స్థూలపృషతీ శబ్దము 'స్థూలా చాసౌ పృషతీ చ' అని తత్పురుష సమాసమా ? లేక 'స్థూలాని పృషన్తి యస్యాః సా' అని బహువ్రీహిసమాసమా ? అని సందేహము కలుగగా స్వరము తన్నిర్ణాయకమగుచున్నది. ''బహువ్రీహౌ ప్రకృత్యా పూర్వపదమ్'' (6-2-1) అను సూత్రముచే పూర్వపద ప్రకృతిస్వరము కల్గిన బహువ్రీహి

సమాసమని, ''సమాసస్య'' (6-1-223) అను సూత్రముచే సమాసాంతోదాత్తము కల్గిన తత్పురుష సమాసమని సందేహనివృత్తి కలుగుచున్నది.

**విశేషము** :- 'కాలో వ్యక్తిః స్వరాదయః' అని ఆది పదముచే షత్వ - సత్వ- ణత్వ - నత్వములను గ్రహింపవలెను. అనగా దీని వలన విశేషార్థ బోధ కలుగును. సుః పూజాయామ్ (1-4-94) అను సూత్రముచే పూజార్థమందు 'సు' అనుదానికి కర్మప్రవచనీయ సంజ్ఞ విధించుటచే ఉపసర్గ సంజ్ఞ లేకపోవుట వలన సుసిక్తమ్ అను స్థలమున ''ఉపసర్గాత్ సునోతి'' అను సూత్రముచే షత్వము రాదు. సుసిక్తమ్ అను ప్రయోగమున ప్రశంస వ్యక్తమగు చున్నది. 'సుషిక్తమ్' అను ప్రయోగమున 'సు' అనునది పూజార్థకము కాకపోవుటచే నింద వ్యక్తమగుచున్నది. ప్రణయతి అను విగ్రహమున 'ప్ర' అనునది 'నీఞ్' ధాతువుతో సంబద్ధమగుటచే 'ఉపసర్గాః క్రియాయోగే, అను సూత్రముచే ఉపసర్గ సంజ్ఞను పొందును. కనుక 'ఉపసర్గాదసమాసేఽపి అను సూత్రముచే ణత్వము వచ్చి 'ప్రణాయకః' అను రూపము నిష్పన్నమగును. ప్రకృష్ట నయకర్త అని యర్థము. ప్రగతః నాయకః యస్మాద్ దేశాదసౌ ప్రనాయకః. ఇచ్చట ప్రశబ్దము నాయకశబ్దముతో సంబద్ధమగుటచే క్రియావాచక శబ్దముతో యోగము లేకపోవుటచే ఉపసర్గ సంజ్ఞ లేక ణత్వము ప్రవర్తించదు. ఏ దేశమునుండి నాయకుడు వెడలెనో అట్టి దేశమని ప్రనాయక శబ్దమునకర్థము. నానార్థక స్థలములలో ప్రాథమికార్థబోధ కల్గిన తరువాత వక్తృబోద్ధవ్య వైశిష్ట్యము మరియు ప్రతిభాదుల సహకారముచే ద్వితీయార్థబోధ వ్యంజనావ్యాపారము వలన కల్గును. నవనవోన్మేషశాలిని యగు ప్రజ్ఞ ప్రతిభ యనబడును. కావ్య ప్రకాశకారుడగు మమ్మటుడు కూడా ద్వితీయార్థ బోధ వ్యంజనా వ్యాపారము వలననే కలుగునని.

వ్యక్త్యబోద్ధవ్యకాకూనాం వాక్యవాచ్యార్థ సన్నిధేః ।
ప్రస్తావ దేశ కాలాదేర్వైశిష్ట్యాత్ ప్రతిభాజుషామ్ ॥

ఇత్యాది గ్రంథ సందర్భముచే వివరించెను. కనుక సంయోగాదులచే మొదట తాత్పర్య విషయీభూతార్థ బోధ కలిగిన తరువాత అభిధ చేతనే ద్వితీయార్థ బోధకలుగునని చెప్పువారల మతము నిరస్తమయినది.

వస్తుతః నానార్థక స్థలమున సామర్థ్యము ముఖ్యతాత్పర్య నిర్ణాయకము. సంయోగాదులు తద్వ్యంజకములని లఘుమంజూషలో నాగేశుడు పేర్కొనెను. సామర్థ్యమునకు ముఖ్య తాత్పర్య నిర్ణాయకత్వము చెప్పుటచే సంయోగాదులు తాత్పర్య నిర్ణయములో గౌణములు కావచ్చును కనుక హరి కారికతో విరోధము లేదు.

శక్తి నిరూపణము సమాప్తము

## అథ లక్షణా నిరూపణమ్

మూలము : నను లక్షణా కః పదార్థః ? ఇతిచేత్ అత్ర తార్కికాః – స్వశక్య సంబంధో లక్షణా । సా చ ద్వివిధా, గౌణీ శుద్ధా చ । స్వనిరూపిత సాదృశ్యాధికరణత్వ సంబంధేన శక్యసంబంధ్యర్థ ప్రతిపాదికా గౌణీ। తదతిరిక్త సంబంధేన శక్యసంబంధ్యర్థ ప్రతిపాదికా శుద్ధా । ప్రకారాంతరేణాపి సా ద్వివిధా – అజహత్ స్వార్థా, జహత్ స్వార్థా చ । స్వార్థ సంవలిత పరార్థాభిధాయికా అజహత్ స్వార్థా । తేన ఛత్రిణో యాన్తి, కుంతాన్ ప్రవేశయ, యష్టీః ప్రవేశయ, కాకేభ్యో దధి రక్ష్యతా మిత్యాదౌ ఛత్రి సహిత సేనా – కుంతాస్త్రసహితపురుష – యష్టి సహిత పురుష – కాకసహిత సర్వదధ్యుపఘాతక బోధః ।

స్వార్థ పరిత్యాగేనేతరార్థాభిధాయికా అన్యా । తత్పరిత్యాగశ్చ శక్యార్థస్య లక్ష్యార్థాన్వయినాఽనన్వయిత్వమ్ । తేన గాం ఘోషం

పాతయేత్యాదౌ గోసదృశ లక్షణాయామపి న గోస్తదన్వయి పాతన క్రియా న్వయిత్వమ్।

వ్యాఖ్యానము :- వృత్తి భేదములలో రెండవదగు లక్షణను నిరూపించు ప్రకరణమున నైయాయిక మతమును ఖండించుటకు, ముందు వారిచే చెప్పబడిన లక్షణావృత్తి స్వరూపమును చూపుచున్నాడు - అత్ర తార్కికాః అని. స్వశక్య సంబంధము లేక శక్య సంబంధము లక్షణ. లాక్షణిక పదలక్ష్యమగు అర్థమునకు శక్యార్థముతో సామీప్యాది సంబంధము లక్షణ. 'గంగాయాం ఘోషః' (గంగయందు పల్లెయున్నది) అను వాక్యమున గంగాపదశక్యమగు ప్రవాహరూపార్థమునకు లక్ష్యార్థమగు తటముతో సామీప్య సంబంధము లక్షణ. అనగా గంగాప్రవాహమందు పల్లెయుండుట అనుపపన్నము గావున ప్రవాహమునకు సమీపవర్తియగు తటము గంగాపదముచే లక్షితమగుచున్నది. గౌణీ, శుద్ధా భేదముచే లక్షణ రెండు విధములు. స్వనిరూపిత సాదృశ్యాధికరణత్వ సంబంధముతో శక్యసంబంధియగు అర్థమును ప్రతిపాదించునది గౌణీ లక్షణయనబడును. గుణాదాగతా గౌణీ. స్వం = శక్యార్థము. గౌర్వాహీకః అను స్థలమున గవాభిన్నుడు వాహీకుడు కాదు. అనగా వాహీకుడు (వ్యక్తి పేరు) ఎద్దు అనుట పొసగదు. కనుక గోనిరూపిత సాదృశ్యము వాహీకుని యందుండుటచే (ఎద్దు యందున్న జాడ్యము, మాంద్యము మున్నగు ధర్మములతో సమానమైన ధర్మములు వాహీకునియందుండుటచే గోసదృశుడు వాహీకుడు) గోనిరూపిత సాదృశ్యాధికరణత్వ సంబంధముచే గోశబ్దము సంబంధియగు వాహీకుని చెప్పుచున్నది. అనగా గోశబ్దమునకు ప్రాగుక్త సంబంధముచే వాహీకుని యందు లక్షణ. దీనినే గౌణీ లక్షణ యందురు. గోసదృశాభిన్నుడు వాహీకుడని బోధకలుగును. సాదృశ్యాఖ్య సంబంధము కంటె భిన్నములగు సామీప్య, జన్యజనకభావాది సంబంధములచే

శక్యార్థముతో సంబద్ధమగు అర్థమును చెప్పు లక్షణ శుద్ధా యనబడును. గఙ్గాయాం ఘోషః, ఆయుః ఘృతమ్ మున్నగునవి ఉదాహరణములు. గంగాయాం ఘోషః అను స్థలమున గంగాపదమునకు ప్రవాహమర్థము. ఘోషాధికరణత్వము ప్రవాహమునకు సంభవించదు గావున అన్వయానుపపత్తిచే గంగాపదమునకు ప్రవాహ సంబద్ధమగు తటమందు లక్షణ. ఇదియే శుద్ధలక్షణ యనబడును. ఇచ్చట శక్యార్థమగు ప్రవాహమునకు లక్ష్యార్థమగు తటముతో సాదృశ్యభిన్న సామీప్యము సంబంధము.

ప్రకారాంతరముచే జహత్స్వార్థా, అజహత్స్వార్థా యని లక్షణ రెండు విధములు. జహాతి పదాని స్వార్థం యస్యాం సా జహత్ స్వార్థా స్వార్థమనగా శక్యార్థమును విడచి తత్సంబద్ధమగు అన్యార్థమును బోధించునది జహత్స్వార్థా. శక్యార్థమునకు లక్ష్యార్థమువలె ఏవిధముగను అన్వయము లేకపోవుటే శక్యార్థ పరిత్యాగము. లక్ష్యార్థమన్వయించు పదార్థమున శక్యార్థమునకేవిధముగను అన్వయము లేకపోవుట జహత్ స్వార్థాయని తాత్పర్యము. తద్భిన్నము అజహత్ స్వార్థా రెండవది. శక్యార్థమును విడువకనే తత్సంబద్ధమగు అన్యార్థమును బోధించునది అజహత్ స్వార్థా. శక్యార్థము ఎట్లైనను లక్ష్యార్థమన్వయించుదానితో అన్వయించుటయే శక్యార్థా పరిత్యాగము. ఉదా:- ఛత్రిణో యాంతి (ఛత్రములు కలవారు వెళ్ళుచున్నారు) అను వాక్యమున ఛత్రి పదమునకు ఛత్రి అఛత్రి సముదాయమందు, లక్షణ. లక్ష్యార్థమన్వయించు గమన క్రియతో ఛత్రిరూపశక్యార్థమన్వయించు చున్నది. ఏకక్రియాకర్తృత్వము శక్య-లక్ష్యార్థముల సంబంధము.

కుంతాన్ ప్రవేశయ = బల్లెములను ప్రవేశపెట్టుము అను వాక్యమున కుంతపదమునకు కుంతములను ధరించు పురుషులయందు లక్షణ.

కుంతధారులగు పురుషులు గమనక్రియతో అన్వయించినట్లు, కుంతరూపశక్యార్థము కూడా కుంతత్వేన రూపేణ అన్వయించుటచే అజహత్స్వార్థాలక్షణ - అట్లే యష్టీః ప్రవేశయ = కఱ్ఱలను ప్రవేశపెట్టుము అను వాక్యమున సమన్వయము.

కాకేభ్యో దధి రక్ష్యతామ్ అను స్థలమున కాకపదమునకు దధ్యుపఘాతకములగు కాకాకాక సముదాయమందు లక్షణ. కాకరూప శక్యార్థము లక్ష్యార్థముతో బాటు దధ్యుప ఘాతకములనుండి రక్షణము అనగా వినాశాభావము యొక్క ఏకదేశమగు వినాశములో ప్రయోజ్యత్వ సంబంధముతో అన్వయించుచున్నది కనుక అజహత్స్వార్థా లక్షణ.

లక్ష్యార్థ మన్వయించు దానితో శక్యార్థమున కన్వయము లేకపోవుటయే జహత్స్వార్థాయనబడును. గాం వాహీకం పాఠయ (గోవు యగు వాహీకుని చదివింపుము) అను వాక్యమున గోపదమునకు గోసదృశమందు లక్షణ. లక్ష్యార్థమగు గోసదృశవాహీక పదార్థము పాఠన క్రియతో అన్వయించినను శక్యార్థమగు గో పదార్థమునకు పాఠన క్రియతో అన్వయము లేకపోవుటచే జహత్స్వార్థా లక్షణ అయినది.

**మూలము :–** సా చ లక్షణా తాత్స్థ్యాది నిమిత్తికా ।

తదాహ –

> తాత్స్థ్యాత్తథైవ తాద్ధర్మ్యాత్తత్సామీప్యాత్త థైవ చ ।
> తత్సాహచర్యాత్తాదర్థ్యాజ్ జ్ఞేయా వై లక్షణా బుధైః ॥

ఇతి । తాత్స్థ్యాత్ మంచా హసన్తి, గ్రామః పలాయితః । తాద్ధర్మ్యాత్ సింహో మాణవకః, గౌర్వాహీకః । తత్సామీప్యాద్ గంగాయాం ఘోషః । తత్సాహచర్యాద్ యష్టీః ప్రవేశయ । తాదర్థ్యాదింద్రార్థా స్థూణా ఇంద్రః ।

**వ్యాఖ్యానము :-** లక్షణానిమిత్తములను నిరూపించుచున్నాడు సా చేతి.

తాస్థ్యము, తాద్ధర్మ్యము, తత్సామీప్యము, తత్సాహచర్యము, తాదర్థ్యము అనునవి నిమిత్తములుగా కలది లక్షణావృత్తి. వీని వలన అతస్మిన్ తద్బుద్ధి కలుగును.

(1) **తాస్థ్యము** :- తస్మిన్ తిష్ఠతీతి తస్థః, తస్య భావః తాస్థ్యమ్. దాని యందుండుట. మంచాః హసన్తి అను స్థలమున అచేతనములగు మంచములకు హసనక్రియ సంభవింపదు గావున బాధితమై తాస్థ్యమను నిమిత్తముచే మంచపదముచే మంచస్థములగు పురుషులు లక్షితమగుచున్నారు. అట్లే గ్రామః పలాయితః అను వాక్యమున అచేతనమగు గ్రామమునకు పలాయనము సంభవింపకపోవుటచే బాధితమై గ్రామశబ్దముచే గ్రామస్థులగు పురుషులు లక్షణచే బోధింపబడుచున్నారు.

(2) **తాద్ధర్మ్యము** :- తస్య = శక్యస్య ధర్మాః (తుల్యధర్మాః) యస్యసః తద్ధర్మః, తస్య భావః తాద్ధర్మ్యమ్. శక్యార్థమందు కల ధర్మములతో తుల్యములగు ధర్మములు. కలిగియుండుట. ఉదా :- సింహో మాణవకః అను స్థలమున శక్యార్థము సింహము. దాని యందు గల శూరత్వాది ధర్మములతో సమానమగు ధర్మములు మాణవకుని యందుండుటచే తాద్ధర్మ్యమను నిమిత్తముచే సింహ శబ్దమునకు తత్సదృశమందు లక్షణ.

(3) **తత్సామీప్యము** :- తస్య = శక్యార్థస్య సామీప్యమ్. శక్యార్థమునకు సమీపమందుండుట. గంగాయాం ఘోషః అను స్థలమున గంగాశబ్దమునకు శక్యార్థము ప్రవాహము. దానికి సమీపమందున్న తటము గంగాపదముచే లక్షితమగుచున్నది.

(4) **తత్సాహచర్యము** :- తేన సాహచర్యం తత్సాహచర్యమ్। శక్యార్థముతో కూడియుండుట. యష్టీః ప్రవేశయ అను స్థలమున అచేతనములగు

యష్టులకు ప్రవేశన క్రియాన్వయము బాధితమగుటచే సాహచర్యమను నిమిత్తముచే యష్టిపదముచే యష్టిధారులగు పురుషులు లక్షితమగుచున్నారు.

(5) తాదర్థ్యము :- తస్మై ఇదం తదర్థం, తస్య భావః తాదర్థ్యమ్. శక్యార్థము కొఱకగుట. ఇంద్రుని కొఱకైన యజ్ఞీయస్తంభ విశేషము ఇంద్రుడని వ్యవహరింపబడుచున్నది. 'స్థూణా ఇంద్రః' అన వాక్యమున స్థూణా= యజ్ఞీయస్తంభము ఇంద్రుడు అని రెండిటికి అభేదాన్వయము బాధితమగుటచే తాదర్థ్యమను నిమిత్తముచే ఇంద్రోద్దేశ్యక యాగీయ పశుబంధనమునకు ఉపకారకమగుట వలన ఇంద్ర శబ్దముచే లక్షణావృత్తిచే ఇంద్రోప కారకత్వము లక్షితమగుచున్నది. ఇంద్రోపకారికా స్థూణా అని బోధ కలుగును.

మూలము :- అన్వయాద్యనుపపత్తి ప్రతిసంధానఞ్చ లక్షణాబీజమ్। వస్తుతస్తు తాత్పర్యానుపపత్తి ప్రతిసంధాన మేవ తద్బీజమ్। అన్యథా గంగాయాం ఘోష ఇత్యాదౌ ఘోషాదిపదే ఏవ మకరాదిలక్షణాపత్తిః తావతాప్యన్వయానుపపత్తి పరిహారాత్। గంగాయాం పాపీ గచ్ఛతీత్యాదౌ గంగాపదస్య నరకే లక్షణాపత్తేశ్చ। అస్మాకం తు భూతపూర్వపాపావచ్ఛిన్న లక్షకత్వే తాత్పర్యాన్న దోషః। 'నక్షత్రం దృష్ట్వా వాచం విసృజేత్' ఇత్యత్రాన్వయ సంభవేఽపి తాత్పర్యానుపపత్త్యైవ లక్షణాస్వీకారాత్। ఏకానుగమ స్వీకారేణ నిర్వాహేఽనేకానుగమస్వీకారే గౌరవాచ్చ। విశిష్టార్థబోధక శబ్దస్య పదార్థైకదేశే లక్షణాయాం జహదజహల్లక్షణేతి వ్యవహరంతి వృద్ధాః। వాక్యార్థే కించిదంశత్యాగః కించి దంశపరిగ్రహశ్చ। అత్ర గ్రామైకదేశే పటైకదేశే చ దగ్ధే గ్రామో దగ్ధః, పటో దగ్ధ ఇతి వ్యవహారః। 'తత్త్వమసి' ఇత్యత్ర సర్వజ్ఞత్వాల్పజ్ఞత్వయోః త్యాగః శుద్ధచైతన్యయోరభేదాన్వయః।

వ్యాఖ్యానము :- లక్షణా నిమిత్తములను నిరూపించి, తద్బీజమునుపపాదన

చేయుచున్నాడు. పదార్థముల పరస్పరాన్వయమునకనుపపత్తి లక్షణాబీజము. గంగాయాం ఘోషః మున్నగునవి ఉదాహరణములు. వస్తుతః తాత్పర్యానుపపత్తియే లక్షణాబీజమని చెప్పవలెను. అట్లు కాకపోయిన గంగాయాం ఘోషః అను స్థలమున ఘోష పదమునకు మకరాదులయందు లక్షణ నంగీకరించి గంగయందు మొసళ్ళు మున్నగునవి కలవని అర్థము చెప్పిన అన్వయానుపపత్తి పరిహృతమగు చుండగా గంగా శబ్దమునకు తటమందు లక్షణ చెప్పవలసిన అవసరము లేక పోవుటచే వక్తకు అభిమతమగు శైత్య పావనత్వాది ప్రతీతి సిద్ధింపకపోవును. గంగాయాం పాపీ గచ్ఛతి అను వాక్యమున పాపాత్ముడగు పురుషునికి గంగాధికరణక గమనమందన్వయము బాధితమగుటచే గంగాపదమునకు నరకమందు లక్షణ చెప్పవలసివచ్చును. తాత్పర్యానుపపత్తిని లక్షణాబీజముగ నంగీకరించిన 'పాపీ' పదమునకు పూర్వజన్మమున చేయబడిన పాపములు గల పురుషుని యందు లక్షణ గాని గంగాపదమునకు నరకమందు లక్షణ లేదు. వక్తకు అట్టి తాత్పర్యము లేకపోవుటయే దీనికి కారణము.

మౌనవ్రతప్రకరణమందు పఠింపబడిన 'నక్షత్రం దృష్ట్వా వాచం విసృజేత్' (నక్షత్రమును చూచి వాక్కును త్యజించవలెను) అను వాక్యమున అన్వయానుపపత్తి లేకపోయినప్పటికి తాత్పర్యానుపపత్తిచే నక్షత్ర పదమునకు నక్షత్ర దర్శన యోగ్య కాల విశేషమగు రాత్రి యందు లక్షణ. కనుక రాత్రియందు మౌనము వహింప వలెనని బోధ కలుగును. సర్వత్ర తాత్పర్యానుపపత్తియే లక్షణాబీజమని యంగీకరించిన సరిపడుచుండగా తాత్పర్య - అన్వయానుపపత్తులు రెండిటిని లక్షణాబీజములుగ చెప్పుట గౌరవగ్రస్తము.

విశిష్టార్థ బోధకమగు పదమునకు పదార్థైకదేశమందు లక్షణ చెప్పుట జహదజహల్లక్షణయని వృద్ధవ్యవహారము. ఇచ్చట విశేషణాంశము

విడువబడి కేవల విశేష్యాంశము గ్రహింపబడును. 'తత్త్వమసి' ఇత్యాది వాక్యార్థ నిర్వాహము కొఱకు వేదాంతులచే జహదజహల్లక్షణ యంగీకరింపబడినది. గ్రామైక దేశము లేక వస్త్రైక దేశము దగ్ధమయినపుడు గృహ సముదాయమగు గ్రామోదగ్ధః, తంతుసముదాయమగు పటము దగ్ధము (పటో దగ్ధః) మున్నగు వ్యవహారములు అనగా అవయవము దగ్ధమయినను సముదాయ వ్యవహారములు లక్షణా వృత్తి చేతనేనని యెఱుంగునది. గృహసముదాయము గ్రామము. ఇచ్చట విశేషణాంశమగు గృహరూపార్థము విడువబడి సముదాయ రూపమగు గ్రామము గ్రహింపబడుచున్నది. తత్త్వమసి అను వేదాన్త వాక్యమున తత్పదవాచ్యమగు సర్వజ్ఞత్వ విశిష్ట చైతన్యమునకు, త్వం పదవాచ్యమగు అల్పజ్ఞత్వ విశిష్ట చైతన్యమునకు అభేదము బాధితమగుటచే విశేషణాంశములగు సర్వజ్ఞత్వాల్పజ్ఞత్వములు త్యజింపబడి కేవల శుద్ధ చైతన్యములకు అభేదబోధ కలుగుచున్నది. ఇచ్చట విశేషణాంశము త్యజింపబడి విశేష్యాంశము గ్రహింపబడుటచే 'జహదజహల్లక్షణ' యయినది.

మూలము :- స్వబోధ్యసంబంధో లక్షణేతి కేచిత్- 'గభీరాయాం నద్యాం ఘోష' ఇత్యాద్యనురోధాత్। తథాహి న తావద్ గభీర పదం తీరలక్షకం, నద్యామిత్యనన్వయాపత్తేః। న హి తీరం నదీ। అత ఏవ న నదీపదేఽపి। గభీర పదార్థానన్వయాత్। న హి తీరం గభీరమ్। న చ ప్రత్యేకం పదద్వయే సా, విశిష్టనదీ బోధానాపత్తేః। తస్మాత్ సముదాయబోధ్య గభీరత్వ విశిష్ట నదీపదార్థః, తత్సంబంధో లక్షణేతి।

ద్విరేఫపదస్య స్వలక్ష్యభ్రమరశబ్ద వాచ్యార్థే లక్షణాయాం లక్షితలక్షణేతి వ్యవహారః। స్వబోధ్యపదవాచ్యత్వం సంబంధః।

వ్యాఖ్యానము :- 'శక్తం పదమ్' అను నైయాయికమతమనుసరించి పదమందే శక్తిగాని వాక్యమందు శక్తి లేకపోవుటచే 'శక్యసంబంధో లక్షణా'

అను లక్షణము వాక్యమందు సంగతము కాకపోవుటచే 'గభీరాయాం నద్యాం ఘోషః' అను వాక్యము లాక్షణికము కాకపోవలసివచ్చును. కనుక మీమాంసకులు 'స్వబోధ్య సంబంధో లక్షణా' అని చెప్పిరి. స్వం = పదము లేక వాక్యము, తద్బోధ్యము పదార్థము లేక వాక్యార్థము, 'గభీరాయాం నద్యాం ఘోషః' అను వాక్యమున 'గభీరాయాం నద్యామ్' అను ఖండ వాక్యమునకు గంభీర నదీ తీరమందు లక్షణ కొఱకై ప్రకృత లక్షణ యంగీకరింపబడినది. అట్లు కోకున్న వాక్యమందు శక్తి లేకపోవుటచే శక్య సంబంధ రూపలక్షణ ప్రకృతమున సంభవించకపోవును. గభీర పదమునకు తటమందు లక్షణ యంగీకరించిన సమానాధికరణములగు నామార్థములకే అభేదాన్వయము కనుక భిన్న విభక్త్యంతములగుటచే 'నద్యామ్' అను సప్తమ్యంత పద వాచ్యమగు దానితో తటమున కభేదాన్వయము బాధితముగాన గభీర పదము లక్షకమనుట యుక్తము గాదు. గభీరాభిన్నము తటమను బోధ కూడ బాధితమగుటచే నదీ పదమునకు తటమందు లక్షణ చెప్పలేము. గాంభీర్యము నదికి గాని తీరమునకు కాదు గదా. గభీర నదీ పదములు రెండిటికి ప్రత్యేకము తీరమందు లక్షణయనుట యుక్తము గాదు. అట్లైన గంభీరాభిన్నమగు నది యొక్క తీరమున ఘోషమను విశిష్ట బోధ కలుగక పోవలసివచ్చును. రెండు పదములకుతీరమందే లక్షణ చెప్పిన 'ఘటో ఘటః' అనిన శాబ్దబోధ కలుగనట్లు 'తీరం తీరమ్' అనిన బోధ కలుగదు. నదీపదమునకు గభీర నదీ తీరమందు లక్షణ, గభీర పదము తాత్పర్య గ్రాహకమని చెప్పుట కూడా సరిగాదు. గభీర పదమే తాత్పర్య గ్రాహక మెందుకు కావలయును ? నదీ పద మెందుకు కాకూడదను సంశయము కలుగగ గభీర పదమే తాత్పర్య గ్రాహకమని నిర్ణయించుటలో వినిగమన (ఏకతర పక్షసాధకమగు యుక్తి) లేకపోవుటచే ప్రకృతపక్షము గూడ సరిపడదు. కనుక మీమాంసకులు వాక్యమందు కూడా లక్షణ

యంగీకరించిరి. వీరి మతమున శక్య సంబంధము లక్షణ గాక, స్వబోధ్య సంబంధము లేక జ్ఞాప్య సంబంధ రూపము లక్షణ యని సిద్ధించినది. స్వం = 'గభీరాయాం నద్యామ్' అను ఖండ వాక్యము. తద్బోధ్యము 'గభీరత్వ విశిష్టనది' యను వాక్యార్థము. తత్సంబంధము = సంయోగము తీరమునకు గలదు. కావున గభీరాభిన్ననదీ తీరమందు వాక్యమునకు లక్షణ. గభీరాభిన్ననదీ తీరమందు ఘోషమని బోధ కలుగును. సముదాయమందు లక్షణ అంగీకరించుట చేతనే 'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా'' మున్నగు అర్థవాద వాక్యములకు ప్రాశస్త్యమందు లక్షణ సిద్ధించుచున్నది. 'వాయవ్యం శ్వేతమాలభేత భూతికామః' అను విధికి 'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా, వాయుభేదః స్వేన భాగధేయేనోపధావతి స ఏవైనం భూతిం గమయతి' (జైమినీయ ప్రథమాధ్యాయ ద్వితీయ పాదము) అనునది అర్థవాద. అర్థస్య= ప్రయోజనస్య వాదః = వచనం విధ్యర్థ ప్రశంసాపరమథవా స్తుతినిందా ఫలక మర్థవాద వాక్యమ్. ఇచ్చట వాయవ్య యాగము ప్రశస్తమను అర్థము లక్షిత మగుచున్నది. ఇది మీమాంసకమతము.

నైయాయికాభిమతమగు లక్షిత లక్షణ స్వరూపమును నిరూపించుచున్నాడు. లక్షితస్య లక్షణా లక్షితలక్షణా. లక్షణచే లక్షితమగుదానికి లక్షణ చెప్పుట లక్షిత లక్షణ. ద్విరేఫ పదమునకు భ్రమరమందు లక్షిత లక్షణ. స్వం = ద్విరేఫపదము, తద్బోధ్యము = రేఫద్వయ విశిష్టమగు భ్రమరశబ్దము. తద్వాచ్యము తుమ్మెద. స్వబోధ్యపదవాచ్యత్వ సంబంధముచే ద్విరేఫ శబ్దమునకు భ్రమరమందు లక్షణ.

వస్తుతః రథంతరాది పదముల వలె ద్విరేఫ పదము రూఢి శక్తిచే భ్రమరమును చెప్పును. రథంతర పదముచే 'రథేన తరతి' అను అవయవార్థము భాసించక రూఢిశక్తిచే సామవేదవిశేషము ప్రతీతమగునట్లు

ద్విరేఫ పదము రూఢిశక్తిచే భ్రమరబోధకము గావున లక్షణ చెప్పవలసిన యవసరము లేదని వైయాకరణ మతము.

మూలము :- ప్రకారాంతరేణ సా పునర్లక్షణా ద్వివిధా । తథాహి –

"ప్రయోజనవతీ రూఢా లక్షణా ద్వివిధామతా" । ఇతి । అసతి ప్రయోజనే శక్య సంబంధో నిరూఢ లక్షణా । త్వచా జ్ఞాతమిత్యాదౌ యథా త్వచస్త్వగింద్రియే । ఇయం తు శక్త్యపర పర్యాయైవేతి బోధ్యమ్ । గంగాయాం ఘోష ఇత్యత్ర తీరే గఙ్గాగతశైత్య పావనత్వాది ప్రతీతిః ప్రయోజనమ్ । గౌర్వాహీక ఇత్యత్ర సాదృశ్యం లక్ష్యతావచ్ఛేదకం గవాభేదప్రత్యయః ప్రయోజనమ్ । కుంతాః ప్రవిశంతీతి భీతి పలాయమానవాక్యే కుంతవిశిష్ట పురుషే కుంతగతతైక్ష్ణ్య ప్రతీతిః ప్రయోజనమిత్యాహుః ।

వ్యాఖ్యానము :- ప్రయోజనవతీ, రూఢా యని ప్రకారాంతరముచే లక్షణ రెండు విధములు. ప్రయోజనము లేకనే శక్యసంబంధముచే అర్థాంతరమును చెప్పుటలో సమర్థమగు లక్షణ నిరూఢ లక్షణయనబడును. కర్మణి కుశలః అను స్థలమున కుశల పదమునకు నేర్పరి యందు నిరూఢ లక్షణ. త్వచా జ్ఞాతమ్ అను స్థలమున 'త్వక్' అను పదముచే నిరూఢ లక్షణచే త్వగింద్రియము గ్రాహ్యము. వస్తుతః నిరూఢ లక్షణ శక్తిలోనే అంతర్భవించును. గంగాయాం ఘోషః అనునది ప్రయోజనవతీలక్షణ-కుదాహరణము. గంగా పదమునకు తీరమందు లక్షణ చెప్పుటచే ప్రవాహగత శైత్య పావనత్వాదాలు లక్ష్యార్థమగు తీరమందు ప్రతీతమగుట ప్రయోజనము. గౌర్వాహీకః అనువాక్యమున గోశబ్దమునకు గోసదృశమందు లక్షణ. గోసాదృశ్యరూప ధర్మము లక్ష్యతావచ్ఛేదకము. గోవుతో వాహీకునికి అభేద జ్ఞానము ప్రయోజనము. గోభిన్నుడు వాహీకుడను బాధనిశ్చయము గవాభిన్నుడు వాహీకుడను అభేద బుద్ధికి బాధకమగుటచే గవాభేదము వాహీకుని యందు ఎట్లు భాసించునని శంక కలుగును.

**సమాధానము :-** ప్రయోజనవతీ లక్షణలో ప్రయోజనము వ్యంజనా వ్యాపారముచే వ్యక్తమగును. వ్యంజనావృత్తి జన్య జ్ఞానము గూర్చి బాధ నిశ్చయము ప్రతిబంధకము గాదు. వాహీకునియందు గవాభేదజ్ఞానము ఆహార్యము. బాధకాలీన ఇచ్ఛా జన్య జ్ఞానము ఆహార్యము. 'గోభేదవాన్ వాహీకః గవాభేదవాన్' అను జ్ఞానము బాధజ్ఞాన సమకాలికేచ్ఛాజన్యము. కనుక ఆహార్యమనబడును. కుంతధారులగు పురుషులను చూచి భయముతో పారిపోవు వ్యక్తి ప్రయోగించిన కుంతాః ప్రవిశన్తి అనువాక్యమున కుంతగతతైక్ష్ణ్యము కుంతధారులగు పురుషుల యందు ప్రతీతమగుట ప్రయోజనము.

**మూలము :- తన్న । సతి తాత్పర్యే 'సర్వే సర్వార్థవాచకా' ఇతి భాష్యాల్లక్షణాయా అభావాత్। వృత్తిద్వయావచ్ఛేదక ద్వయకల్పనే గౌరవాత్। జఘన్యవృత్తి కల్పనాయా అన్యాయ్యత్వాచ్చ । కథం తర్హి గంగాది పదాత్తీర ప్రత్యయః ? భ్రాంతోఽసి, 'సతి తాత్పర్యే సర్వే సర్వార్థ వాచకా' ఇతి భాష్యమేవ గృహాణ। తథాహి శక్తిః ద్వివిధా ప్రసిద్ధాఽప్రసిద్ధా చ। ఆమందబుద్ధి వేద్యాత్వం ప్రసిద్ధాత్వమ్ । సహృదయ హృదయమాత్ర వేద్యాత్వమప్రసిద్ధాత్వమ్। తత్ర గంగాది పదానాం ప్రవాహాదౌ ప్రసిద్ధా శక్తిః, తీరాదౌ చాప్రసిద్ధేతి కిమనుపపన్నమ్।**

**నను 'సర్వే సర్వార్థ వాచకా' ఇతి చేద్ బ్రూషే తర్హి ఘటపదాత్ పట ప్రత్యయః కిన్నస్యాదితి చేన్న । 'సతి తాత్పర్యే' ఇత్యుక్తత్వాత్ తాత్పర్యాభావా దితి గృహాణ। తాత్పర్యం చాత్ర ఐశ్వరం దేవతా మహర్షిలోక వృద్ధ పరంపరాతోఽస్మదాదిభిర్లబ్ధమితి సర్వం సురూఢమ్।**

ఇతి లక్షణానిరూపణమ్

**వ్యాఖ్యానము :-** నైయాయికాదులు చెప్పిన లక్షణావృత్తిని

నిరాకరించుచున్నాడు - తన్నేతి. 'సర్వ శబ్దములు తాత్పర్యానుసారము సర్వార్థములను బోధించు' నను భాష్యముచే శక్తి చేతనే వాచ్యార్థ లక్ష్యార్థ బోధ కలుగుచుండగ లక్షణావృత్తిని అంగీకరించ వలసిన పనిలేదు. గంగాపదము ప్రవాహమందు వలె తీరమందు కూడ శక్తము కనుక అతిరిక్తవృత్తి స్వీకార ప్రయుక్తగౌరవము లేదు. 'సర్వే సర్వార్థవాచకాః' అని యంగీకరించుట వలన గంగాపదముచే తీర రూపార్థ బోధ కలిగినట్లు ఘటాద్యర్థ బోధ యేల కలుగదను శంకకు, తాత్పర్యము శక్తి నియామకమగుటచే తాదృశతాత్పర్యము లేకపోవుట చే ఘటాద్యర్థ బోధ కలుగదని సమాధానము.

లక్షణను స్వీకరించిన లక్ష్యార్థ బోధను ( శాబ్దబోధ) గూర్చి శక్తి జన్యోపస్థితి, లక్షణాజన్యోపస్థితి రెండిటికి కారణత్వము కల్పించవలెనని గౌరవము. శక్తిచే లక్షణను గతార్థము చేయు వైయాకరణమతమున శక్తి జన్యోపస్థితికే కారణత్వము గావున లాఘవము. మరియు శక్యా అర్థబోధానంతరము ప్రవర్తించెడి శక్య సంబంధ రూపమగు జఘన్య వృత్తినంగీకరించుట సహ్యము కాదు. కనుక లాక్షణిక స్థలములలో అంతట 'సతి తాత్పర్యే సర్వే సర్వార్థవాచకాః' అను భాష్యముచే శక్తిచేతనే లక్ష్యార్థములగు తీరాదుల బోధ కలుగును.

ప్రసిద్ధము, అప్రసిద్ధమని శక్తి రెండు విధములు. సాధారణ జనము సయితము తెలుసుకోదగినది ప్రసిద్ధ శక్తి. సహృదయ హృదయమాత్ర వేద్యము అప్రసిద్ధ శక్తి. గంగాది పదములకు ప్రవాహాదులయందు ప్రసిద్ధ శక్తి. తీరాదులయందు అప్రసిద్ధశక్తి. 'సర్వే సర్వార్థ వాచకాః' అని చెప్పుట వలన ఘటపద జ్ఞానము వలన పటాది రూపార్థ బోధ యేల కలుగదని ప్రశ్నింప 'సతి తాత్పర్యే' అని చెప్పుట వలన ప్రకృతమున అట్టి తాత్పర్యము లేకపోవుట వలన అన్యార్థ బోధ కలుగదని సమాధానము. ఈశ్వర

సంబంధమగు, బోధ నిర్ణాయకమగు తాత్పర్యము దేవతా మహర్షి లోక వృద్ధ పరంపరవలన మనకు లభించినది. కనుక శక్తిచేతనే ఇష్టసిద్ధి కలుగు చుండగా అతిరిక్త వృత్తిగా లక్షణను స్వీకరించవలసిన యవసరము లేదు.

**విశేషము :** – లక్షణావృత్తిని గూర్చి పలు దార్శనిక మతములు మంజూషలో చూపబడినవి.

**నవ్యవైయాకరణమతము :** –

సమస్తశబ్దములు సర్వార్థములను బోధించునని యంగీకరించుటచే శక్తి జ్ఞానమువలన లక్ష్యార్థ బోధ కలుగుచుండగ అతిరిక్తముగ లక్షణావృత్తిని స్వీకరించుట నిష్ఫలమని శంక కలుగును. కాని సర్వము సర్వార్థ వాచకములని యోగులననుసరించి చెప్పబడినది. అస్మదాదులకు అది వర్తించదు. కావున లక్షణావృత్తి స్వీకారమునకు నైష్ఫల్యము లేదు. అన్వయానుపపత్తి లేక తాత్పర్యానుపపత్తి జ్ఞానపూర్వకముగ శక్య సంబంధ జ్ఞానము (స్మరణము)చే ఉద్బుద్ధమగు శక్తి విషయక సంస్కారముచే అర్థాంతర బోధకలుగుటయే లక్షణగ (లక్షణావృత్తిచే లక్ష్యార్థబోధకలుగుటగ) వ్యవహరింపబడుచున్నది. అనగా అప్రసిద్ధ శక్తియే లక్షణ. కనుక లక్షణను అతిరిక్తవృత్తిగ నంగీకరించవలసిన యవసరము లేదని నాగేశుని యాశయము. 'గంగాయాం ఘోషః' అను వాక్యమున గంగా పదముచే ప్రసిద్ధశక్తిచే ప్రవాహరూపార్థ ముపస్థితమగును. పిమ్మట తాత్పర్యానుపపత్తి జ్ఞానముచే గంగాపదముతో సాక్షాత్ సంబంధముకలది బాధితమగుటచే 'ఏకసంబంధిజ్ఞానము అపరసంబంధి స్మారకము' అను న్యాయముచే సంబంధి సంబంధియగు నర్థము గూడ గ్రహింపబడును, అనగా ప్రసిద్ధమగు శక్యార్థసంబంధ జ్ఞానముచే ఉద్బుద్ధమగు శక్తి సంస్కారముచే తటరూపార్థబోధకలుగును. అట్టి ఉద్బుద్ధశక్తి సంస్కారము లక్షణయని వైయాకరణసిద్ధాన్తలఘుమంజూషలో నాగేశభట్టు పేర్కొనెను.

తీర రూపార్థముతో సామీప్య రూపసంబంధముచే సంబంధియగు ప్రవాహరూపార్థ బోధకము గంగాపదము అనునది లక్ష్యార్థ ప్రకారక గంగాపద విశేష్యక సంబంధ జ్ఞానము. లేక గంగాపదశక్యమగు ప్రవాహాముతో సంబంధము కలది తీరము అనునది లక్ష్యార్థ విశేష్యక గంగాపదప్రకారక సంబంధ జ్ఞానము. ఈ విధముగ లక్ష్యార్థమున శక్యార్థము యొక్క సంబంధజ్ఞానముచే లక్ష్యార్థమందు గంగాపదముయొక్క శక్తి సంస్కారము ఉద్బుద్ధవగును; ఇదియే లక్షణగవ్యవహరింపబడుచున్నది. సంబంధజ్ఞానవముచే ఉద్బుద్ధమగు శక్తి సంస్కారముచే లక్ష్యార్థము స్మృతమగును కావున లక్ష్యార్థముకూడా శక్యమేయని తాత్పర్యము.

గంగాయాం ఘోషః మున్నగు లాక్షణిక స్థలములలో శక్యార్థము-పస్థితవై, తదర్థవిషయక బోధ కలుగును. పిమ్మట శక్యార్థము వక్తృతాత్పర్యవిషయము కాకపోవుటచే తదర్థబోధయందు ప్రామాణ్యజ్ఞానము లేకపోవుటవలన శక్యార్థముకంటె భిన్నమగు వక్తృతాత్పర్యవిషయమగు లాక్షణిక అర్థ బోధ కలుగును. శక్యార్థము యొక్క ఉపస్థితి మాత్రముచే దానియందు తాత్పర్య విషయత్వాభావజ్ఞానము కలుగదు. శక్యార్థముపస్థితమై, అది పదార్థాంతరముతో సంబద్ధమై అన్వయ బోధ కల్గిన పిమ్మట దానియందు ఇది తాత్పర్య విషయముగాదను తాత్పర్య విషయత్వాభావజ్ఞానము కలుగును. ప్రసిద్ధములగు అనేకార్థములను బోధించు శబ్దము నానార్థకమనబడును కావున గంగాపదముచే తీరరూపార్థము కూడా బోధింపబడుచున్నను, అది యప్రసిద్ధశక్తి మూలకమగుటచే నానార్థకత్వాపత్తి లేదు.

'శక్యసంబంధము లక్షణ' యని నైయాయిక మతము. ఈ మతమున తీరముతో శక్య ( ప్రవాహ ) సంబంధము సంయోగము, తీరత్వముతో శక్యసంబంధము సంయుక్తవృత్తిత్వము గావున ఉభయసంబంధరూపము

లక్షణయని చెప్పవలెను. ( ఉద్బుద్ధ శక్తి సంస్కారము లక్షణయనుమతమున గూడ తీర-తీరత్వ ఉభయవిషయక సంస్కారమును గ్రహించవలెను. ) కనుక విశేషణముగ లక్ష్యతావచ్ఛేదకభాన మంగీకరించుటచే లక్ష్యమగు తీరమందువలె, లక్ష్యతావచ్ఛేదకమగు తీరత్వ ధర్మమందు గూడ లక్షణ గలదు. లేదా శక్య సంబంధమగు సంయోగమును తీరత్వరూప ధర్మమందారోపించి కేవల సంయోగ సంబంధరూపమును లక్షణగ నంగీకరించవలెను. అనగా తీరత్వవిశిష్ట తీరముతో ప్రవాహ సంబంధము చెప్పవలెను. విశేషణమందు ప్రవాహసంబంధము లేనిచో విశిష్టమందు తత్సంబంధ జ్ఞానమెట్లుకలుగును? కనుక విశేషణమందుకూడ సంబంధమారోపితము.

ప్రవాహమునకు తీర-తీరత్వములతో అనారోపితమగు ఏక సంబంధము సంభవము కాదు గనుక లక్ష్యతావచ్ఛేదకమందు లక్షణ స్వీకరించుట యుక్తముగాదని దీధితికారమతము. లక్షణ లేకుండగ అలక్ష్యమగు తీరత్వముకూడ శాబ్దబోధయందు భాసించును. విశేష్యగత సంబంధ జ్ఞానముచే లక్ష్యతావచ్ఛేదకప్రకారక లక్ష్యవిశేష్యక శాబ్దబోధ కలుగును.

శక్యసంబంధ జ్ఞాన జన్యమగు లక్ష్యార్థోపస్థితి (స్మృతి) లక్షణ యని ఆలంకారికాదిమతము, వీరిమతమున స్వవిషయ సంబంధి వాచకత్వేన అనగా స్వమ్ = ఉపస్థితి, తద్విషయము = తీరము, తత్సంబంధి = ప్రవాహము తద్వాచకము గంగా పదమగుటచే లక్షణ పదనిష్ఠము.

శక్యసంబంధాది రూపమగు లక్షణ గౌణీ, శుద్ధా భేదముచే రెండువిధములు. శక్యార్థ నిరూపిత సాదృశ్యాధికరణత్వ సంబంధముచే శక్యార్థసంబంధియగు అర్థము యొక్క బోధను కలుగజేయునది గౌణీలక్షణ. స్వ నిరూపిత సాదృశ్య సంబంధము కంటె భిన్న సంబంధముచే శక్య

సంబంధ్యర్థ ప్రతిపాదకము శుద్ధా లక్షణ యనబడును. ప్రకారాంతరముచే జహత్స్వార్థా, అజహత్స్వార్థా యని లక్షణ రెండువిధములు. (వ్యాఖ్యానమున వివరింపబడినది) శుద్ధామాత్రము జహత్స్వార్థా, అజహత్స్వార్థాయని రెండు విధములని కుంజికా టీకాకారులు పేర్కొనగ, 'ద్వివిధాపి సా ప్రత్యేకం ద్వివిధా' అని కళా టీకాకారులు వ్యాఖ్యానము చేసిరి.

స్వ జ్ఞాప్య సంబంధము లక్షణయని మీమాంసకమతము. అనగా వాక్య జ్ఞాప్య వాక్యార్థముతో సంబంధ జ్ఞానమువలన ఉద్బుద్ధమగు శక్తి విషయక సంస్కారమువలన బోధ కలుగుట లక్షణగ వ్యవహరింపబడుచున్నది. 'గభీరాయాం నద్యాం ఘోషః' అనుస్థలమున గభీరాయాం నద్యామ్' అను ఖండ వాక్యమునకు గంభీర నదీ తీరమందు లక్షణ. ఇచ్చట గభీర పదమునకు గాని, నదీ పదమునకు గాని తీరమందు లక్షణ చెప్పుట యుపపన్నము కాదు గనుక శక్య సంబంధము లక్షణ గాక జ్ఞాప్య సంబంధము లక్షణగ యంగీకరించబడినది. 'గభీరాయాం నద్యామ్' అను ఖండవాక్య జ్ఞాప్యమగు అర్థము గభీరాభిన్ననది. తత్సంబంధముచే తీరము లేక గభీరాభిన్న నదీ తీరము లక్షితమగుచున్నది.

నవ్యవైయాకరణమతమున భర్తృహర్యాది సంమతి : – 'గంగాయాం ఘోషః' అను స్థలమున వాచ్యత్వేన ప్రసిద్ధము ప్రవాహము, తద్భిన్నమగు తీరము, ఆరోపితశక్యతావచ్ఛేదకరూపముగ = ప్రవాహత్వ ధర్మముతో కూడి శక్తి చేతనే తెలియబడుట లక్షణ యనబడును. అనగా శక్యతావచ్ఛేదకమగు ప్రవాహత్వము తీరమందారోపించబడి అప్రసిద్ధశక్తిచే ప్రవాహత్వేన రూపేణ తీరము భాసించుట లక్షణయని తాత్పర్యము. దేనియందు శక్యార్థసంబంధము జ్ఞాతమగునో అచ్చట శక్యతావచ్ఛేదక ధర్మమారోపించబడును గావున శక్యతావచ్ఛేదకారోపము సంబంధ జ్ఞానమునకు ఫలము, అట్టిఫలమగు ఆరోపము లక్షణ. 'ఛత్రిణో యాన్తి' అను స్థలమున

సాహచర్యసంబంధముచే ఛత్రిభిన్నుయందు శక్యతావచ్ఛేదకమగు ఛత్రిత్వ ధర్మ మారోపించబడుచున్నది.

శక్యతావచ్ఛేదకారోపరూపము లక్షణయనుటలో 'పుంయోగాదాఖ్యాయామ్ (4-1-48) అను సూత్రభాష్యము ప్రమాణముగ చూపబడినది. పుంయోగము కారణముగ ప్రవృత్తి నిమిత్తారోపముచే స్త్రీత్వమందుండు పుంబోధకమేయగు శబ్దముకంటె జీష్ప్రత్యయము విధింపబడుచున్నది. పుంస్త్వమందు ప్రసిద్ధమయిన శబ్దము స్త్రీత్వమందుండుటలో ప్రవృత్తి నిమిత్తారోపము కారణము. ప్రవృత్తినిమిత్తారోపము గూర్చి పుంయోగము కారణము. అకారాంతమగు పుంలింగ గోపశబ్దము ఏసంబంధముచే స్త్రీత్వమందుండునని ప్రశ్న. 'గోపస్య ఇయమ్' అని ('తస్యేదమ్') అభిసంబంధముచే గోపశబ్దము గోపసంబంధి స్త్రీత్వమందుండును (గోపశబ్దమునకు 'గోపాలుని స్త్రీ' అను నర్థమున లక్షణ) ఇట్లు తస్యేదమని భేద సంబంధముచే పుంవాచకము స్త్రీత్వమందుండునని స్వీకరించిన 'తస్యేదమ్' అను సూత్రముచే తద్ధిత ప్రత్యయము పుట్టి గోపీ అను శబ్దమునకు లేక తద్ధిత ప్రత్యయము రాని పక్షమునగోపస్య ఇయమ్' అను వాక్యమునకు సాధుత్వము చెప్పవలయును. గోపీ' అను ప్రయోగము సాధువు కావలసి వచ్చునను శంకను మనస్సుయందుంచుకుని భాష్యకారులు 'తస్యేదమ్' అని భేద సంబంధమే పుంశబ్దము స్త్రీత్వమందుండుటలో నియామకము కాదు. 'తస్యేదమ్' అని భేద సంబంధము కలుగగ (దాంపత్యసంబంధము) తన్మూలకమగు 'సోఽయమ్' అని అభేద సంబంధము కూడ నియామకమే. లక్షణచే గోపశబ్దము తత్సంబంధి స్త్రీబోధకమని తాత్పర్యము. లక్షణామూలభూత భేదరూప శక్య సంబంధ మూలకమగు 'సోఽయమ్' అని అభిసంబంధముచే తద్ధర్మము లేనిచోట తద్బుద్ధి యెట్లు కలుగును భిన్నములకు అభేదము సంభవించదు అనుప్రశ్నకు 'చతుర్భిః ప్రకారైః

అతస్మిన్ సః భవతి' అని భాష్యకారులు సమాధానము చెప్పిరి. తద్ధర్మము లేనిచోట తదృబుద్ధి తాస్థ్యము, తాద్ధర్మ్యము, తత్సామీప్యము, తత్సాహచర్యము అను నాలుగు నిమిత్తములచే కలుగుచున్నది. ఇచ్చట సాహచర్య సంబంధముచే గోప శబ్దము గోపస్త్రీబోధకము. మంచాః హసంతి, సింహో మాణవకః, గంగాయాం ఘోషః, యష్టీః ప్రవేశయ అనునవి క్రమముగ ఉదాహరణములు. ఇచ్చట శక్యతావచ్ఛేదకారోపము అర్థతః సిద్ధము. భాష్యమున కంఠతః ఆరోపము చెప్పకపోయినను కైయటుడు భాష్యకారుల యాశయమును సూచించెను. 'ఆరోప్యతే తాద్రూప్యమ్, నతు ముఖ్యమ్' అని. ఇచ్చట తాద్రూప్యమ్ = శక్యతావచ్ఛేదక ధర్మము ఆరోపించబడుచున్నది. అది ముఖ్యముగాదని తాత్పర్యము. ఆరోపమునకు తాస్థ్యాదులు హేతువులు, సాహచర్యముచే గోపస్త్రీయందు గోపత్వమారోపించబడుచున్నది. శక్యతావచ్ఛేదక ప్రకారక లక్ష్యార్థ బోధ కలుగును. శక్యతావచ్ఛేదక ప్రకారక ప్రతీతి విషేష్య ప్రసిద్ధార్థత్వం ముఖ్యత్వమ్, తాదృశాప్రసిద్ధార్థత్వం గౌణత్వమని భావము.

గంగాయాం ఘోషః అనుస్థలమున తత్సామీప్యరూప హేతువుచే ఆరోపిత గంగాత్వేన ప్రవాహబోధ కలుగును. అది భ్రమాత్మక మయినను తదుత్తర కాలమున వ్యంజనచే ముఖ్య గంగా పదార్థాభేదము ప్రవాహమందు భాసించి ద్వితీయ వ్యంజనచే శైత్యపావనత్వాది ప్రతీతి కలుగును.

ఆరోపరూపము లక్షణయనుటలో న్యాయదర్శన కర్త గౌతమమహర్షి సమ్మతి కలదు. సహచరణ-స్థాన-తాదర్థ్య-వృత్త-మాన-ధారణ-సామీప్య-యోగ-సాధన- ఆధిపత్యకారణములచే క్రమముగ బ్రాహ్మణ-బాల-కట-రాజ-సక్తు-చందన-గంగా-శకట-అన్న-పురుష పదార్థములయందు యష్టిత్వము, మంచత్వము మున్నగు ధర్మములారోపింపబడి యష్టీః ప్రవేశయ, మంచాః క్రోశన్తి మున్నగు వ్యవహారములుపపన్నమగు చున్నవని గౌతమునిచే చెప్పబడినది.

న్యాయవార్తికకారులు (ఉద్యోతకారులు) 'బ్రాహ్మణ సంయుక్తములగు యష్టులయందు సమవేతమగు యష్టిత్వజాతిని సమవాయసంబంధముచే బ్రాహ్మణుని యందారోపించి అతని యందు యష్టిశబ్దము ప్రయోగింపబడుచున్నదని వ్యాఖ్యానము జేసిరి. కనుక శక్యతావచ్ఛేదకారోపము లక్షణయని ఫలితార్థము. 'గౌర్వాహీకః' అను స్థలమున జడత్వాది సాధారణ ధర్మనిమిత్తముచే 'ఆరోపితగోత్వవాన్ వాహీకః' అను బోధకలుగును. ఇది భ్రమాత్మకము. పిమ్మటవ్యంజనా వ్యాపారముచే ముఖ్యగవాభేదము వాహీకునియందు భాసించి అతిజడత్వము ప్రతీతమగును. ఇదియే చమత్కారజనకము.

శక్యతావచ్ఛేద కారోపము లక్షణ యనుటలో భర్తృహరి సమ్మతి కలదు.

**ఏక మాహు రనేకార్థం శబ్దమన్యే పరీక్షకాః।**
**నిమిత్త భేదా దేకస్య సార్వార్థ్యం తస్య భిద్యతే ॥**

మున్నగు కారికలలో పై విషయము నిరూపించబడినది. అన్యే పరీక్షకాః = వైయాకరణులు గౌణ, ముఖ్యార్థబోధకత్వము ఒక్క శబ్దమునకే స్వీకరింతురు. ఒకే శబ్దము నానార్థకమైనను ప్రకరణాది నిమిత్త భేదము వలన ఏక కాలమందు సర్వార్థములను బోధించ లేదు. ప్రసిద్ధార్థమును బోధించిన ముఖ్యమని, అప్రసిద్ధార్థమును బోధించిన గౌణమని వ్యవహారము. గోశబ్దము గోత్వజాతి విశిష్టమందు ప్రసిద్ధము. వాహీకార్థమందప్రసిద్ధము. ఈ విధముగ నొకేశబ్దమునకు ముఖ్యార్థ, గౌణార్థబోధకత్వమంగీకరించిన నానార్థకత్వము ప్రసక్తమగునను శంకకు భర్తృహరి -

**గోత్వానుషంగో వాహీకే నిమిత్తాత్ కైశ్చిదిష్యతే।**
**అర్థమాత్రే విపర్యస్తం శబ్దః స్వార్థే వ్యవస్థితః ॥**

అని సమాధానము చెప్పెను, శబ్దార్థ సంబంధమునకు నిత్యత్వమంగీకరించు

వైయాకరణులు జాడ్యమాంద్యాది గుణనిమిత్తముచే వాహీకార్థమందు గోత్వము నారోపించుచున్నారు. గోశబ్దము ముఖ్యగోత్వమును చెప్పును. వాహీకార్థమందు ఆరోపిత గోత్వముభాసించును. విశేష్యమగు అర్థము భిన్నభిన్నమయినను ప్రవృత్తి నిమిత్తమగు నర్థము శబ్దమున వ్యవస్థితమై యుండును. ప్రవృత్తి నిమిత్తమే శబ్దశక్యమగుటచే శబ్దమేకార్థకమే యగునని తాత్పర్యము. కనుక శక్తి విశేషమే లక్షణ, అతిరిక్తము గాదని సిద్ధించినది. విశేషవిచారము కొఱకు వైయాకరణ సిద్ధాన్త లఘుమంజూషను చూడవలయును.

లక్షణానిరూపణము సమాప్తము

## అథ వ్యంజనానిరూపణమ్

మూలము :- నను వ్యంజనా కః పదార్థః ? ఉచ్యతే-ముఖ్యార్థ బాధ నిరపేక్షబోధ జనకో ముఖ్యార్థ సంబద్ధా సంబద్ధ సాధారణః ప్రసిద్ధాప్రసిద్ధార్థ విషయకో వక్త్రాదివైశిష్ట్యజ్ఞాన ప్రతిభాద్యుద్బుద్ధః సంస్కార విశేషో వ్యంజనా। అత ఏవ నిపాతానాం ద్యోతకత్వం స్ఫోటస్య చ వ్యంగ్యతా చ హర్యాదిభిరుక్తా। ద్యోత కత్వం చ - స్వ సమభివ్యాహృత పదనిష్ఠ శక్తి వ్యంజకత్వమితి వైయాకరణానా మప్యేతత్స్వీకార ఆవశ్యకః। ఏషా చ శబ్ద-తదర్థ - పద-పదైక దేశ-వర్ణ-రచనా-చేష్టాదిషు సర్వత్ర, తథైవానుభవాత్। వక్త్రాది వైశిష్ట్యజ్ఞానం చ వ్యంగ్యవిశేషబోధే సహకారీతి న సర్వత్ర తదపేక్షేత్యన్యత్ర విస్తరః।

యత్తు తార్కికాః - లక్షణయైవ గతార్థా వ్యంజనేతి న సా స్వీకార్యేత్యాహుః। తన్న। లక్షణాయా ముఖ్యార్థ బాధ పూర్వక లక్ష్యార్థ బోధకత్వాత్, ముఖ్యార్థ సంబద్ధార్థస్యైవ లక్షణాయా బోధకత్వాత్, వ్యంజనాయా అతథాత్వేన తదనంతర్భావాచ్చేతి దిక్।

ఇతి వృత్తివిచారః।

వ్యాఖ్యానము :- లక్షణావృత్తి చేతనే వ్యంజనావ్యాపారము గతార్థమగునను నైయాయిక మతము నిరాకరించుటకు, మొదట వ్యంజనాస్వరూపమును నిరూపించుచున్నాడు.

(1) ముఖ్యార్థ బాధ జ్ఞానమునపేక్షింపని బోధకు జనకము, (పదార్థముల పరస్పరాన్వయమునకనుపపత్తి ముఖ్యార్థ బాధ) (2) ముఖ్యార్థ సంబద్ధము, అసంబద్ధము లేక ఉభయ సాధారణమగు అర్థమేదియో తద్విషయకము (3) ప్రసిద్ధాప్రసిద్ధార్థ విషయకము (4) వక్తృబోద్ధవ్యాది వైశిష్ట్యజ్ఞాన, ప్రతిభాదులచే ఉద్బుద్ధమగు సంస్కారవిశేషము వ్యంజనయనబడును. వాచ్య లక్ష్య భిన్నమగు నర్థమును వ్యక్తము చేయుటలో వ్యంజనావృత్తి ముఖ్యార్థబాధనపేక్షింపదు. అనగా ముఖ్యార్థ బాధజ్ఞాన నిరపేక్షమగు వ్యంగ్యార్థ బోధను కలుగజేయునది వ్యంజన. ముఖ్యార్థమునకనుపపత్తి రూపబాధ కల్గినపుడు లక్షణ ప్రవర్తించును. ఇట్టి బాధ జ్ఞానము యొక్క అపేక్షవ్యంజనా వృత్తిలో లేదని తాత్పర్యము. లాక్షణిక స్థలమున లక్ష్యార్థము ముఖ్యార్థ సంబద్ధమే యగును. వ్యంగ్యార్థమునకట్టి నియమము లేదు. వ్యంజనావృత్తిచే ముఖ్యార్థముతో సంబద్ధము, అసంబద్ధము లేక ఉభయ సాధారణమగు నర్థాంతరబోధ కలుగును. కనుక ప్రాగుక్త భేదక యుక్తులచే వ్యంజన లక్షణ కంటె భిన్నమని సిద్ధించినది. శక్తి ప్రసిద్ధార్థ విషయకము కాగా వ్యంజన అప్రసిద్ధార్థ విషయకము కూడా యగును. పైన చెప్పిన నాలుగంశములలో ఒకటి, రెండు అంశములచే లక్షణ కంటె భేదము, మూడవ అంశముచే శక్తి కంటె భేదము వ్యంజనకు సిద్ధము. నాల్గవ అంశముచే సహకారికారణములు చెప్పబడినవి.

వక్తృబోద్ధవ్యకాకూనాం వాక్యవాచ్యాన్య సన్నిధేః।
ప్రస్తావదేశకాలాదేర్వైశిష్ట్యాత్ ప్రతిభాజుషామ్॥
యోఽర్థస్యాన్యార్థధీహేతుర్వ్యాపారో వ్యక్తిరేవ సా॥

– కావ్య ప్రకాశ

వక్తృ వైశిష్ట్యము = వైలక్షణ్యము, బోద్ధవ్య వైశిష్ట్యము, కాకు వైశిష్ట్యము మున్నగు వాని సహకారముచే ప్రతిభ, నిపుణత మున్నగు వాని వలన ఉద్బుద్ధమగు సంస్కార విశేషము వ్యంజన. అర్థవ్యంజనా విషయమున వక్తృవైశిష్ట్యము మున్నగునవి సహకారికారణములు. 'ప్రతిభాది' అను స్థలమున ఆది పదముచే శబ్దవ్యంజనాస్థలీయ శ్లేషసాధారణ శబ్దమహిమ గ్రహింపవలెను.

వస్తుతః వాచ్యవాచక భావ సంబంధరూపము శక్తి వలె వ్యంగ్యవ్యంజకభావ సంబంధ రూపము వ్యంజన. ప్రతిభాదులచే ఉద్బుద్ధమగు సంస్కార విశేషముచే వ్యంజన ప్రకాశితమగును. ప్రకాశకమగుటచే సంస్కార విశేషము కూడా వ్యంజనగా చెప్పబడినది. శాబ్దీ, ఆర్థీ భేదముచే వ్యంజన రెండు విధములు. ఈ విషయము కావ్యప్రకాశ మున్నగు అలంకారశాస్త్ర గ్రంథములలో వివరింపబడినది.

వ్యంజనా వృత్తిని స్వీకరించుట చేతనే నిపాతలకు ద్యోతకత్వము, స్ఫోటకు వ్యంగ్యత్వము భర్తృహరి మున్నగు వారిచే చెప్పబడినది. పరా - పశ్యన్తీ - మధ్యమా - వైఖరీ యని వాక్కు నాలుగు విధములు. ఇందు వైఖరీ వాక్కు పరశ్రోత్రగ్రాహ్యము. దీనిచే అర్థ బోధకమగు స్ఫోటరూప నిత్య శబ్దమభివ్యక్తమగునని శబ్దనిత్యతావాదులగు వైయాకరణుల మతము. 'స్ఫోటాత్మక వ్యంగ్య వ్యంజకస్య శబ్దస్య ధ్వనిరితి వ్యవహారః' అని కావ్య ప్రకాశకారుడు చెప్పెను. కనుక వైయాకరణులు కూడా వ్యంజనా వ్యాపారమునవశ్యమంగీకరించవలెను. స్వ సమభివ్యాహృత పదనిష్ఠ శక్తివ్యంజకత్వము ద్యోతకత్వము. స్వపదముచే చాదినిపాతలు గ్రాహ్యములు. తత్సమభివ్యాహృతమగు పదగత శక్తిని వ్యంజన చేయుటయే ద్యోతకత్వము. అనగా ఆయా పదములు తత్తదర్థములయందు శక్తములైనను నిపాతసమభివ్యాహారముచే పదనిష్ఠశక్తి మారుచున్నది. అట్టి శక్తిని నిపాతలు

వ్యక్తము చేయుటనే ద్యోతకత్వమనబడును. నిపాతలకు స్వతంత్రప్రయోగము లేకపోవుట వలన ముఖ్యార్థము సంభవించకపోవుటచే లక్షణ కవకాశము లేదు. వ్యంజనా వ్యాపారమంగీకరించుట వలననే నిపాతలకు ద్యోతకత్వముపపన్నమగుచున్నది. వ్యంజన శబ్ద-తదర్థ-పద-పదైకదేశ-వర్ణ-రచనా-చేష్టాదులయందంగీకరింపబడుచున్నది. అనగా శబ్ద తదర్థాదులు వ్యంగ్యార్థాభివ్యంజకములగుట అనుభవైకవేద్యమే. వక్త్రాది వైశిష్ట్యజ్ఞానము వ్యంగ్యార్థబోధలో సహకారికారణ మగుటచే సర్వత్ర దీని యపేక్ష లేదు. అనగా శాబ్దీవ్యంజన స్థలములో వక్త్రాది వైశిష్ట్యజ్ఞానము యొక్క అపేక్ష లేదు. నియంత్రితార్థ విషయకబోధ జనకము శాబ్దీవ్యంజన. వక్త్రాది వైశిష్ట్యముచే అర్థాంతరాభివ్యక్తికి కారణమగు అర్థనిష్ఠ వ్యాపారము ఆర్థీవ్యంజన.

లక్షణా వ్యాపారము లేక అనుమానప్రమాణముచే వ్యంగ్యార్థము సిద్ధించుచుండగా (లక్ష్యము లేక అనుమేయము) వ్యంజనావ్యాపారము నతిరిక్తముగ నంగీకరించుటలో ప్రమాణము లేదని నైయాయికులు చెప్పుదురు. అది యుక్తముగాదు. ముఖ్యార్థమునకు అనుపపత్తి రూపబాధ కల్గినపుడు లక్షణా వ్యాపారముచే ముఖ్యార్థ సంబద్ధమగు లక్ష్యార్థ బోధ కల్గును. కాని ముఖ్యార్థ బాధ లేక పోయినను వ్యంజనావ్యాపారముచే వాచ్యలక్ష్యభిన్నమగు అర్థము వ్యక్తమగుచున్నది. ఇట్టి యర్థము ముఖ్యార్థాసంబద్ధము కూడా కావచ్చును. కనుక వ్యంజనా వ్యాపారము లక్షణచే గతార్థము కాదు.

వ్యక్తి వివేకగ్రంథ కర్తయగు మహిమభట్టు వ్యంజనను అనుమానమందతర్భవింపజేసి వ్యంగ్యార్థమునకనుమేయత్వము సాధించెను. కాని అతడు చూపిన హేతువులు విరుద్ధాది దోషగ్రస్తములగుటచే వ్యంగ్యార్థానుమాపకములు కాజాలవు కనుక వ్యంగ్యార్థబోధకై

వ్యంజనావ్యాపారమవశ్యమంగీకరింపవలెనని మమ్మటాచార్యుడు కావ్యప్రకాశ పంచమోల్లాసమున వివరించెను.

విశేషము :- వ్యంజనను అనుమానమందు గతార్థము చేయుట మమ్మటాదులచే ఖండింపబడినది. ఉదా :-

భ్రమ ధార్మిక ! విశ్రబ్ధః స శునకోఽద్య మారితస్తేన ।
గోదావరీకచ్ఛ కుంజవాసినా దృప్తసింహేన ॥

ఇచ్చట వ్యంగ్యార్థమగు ధార్మిక భ్రమణాభావమును నైయాయికులు అనుమాన ప్రమాణముచే సాధించుచున్నారు. గోదవరీతీరము పక్షము, భీరుభ్రమణాయోగ్యత్వము సాధ్యము, సింహోపలబ్ధి హేతువు. గోదవరీతీరం భీరుభ్రమణాయోగ్యం, భయకారణ సింహోపలబ్ధేః అని అనుమానాకారము. పరార్థానుమానమున పంచావయవ వాక్యము -

(1) ప్రతిజ్ఞ - గోదావరీతీరం భీరుభ్రమణాయోగ్యమ్ ।

(2) హేతువు - భయకారణ సింహోపలబ్ధేః

(3) ఉదాహరణము - యద్యత్ భీరుభ్రమణ యోగ్యం తత్తత్ భయకారణాభావవత్ యథా గృహమ్

(4) ఉపనయము - న చేదం తీరం తథా భయకారణాభావవత్, సింహోపలబ్ధేః।

(5) నిగమనము - తస్మాత్ తథా = భీరుభ్రమణాయోగ్యమ్ । వ్యంగ్యార్థము అనుమేయమగుటచే తదర్థము వ్యంజనావ్యాపారము స్వీకరింపవలసిన పని లేదని అనుమితివాదుల తాత్పర్యము. సద్ధేతువు ప్రకృత పక్షమున ప్రకృత సాధ్యానుమితిని కలుగజేయును. అసద్ధేతువు లేక హేత్వాభాసలు సాధ్యానుమాపకములు కాజాలవు.

ప్రకృతశ్లోకమున భీరుభ్రమణాభావమును అనుమానము చేయుటకు చూపబడిన సింహోపలబ్ధిరూపహేతువు దుష్టమగుటచే అనుమితి సాధకము కాజాలదు. సవ్యభిచార - విరుద్ధ - సత్ప్రతిపక్ష - అసిద్ధ- బాధితములు హేత్వాభాసలు= దుష్టహేతువులు. యత్ర యత్ర భీరుభ్రమణాభావాభావః= భీరుభ్రమణమ్ తత్ర తత్ర భయకారణాభావః అని వ్యతిరేకవ్యాప్తి. యత్ర యత్ర సాధ్యాభావః తత్ర తత్ర హేత్వభావః అనునది వ్యాప్తి స్వరూపము, ప్రకృతమున సాధ్యాభావము = భీరుభ్రమణా భావాభావము = భీరుభ్రమణము. అది కలిగిన చోట హేతువగు భయకారణము యొక్క అభావముండవలెను. కాని భయకారణమున్నను రాజాజ్ఞ చేతనో, ప్రియానురాగముచేతనో ప్రవర్తించుట కనబడుచున్నందున సాధ్యాభావవద్వృత్తి హేతువగుటచే భయకారణరూప హేతువు వ్యభిచారదోషగ్రస్తము. అనగా సద్ధేతువు కాదు. మరియు భ్రమ ధార్మిక! ఇత్యాదివచనము పుంశ్చలి నాయికచే చెప్పబడినది. ఆమె మాటలు ప్రామాణికములు గావు. కనుక గోదావరీతీరమును పక్షమున భయకారణమగు సింహసద్భావము నిశ్చితము గాదు. ఈ విధముగ పక్షమందు హేతువు లేకపోవుట స్వరూపాసిద్ధ దోషము. భయకారణహేతువు వ్యభిచారదోషగ్రస్తము. కనుక వ్యాప్తి పక్షధర్మతాది నిర్ణయము లేకపోవుటవలన అనుమానప్రమాణముచే ధార్మిక భ్రమణాభావము సాధింపశక్యము కాదు. వ్యంజనను తప్పక ఆశ్రయించవలెను. విశేషవిచారణ కొఱకు కావ్యప్రకాశాది గ్రంథములు చూడవలెను.

''ఏక సంబంధిజ్ఞానము అపర సంబంధిస్మారకము'' కనుక 'గతోఽస్తమర్కః' సూర్యుడు అస్తమించెను మున్నగు స్థలములలో

సూర్యాస్తమయ జ్ఞానముచే తత్సంబంధులగు సంధ్యావందన-కర్తవ్యత్వాద్యర్థములు స్మృతములగును కావున వ్యంజన అనావశ్యకమని కొందరి మతము. అదియుక్తము గాదు. 'గతోఽస్తమర్కః' ఇత్యాది వాక్యశ్రవణోత్తరకాలమున 'సంధ్యావందన కర్తవ్యత్వం మయా స్మృతమ్' అను అనువ్యవసాయము ( జ్ఞానవిషయక జ్ఞానము) కలుగుట లేదు. 'ఈపద మీ యర్థమునకు వాచకము గాని లక్షకము గాని స్మారకము గాని కాదు, వ్యంజకమే' అను ప్రామాణిక వ్యవహారముచే వ్యంజన అతిరిక్త వృత్తిగ సిద్ధించును. శబ్దమునకే వ్యంజకత్వము, అర్థమునకది యెట్లు సంభవించునను ప్రశ్నకు సమాధానమిట్లు -

**రతికాలే విలోక్య శ్రీర్నాభిపద్మే పితామహమ్ ।**
**రత్యాకులా ఛాదయతే దక్షిణం నయనం హరేః ॥**

అను శ్లోకమున హరిపదముచే దక్షిణ నేత్రమునకు సూర్యాత్మకత్వము, తత్సంకోచరూప సూర్యాస్తమయముచే పద్మసంకోచము, దీని వలన పద్మాసనస్థుడగు పితామహుని స్థగనము, దీని వలన అప్రతిబద్ధములగు రతివిలాసములు వ్యక్తములగు చున్నవి. ఇచ్చట అర్థము వ్యక్తమయిన పిదప మరియొకయర్థము వ్యక్తమగుచుండుటచే అర్థమునకు కూడ వ్యంజకత్వము సిద్ధించుచున్నది. మరిన్ని విశేషములకు లఘుమంజూష కలాటీక చూడ వలయును.

వ్యంజనానిరూపణము సమాప్తము

## అథ స్ఫోటనిరూపణమ్

**మూలము :-** నను కోఽయం వృత్త్యాశ్రయః శబ్దః ? వర్ణాః ప్రత్యేకమితి చేత్, న; ద్వితీయాది వర్ణోచ్చారణ వైయర్థ్యాపత్తేః । నాపి వర్ణసంఘాతః । ఉచ్చరిత ప్రధ్వంసిత్వేన యౌగపద్యాసంభవాత్ ।

అభివ్యక్తేరుత్పత్తేర్వా క్షణస్థాయిత్వాత్ క్షణాత్మకకాలస్య ప్రత్యక్షాయోగ్యత్వేన తదవచ్ఛిన్న వర్ణస్యాప్యప్రత్యక్షత్వాత్। ఉచ్చారణాధికరణకాలోత్తరకాలవృత్తి ధ్వంస ప్రతియోగిత్వముచ్చరిత ప్రధ్వంసిత్వమ్ । 'ఇకో యణచి' (అష్టాధ్యాయి 6-1-77) ఇత్యాదౌ, 'తస్మిన్' (అష్టా. 1-1-66) ఇతి పరిభాషోపస్కృతవాక్యార్థే అయం పూర్వోఽయం పర ఇతి నష్టస్య ప్రత్యక్షవిషయేదం శబ్దేన పౌర్వాపర్యవ్యవహారాయోగాచ్చ।

వ్యాఖ్యానము :- ఘటాదివిషయక శాబ్ద బోధను గూర్చి ఘటాది నిరూపిత వృత్తివిశిష్ట జ్ఞానము కారణమని ముందు ప్రకరణమున వివరింపబడినది. శక్తి, లక్షణా, వ్యంజనాభేదముచే వృత్తి మూడు విధములని పేర్కొని వాటి స్వరూపము నిరూపింపబడినది. ప్రకృత ప్రకరణమున వృత్త్యాశ్రయమగు శబ్దమును గూర్చి విచారింపబడుచున్నది. మీమాంసకులు వర్ణములకు నిత్యత్వము వాచకత్వము నంగీకరింతురు. నైయాయికులు పరశ్రోత్రగ్రాహ్యమగు వైఖరీవాక్కునకు వాచకత్వము చెప్పుదురు. వైయాకరణులు ప్రాకృతధ్వని (వైఖరీ వాక్కు) వ్యంగ్యము, నిత్యమగు స్ఫోటాత్మక శబ్దమునంగీకరించి దానికే వాచకత్వము సమర్థింతురు. ఈ సందర్భమున 'నను కోఽసౌ శక్త్యాశ్రయః శబ్దః ?' అని సమగ్రముగ విచారణ చేయబడుచున్నది. ప్రత్యేకము వర్ణములు శక్తికి ఆశ్రయములు, అనగా 'ఘట' శబ్దగత ఘకార - అకార - టకార - అకారములు ప్రత్యేకము శక్తికి ఆశ్రయములన్నచో ప్రథమ వర్ణమగు ఘకారము శక్త్యాశ్రయమగుటచే ఘటరూపార్థబోధ కలుగుచుండగ అకారాది ద్వితీయవర్ణోచ్చారణము. వ్యర్థము కావలసివచ్చును. పర్యాప్తి సంబంధముతో శక్త్యాశ్రయములు వర్ణములన్నచో యవి అర్థవత్తులగుటచే 'అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్' అను సూత్రముచే ప్రాతిపదిక సంజ్ఞను పొంద, దనమ్, వనమ్ ఇత్యాది పద ఘటక నకారము

ప్రాతిపదికావయవమగుటచే 'నలోపః ప్రాతిపదికాంతస్య' అను సూత్రముచే నలోపము రావలసివచ్చును. వర్ణములు ప్రత్యేకము శక్త్యాశ్రయములైనను, వాని వలన అర్థస్మృతి కలుగును. అంత్యవర్ణముచే స్పష్టముగ అర్థబోధ (స్మృతి) కల్గును. ఈ విధముగ స్మరణమునకు వైజాత్యముండుటచే వర్ణములకు ప్రత్యేకము వాచకత్వము స్వీకరించినను దోషము లేదని చెప్పుట కూడా యుక్తము గాదు. ప్రతివర్ణము అర్థస్మరణము అనుభవవిరుద్ధము మరియు గౌరవము.

వర్ణసముదాయము శక్తికి ఆశ్రయమను పక్షము గూడ సరిగాదు. వ్యాకరణ దర్శనమున వర్ణములకుచ్చరిత ప్రధ్వంసిత్వమంగీకరింపబడుచున్నది. వర్ణోచ్చారణాధికరణకాలమునకుత్తర కాలమందు కలుగు ధ్వంసకు ప్రతియోగి యగుట ఉచ్చరిత ప్రధ్వంసిత్వ మనబడును. అనగా వర్ణము ఏ ప్రయత్నముచే నుచ్చరింపబడుచున్నదో అదే ప్రయత్నముచే వర్ణోచ్చారణోత్తరకాలమందు వినష్టమగును. పిమ్మట రెండవ ప్రయత్నముచే మరియొక వర్ణముచ్చరితమగును. కనుక వర్ణములుచ్చరిత ప్రధ్వంసులగుటచే యేకకాలమందు వర్ణద్వయమునకు యౌగపద్యము సంభవింపదు గావున వర్ణసముదాయము శక్తికి ఆశ్రయమనుట సరిగాదు.

వర్ణములనిత్యములను పక్షమున వాటి ఉత్పత్తిక్షణకాలికము. నిత్యములను పక్షమున అభివ్యక్తి కూడా క్షణకాలికమే. ఇచ్చట క్షణపదముచే ఉచ్చారణాధికరణ కాలము గ్రాహ్యము. ఇదియే ముఖ్య క్షణము. క్షణ సముదాయము ప్రత్యక్షయోగ్యమయినను ముఖ్యక్షణము ప్రత్యక్షయోగ్యము కాకపోవుటచే తత్క్షణమందు పుట్టిన లేక అభివ్యక్తమయిన వర్ణములకు కూడా ప్రత్యక్షత్వము సంభవించదు. క్రియలు క్రమికములు. అనగా ఒక క్రియ తరువాత మరియొక క్రియ పుట్టును. వర్ణముల ఉచ్చారణ - వినాశక్రియలు ఏకకాలమందు సంభవించవు కనుక ఉచ్చారణ కాలావ్యవహితోత్తర

కాలమందు ప్రధ్వంసమని చెప్పబడినది. కనుక ఏకకాలావచ్ఛేదేన వర్ణములకు యౌగపద్యము సంభవము కాదు.

వర్ణములకు పౌర్వాపర్యము సంభవించక పోవుటవలన 'ఇకోయణచి' (అష్టా. 6-1-77) ఇత్యాది సూత్రములు వ్యర్థముకావలసివచ్చును. 'ఇకోయణచి' అను విధి సూత్రమున 'ఇకః' అను షష్ఠ్యంతపద లింగముచే 'షష్ఠీ స్థానేయోగా' అను పరిభాషా సూత్రము, 'అచి' అను సప్తమ్యంతపదలింగముచే 'తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య' అను పరిభాష ఉపస్థితములగుచున్నవి. కనుక అజవ్యవహిత పూర్వమగు ఇక్కు యొక్క స్థానమున యణ్ ఆదేశమగునని సూత్రార్థము లభించినది. కాని ఉచ్చరిత ప్రధ్వంసులగు వర్ణములకు యౌగపద్యమసంభవమగుటచే 'అయం పూర్వః అయం పరః' అని పౌర్వాపర్యజ్ఞానము సంభావితము కాకపోవుటచే అజవ్యవహిత పూర్వమగు ఇక్కునకు యణాదేశ విధానమసంభవమగుటచే 'ఇకో యణచి' ఇత్యాది సూత్రములు వ్యర్థము కావలసి వచ్చును. నష్ట విద్యమాన పదార్థములకు పౌర్వాపర్యము సంభవించదు. అనగా నష్టమయిన వర్ణమునకు 'అయం పూర్వః, అయం పరః' అని ప్రత్యక్ష విషయమగు ఇదం శబ్దముతో గ్రహణము సంభవించదు గావున పౌర్వాపర్యవ్యవహారము సంగతము కాక పోవలసివచ్చును.

''ఏకైక వర్ణవర్తినీ వాక్ న ద్వౌ యుగపదుచ్చారయతి గౌరితి యావద్గకారే వాగ్వర్తతే నౌకారే న విసర్జనీయే చ, యావదౌకారే న గకారే న విసర్జనీయే, యావద్విసర్జనీయే న గకారే నౌకారే'' అని ''పరఃసన్నికర్షస్సంహితా'' (అష్టా. 1-4-109) సూత్రభాష్యము. గౌః అను శబ్దోచ్చారణమున వాగింద్రియము గకారమునుచ్చరించు సమయమున ఔకారము నుచ్చరించలేదు. ఈ విధముగ ఏ ప్రయత్నముచే ఒక వర్ణముచ్చరింపబడినదో అదే ప్రయత్నముచే ఆ వర్ణము నష్టమగును. పిమ్మట

మరియొక ప్రయత్నముచే రెండవ వర్ణముచ్చరింపబడునని భాష్య తాత్పర్యము. దీనివలన వర్ణములకుచ్చరిత ప్రధ్వంసిత్వము భాష్యారూఢమని తెలియుచున్నది. ''యావద్గకారే వాగ్ వర్తతే న తావదౌకారే ఇతి యేనైవ యత్నేనైకో వర్ణఉచ్చార్యతే తేనైవ విచ్ఛిన్నే తస్మిన్ వర్ణే ఉపసంహృత్య తం యత్నమన్యం యత్నముపాదాయ ద్వితీయః ప్రవర్తతే' ఇతి చ తత్రైవ సూత్రే భాష్యే ఉక్తత్వాత్' అని లఘుమంజూషలో స్పష్టము. ''ఏకేన యత్నేన వర్ణే ఉచ్చారితే తస్మిన్నష్టే తజ్జనకయత్నేచ నష్టే యత్నాంతరోత్పత్త్యనంతరం ద్వితీయ వర్ణోత్పత్తేరిత్యర్థః'' అని లఘుమంజూష కలాటీకాకారులు. కనుక పూర్వవర్ణ స్థితి కాలమందు ద్వితీయవర్ణము పుట్టదు.

మూలము :- యత్తు తార్కికాః – వర్ణానామనిత్యత్వేఽపి ఉత్తరోత్తరవర్ణే పూర్వపూర్వవర్ణవత్త్వమవ్యవహితోత్తరత్వ సంబంధేన సంస్కారవశాద్ గృహ్యత ఇతి పదస్య ప్రత్యక్షత్వాచ్ఛాబ్దబోధః।

యద్వా పూర్వపూర్వ వర్ణజాః శబ్దాః శబ్దజశబ్దన్యాయేన చరమవర్ణప్రత్యక్షపర్యన్తం జాయమానా ఏవ సంతీతి న పదప్రత్యక్షానుపపత్తిః।

యద్వా పూర్వపూర్వ వర్ణానుభవజన్య సంస్కార సధ్రీచీన చరమ వార్ణనుభవతః శాబ్దబోధ ఇత్యాహుః

వ్యాఖ్యానము :- వర్ణములనిత్యములగుటచే వెనుక చెప్పబడినట్లు వాటికి యౌగపద్యము సంభవము కాకపోవుటచే అనుభవసిద్ధమగు పద విషయక ప్రత్యక్షాత్మక జ్ఞానము కలుగక పోవలసివచ్చును. పదజ్ఞానము లేనిచో పదార్థ విషయక శాబ్దబోధ ఎట్లు కలుగునను శంకకు నైయాయికులు పలు రకములుగ సమాధానము చెప్పుచున్నారు.

వర్ణములనిత్యములయినను పూర్వవర్ణ స్థితి కాలమందు ద్వితీయ వర్ణము పుట్టువనుట సరిగాదని పూర్వము వివరింపబడినది.

(1) వర్ణములనిత్యములైనప్పటికి వర్ణానుభవమువలన సంస్కారము కలుగును. ద్వితీయ వర్ణప్రత్యక్షకాలమున పూర్వవర్ణము నష్టమయినను తత్సంస్కారముండుటచే అవ్యవహితోత్తరత్వ సంబంధముచే పూర్వవర్ణ సంబంధిత్వము గ్రహింపబడును. అట్లే తృతీయ వర్ణమందు సంస్కారవశముచే అవ్యవహితోత్తరత్వసంబంధముచే పూర్వవర్ణవిశిష్టోత్తర వర్ణసంబంధిత్వము, ఈ విధముగ ఉత్తరోత్తర వర్ణములయందు పూర్వపూర్వవర్ణవైశిష్ట్యము గ్రహింపబడుచుండుటచే పదప్రత్యక్షము లేక సమూహాలంబన స్మరణము సులభము కనుక శాబ్దబోధ కలుగును.

(2) రెండవమతము శబ్దజశబ్ద న్యాయమునకు సంబంధించినది. ఒక తరంగము స్వసమానాకారమగు మరియొక తరంగమును పుట్టించునట్లు పూర్వపూర్వ వర్ణములు అంతిమవర్ణప్రత్యక్ష పర్యంతము స్వసమానాకారములగు వర్ణములను పుట్టించును. కనుక చరమవర్ణ ప్రత్యక్షకాలమందు పూర్వపూర్వ వర్ణజ్ఞానముండుటచే వర్ణసముదాయాత్మక పదప్రత్యక్షము సులభము. ఒక తరంగము రెండవతరంగమును పుట్టించి నాశము చెందును. కాని ఒక వర్ణము స్వసజాతీయ వర్ణమును పుట్టించి వెంటనే నాశము పొందదు. చరమవర్ణప్రత్యక్షపర్యంతముండును. శ్రోత్ర దేశమునకు చేరినది గ్రహింపబడును. ఇదియే వీచీతరంగ దృష్టాంతము కంటె ప్రకృతస్థలమునకు భేదము.

(3) పూర్వపూర్వ వర్ణానుభవజనిత సంస్కార సహకృత చరమ వర్ణానుభవమువలన శాబ్దబోధ కలుగునని మూడవ పక్షము.

మూలము :- తన్న । ఆద్యేఽయం పూర్వోఽయం పర ఇత్యభిలాపాసంభవేన అవ్యవహితోత్తరత్వసంబంధాయోగాత్ । నష్ట

విద్యమానయోరవ్యవహితోత్తరత్వ సంబంధస్య వక్తుమశక్యత్వాచ్చ। ద్వితీయే శబ్దజ శబ్దన్యాయేన పదప్రత్యక్షోపపాదనేఽపి పదస్యావిద్యమానత్వేన తత్ర శక్త్యాశ్రయత్వస్య గ్రహానుపపత్తేః। అవిద్యమానే ఆశ్రయత్వాంగీకారే నష్టో ఘటో జలవాన్ ఇత్యాద్యాపత్తేశ్చ। తృతీయే యేన క్రమేణానుభవస్తేనైవ క్రమేణ తత్సంస్కారస్థితి రిత్యత్ర వినిగమకాభావాత్ సరోరసోనదీ దీన ఇత్యాదౌ విపరీత - సంస్కారోద్బోధేన ప్రత్యేకమన్యార్థ ప్రత్యయాపత్తేః। ఉత్పత్తివినాశవద్వర్ణ సముదాయరూపపదస్య మనుష్యాదివద్భేదే 'ఏక ఇంద్రశబ్దః క్రతుశతే ప్రాదుర్భూతో యుగపత్ సర్వయాగేష్వఙ్గం భవతి' **(మ.భా. 1-2-64)** ఇతి భాష్యవిరోధాపత్తేశ్చ। ప్రాదుర్భూతోఽభివ్యక్తః।

వ్యాఖ్యానము :- పదప్రత్యక్షమునకు నైయ్యాయికులు చెప్పిన పక్షములు యుక్తముగావు. మొదటి పక్షమున 'ఈ వర్ణము పూర్వము, ఈ వర్ణము పరము' అను అభిలాపము = శాబ్దిక ప్రత్యక్ష వ్యవహారము సంభవించకపోవుటచే వర్ణములకు అవ్యవహితోత్తరత్వ సంబంధముపపన్నము గాదు. మరియు నష్ట విద్యమాన పదార్థములకు అవ్యవహితోత్తరత్వ సంబంధము సంభవము గాదు. రెండవ పక్షమున శబ్దజశబ్ద న్యాయముచే పదమునకు ప్రత్యక్షత్వము సాధించినను, ఈ ప్రత్యక్షము భ్రమాత్మకమగుటచే పదమునకు సత్త సంభవించదు. శుక్తియందు రజత భ్రమకలిగినపుడు రజతమవిద్యమానమయినట్లు పదమవిద్యమానమగుటచే, అట్టిదానికి శక్త్యాశ్రయత్వమంగీకరించుట అత్యంతమనుపపన్నము. అవిద్యమానములగువానికి గూడ ఆశ్రయత్వమంగీకరించిన నష్టఘటము జలము కల్గినదను వ్యవహారము ప్రామాణికము కావలసివచ్చును.

మూడవ పక్షమున ఏ క్రమముతో వర్ణముల యొక్క అనుభవము కలుగునో అదే క్రమముతో వర్ణ సంస్కారము కలుగునుటలో వినిగమకము

లేకపోవుటచే సరః రసః, నదీ - దీనః మున్నగు స్థలములలో 'సరః' అను శబ్దానుభవమువలన తద్విపరీతమగు 'రసః' అను సంస్కారము కూడ కలుగవచ్చును. అట్లైన సరశ్శబ్దానుభవము వలన రసశబ్దార్థ బోధ కలుగ వలసి వచ్చును. ఉత్పత్తి వినాశవములు కల వర్ణముల యొక్క సముదాయాత్మకవుగు పదమునకు, మనుష్యాదులకు వలె భేదము నంగీకరించిన పదమునకనేకత్వము సిద్ధించును గావున సరః - రసః మున్నగు స్థలములలో విపరీతార్థబోధ కలుగదని చెప్పుట సరిగాదు. అట్లైన ''ఒకే ఇంద్ర శబ్దము క్రతుశతమందభివ్యక్తమై సకల క్రతువులయందు అంగమగుచున్న''దను శబ్దమునకేకత్వము చెప్పబడిన భాష్యముతో విరోధము వచ్చును. కనుక పదప్రత్యక్షము సంభవించకపోవుటచే శాబ్దబోధకలుగదను దోషము తదవస్థమే.

మూలము :- నను కస్తర్హి వృత్త్యాశ్రయః శబ్దః ? స స్ఫోటాత్మక ఇతిగృహాణ। నను కోఽయం స్ఫోటః ? ఉచ్యతే। చతుర్విధాహి వాగస్తి - పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ చ। తత్ర మూలాధారస్థ పవన సంస్కారీభూతా మూలాధారస్థా శబ్దబ్రహ్మరూపా స్పందశూన్యా బిందురూపిణీ పరా వాగుచ్యతే । నాభి పర్యన్తమాగచ్ఛతా తేన వాయునాఽభివ్యక్తా మనోగోచరీభూతా పశ్యన్తీవాగుచ్యతే। ఏతద్ద్వయం వాగ్బ్రహ్మ యోగినాం సమాధౌ నిర్వికల్పక సవికల్పకజ్ఞాన విషయ ఇత్యుచ్యతే। తతో హృదయ పర్యంతమాగచ్ఛతా తేన వాయునాఽభివ్యక్తా తత్తదర్థవాచక స్ఫోటశబ్దరూపా శ్రోత్రగ్రహణాయోగ్యత్వేన సూక్ష్మా జపాదౌ బుద్ధినిర్గ్రాహ్యా మధ్యమా వాగుచ్యతే। తత ఆస్యపర్యంతమాగచ్ఛతా తేన వాయునోర్ధ్వమాక్రామతా చ మూర్ధానమాహత్య పరావృత్య చ తత్తత్స్థానేష్వభివ్యక్తా పరశ్రోత్రేణాపి గ్రాహ్యా వైఖరీ వాగుచ్యతే। తదాహ -

పరా వాఙ్ మూలచక్రస్థా పశ్యన్తీ నాభిసంస్థితా ।
హృదిస్థా మధ్యమా జ్ఞేయా వైఖరీ కంఠదేశగా ॥ ఇతి ।
వైఖర్యా హి కృతో నాదః పరశ్రవణగోచరః ।
మధ్యమయా కృతో నాదః స్ఫోటవ్యంజక ఉచ్యతే ॥ ఇతి చ ।

వ్యాఖ్యానము :- వర్ణములుగాని, వర్ణసముదాయముగాని శక్తికి ఆశ్రయము గాదని నిరాకరించి వాచక శబ్దమగు స్ఫోటయొక్క స్వరూపమును నిరూపించుచున్నాడు. స్ఫోటరూప శబ్దము శక్తికాశ్రయము. దాని స్వరూపమెట్టిదన -

పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ యని వాక్కు నాలుగు విధములు. లఘు మంజూషలో నాగేశభట్టు చూపిన సృష్టి ప్రక్రియను సందర్భానుకూలముగ వివరించెదను.

ఖండప్రలయమున నియతకాలమున భోగ్యములగు కర్మల ఫలము ననుభవించిన సమస్త ప్రాణికోటి ( ప్రపంచము) మాయయందు, అవిద్యారూపమగు మాయ పరమాత్మయందు లీనమగును. ( భుక్త భోగ్యానాం ప్రాణినాం మాయాయాం లయః, తస్యాశ్చేశ్వరే ఇత్యర్థః) అనగా సుప్తావస్థలో వలె నుండును. ఇచ్చట మాయ పరమాత్మయందు లీనమగుట ఉత్తరకాలమందు సృష్టి ననుసరించి పునఃప్రాదుర్భావఫలకము. ఆత్యంతిక నాశ రూపము గాదు. ప్రపంచరూప కార్యోత్పత్తి ఆ సమయమున లేకపోవుటచే నిద్రలోనున్నట్లు వలె మాయ సూక్ష్మ రూపమున నుండును. ప్రలయానంతరము, ప్రాణుల యేకర్మలు అపరిపక్వములో = ఫలించుటలో ఉన్ముఖములు కాలేదో అవి కాలవశముచే పరిపక్వములై ఫలోన్ముఖములగును. అప్పుడు పరమేశ్వరుని అబుద్ధిపూర్వక సృష్టి యొక్క ఆరంభమే మాయాపురుషుల ప్రాదుర్భావము. అనగా మాయా పురుషుల ప్రాదుర్భావముచే సృష్టి ఆరంభమయినది. ఉభయ ప్రాదుర్భావానంతరము

పరమేశ్వరునికి సిసృక్షాత్మకమగు (సృష్టిచేయవలెనను ఇచ్ఛ) మాయావృత్తి ఉత్పన్నమగును. పిమ్మట దాని నుండి(మాయావృత్తి) అవ్యక్తము, సత్త్వరజస్తమోగుణాత్మకమగు బిందు నామక పదార్థము పుట్టును. దీనికే శక్తి తత్త్వమని పేరు. ఈ బిందువులో చిదంశము, అచిదంశము, చిదచిదంశమను మూడు అంశములు గలవు. అందు అచిత్ = అజ్ఞాన రూపమగునంశము బీజమనబడును. చిత్, అచిత్ కలిసిన అంశము నాదమనబడును. శుద్ధ చిన్మాత్రమగు అంశమునకు బిందువని వ్యవహారము. చిదంశము బ్రహ్మరూపము. ఇచ్చట అచిచ్ఛబ్దముచే అవిద్య చెప్పబడును గాని మాయకాదు. 'అచిచ్ఛబ్దేనాత్ర న మాయా, తస్యాః మూలభూతత్వేన ఏతదనంశత్వాత్' అని కలాటీకాకారులు వివరించిరి. 'అస్మాద్ బిందోః' అను లఘుమంజూషకు 'అవ్యక్తాత్ త్రిగుణాదిత్యర్థః తత్ర రజసః ప్రవర్తకత్వాదితి భావః' అని కలాటీక.

అవ్యక్తమగు త్రిగుణాత్మక బిందువునుండి శబ్ద బ్రహ్మపరనామధేయము, జ్ఞానప్రధానము, చేతన మిశ్రితము సృష్ట్యుపయోగ్యవస్థావిశేషయుక్తమగు నాదము మాత్రము పుట్టును. ఈ నాదము సర్వజగత్తుకు ఉపాదానకారణము = సమవాయి కారణము. ఇది రవ-పరాది శబ్దములచే వ్యవహరింపబడును.

ప్రపంచసారమున-

బిందోస్తస్మాద్భిద్యమానాత్ రవోఽవ్యక్తాత్మకోఽభవత్।
స ఏవ శ్రుతి సంపన్నైః శబ్దబ్రహ్మేతి గీయతే ॥

అని చెప్పబడినది. విషయేంద్రియ సంయోగముచే జీవుని ఉపాధిభూతమగు అంతఃకరణమున అనేకవృత్తులు కలుగునట్లు, ప్రాణులకర్మలు ఫలోన్ముఖములైనప్పుడు పరమేశ్వరుని ఉపాధిభూతమగు

మాయలో బహువిధ వృత్తులు పుట్టుచున్నవి. అందు ప్రథమ వృత్తి సిస్క
యనబడును.

శబ్ద బ్రహ్మరూప నాదము అంతట వ్యాపించియున్నను ప్రాణ
మూలాధారమున సంస్కార యుక్త పవన చలనము వలన అభివ్యక్తమగున
మూలాధారమును గూర్చి యిట్లు చెప్పబడినది -

పాయ్వంతాద్ద్వ్యంగులా దూర్ధ్వం లింగాచ్చ ద్వ్యంగులాదధః ।
మధ్యమేకాంగులం యచ్చ దేహమధ్యం ప్రచక్షతే ॥ ఇతి ।

నవాంగులోర్ధ్వతస్తస్మాదస్తి కందోఽండసన్నిభః ।
చతురంగుల విస్తారస్తన్మధ్యం నాభిరుచ్యతే ॥ ఇతి ।

సంగీత రత్నాకరమందు -

గుద లింగాన్తరే చక్రమాధారాఖ్యం చతుర్దలమ్ ।
అస్తి కుండలినీ బ్రహ్మశక్తిరాధార పంకజే ॥
ఆధారాద్ద్వ్యంగులా దూర్ధ్వం మేహనాద్ద్వ్యంగులాదధః ॥
ఏకాంగులం దేహమధ్యం తప్తజాంబూనద ప్రభమ్ ॥ ఇతి ।

గుద స్థానము నుండి రెండగులల ఊర్ధ్వభాగము, గుహ్యస్థానమునుం
రెండగులుల అధోభాగము మధ్యగల ఏకాంగుల పరిమితమగు ప్రదేశమునక
మూలాధారమని పేరు. దీనికి దేహమధ్యమని నామాంతరము. 96
అంగులుల పరిమితము దేహము యొక్క ఆయామము. అందు
ఊర్ధ్వభాగము 47½, అధోభాగము 47½ విడిచిమధ్యలో గల ఏకాంగుల
పరిమిత దేశము మూలాధారమని కూడ చెప్పబడినది. మూలాధారము
ప్రాణవాయువునకుత్పత్తి స్థానము. కుండలినీ రూపమగు బ్రహ్మశక్తి
మూలాధారమందు కలదు. ప్రపంచసారమున -

'దేహేఽపి మూలాధారేఽస్మిన్ సముద్యతి సమీరణః' । అని ।
'మూలాధారాదుత్థితః పవనో నాడీద్వారేణ కార్యాణి కరోతి'

అని పాతంజలభాష్యమున చెప్పబడినది.

జ్ఞాతమగు నర్థమును చెప్పవలయునను ఇచ్ఛతో వక్త ప్రయత్నము చేయును. ఇచ్ఛ వలన ఉత్పన్నమగు ప్రయత్నము వాయువుతో సంబద్ధమగుటయే మూలాధారస్థ పవన సంస్కారము. ఇట్టి మూలాధారమందలి పవన సంస్కారముచే అభివ్యక్తమగు శబ్దబ్రహ్మ (నాదరూపము) స్వప్రతిష్ఠితమగుటచే (ఆధారాంతరరాహిత్యము) క్రియాశూన్యమై 'పరా' వాక్కుగ వ్యవహరింపబడుచున్నది. వాక్యపదీయమున భర్తృహరి -

అనాది నిధనం బ్రహ్మ శబ్ద తత్త్వం యదక్షరమ్।
వివర్తతేఽర్థభావేన ప్రక్రియా జగతో యతః ॥ అని

పేర్కొనెను. ఆద్యంత రహితము, వ్యాపకము (అక్షరమ్) అగు బ్రహ్మపదార్థము శబ్ద తత్త్వమే. దీని యొక్క ప్రథమ వివర్తము జగత్తునకు మూలభూతమగు వేదము (శబ్దరాశి) శబ్దాత్మకమగు బ్రహ్మమే తత్తత్పదార్థ రూపముగ వివర్తము చెందినది. రజ్జు సర్పభ్రమయందు రజ్జువు యొక్క వివర్తము సర్పమైనట్లు శబ్దబ్రహ్మ యొక్క వివర్తమే సర్వజగత్తు. ఇచ్చట ఆరంభవాదము లేక పరిణామ వాదము వివక్షితము కాదు. వివర్తవాదమే వివక్షితము. వివర్తతే = తత్త్వాదప్రచ్యుతమేకం భేదానుకారేణాసత్యానేక-రూపతాం ప్రాప్నోతి. యథారజ్జుః స్వయమవికృతైవ సతీ మాయయా సర్పాకారేణ వివర్తతే।

మూలాధారము నుండి నాడీ మార్గము ద్వారా నాభిదేశమును పొందిన సంస్కృత వాయువుచే నాభి దేశమందు అభివ్యక్తమగు పరాఖ్య శబ్ద బ్రహ్మయే పశ్యన్తీయనబడును. పశ్యన్తీ వాక్కు సమస్త ప్రపంచమునకు మూలము. ఇది పరా వాక్కు యొక్క ప్రథమ వివర్తము. వేదము = శబ్దరాశి పరాఖ్య శబ్ద బ్రహ్మ యొక్క ప్రథమ వివర్తము. అనగా పశ్యన్తీరూపము. పశ్యతి సర్వం ప్రపంచం స్వస్మిన్ యా సా పశ్యన్తీ. కర్త్రర్థ మందు దృశ్

ధాతువుకంటె శతృ ప్రత్యయము. పరయా దృశ్యతే యా సా అను వ్యుత్పత్తిలో కర్మార్థమున బహుళగ్రహణముచే శతృప్రత్యయము.

పరా వాక్కు యోగీశ్వరుల సమాధ్యవస్థలో నిర్వికల్పక జ్ఞానమున విషయమగును. నిష్ప్రకారకమగు జ్ఞానము నిర్వికల్పకము. అనగా విశేషణ విశేష్య భావరహితము, చిన్మాత్ర విషయకమగు జ్ఞానము నిర్వికల్పకము. యోగీశ్వరుల సమాధ్యవస్థలో సవికల్పకజ్ఞాన విషయమగునది పశ్యన్తీవాక్కు. సప్రకారక జ్ఞానము సవికల్పకము. అనగా విశేషణ, విశేష్య, తత్సంబంధములు భాసించు జ్ఞానము సవికల్పకము. ఈ విధముగ పరా-పశ్యన్తీ వాక్కులు రెండును కేవలము సమాధ్యవస్థలో యోగులకు మాత్రము గోచరించును.

సమాధీయతే = పూర్ణతయా నిగృహ్యతే మనః అస్మిన్నితి సమాధిః। వృత్త్యంతర నిరోధ పూర్వకముగ 'అహం బ్రహ్మాస్మి' అను చిత్తవృత్తి యొక్క అవస్థ సమాధి యనబడును.

సోఽహం బ్రహ్మ న సంసారీ న మత్తోఽన్యత్ కదాచన।
బ్రహ్మణ్యేవ స్థితిర్యా సా సమాధిః ప్రత్యగాత్మనః

అని సూత సంహితలో చెప్పబడినది.

సమాధిస్తు సమాధానం జీవాత్మ పరమాత్మనోః।
బ్రహ్మణ్యేవ స్థితిర్యా సా సమాధిః ప్రత్యగాత్మనః॥

అని సమాధిస్వరూపము.

పిమ్మట హృదయ దేశమును చేరిన పూర్వోక్తవాయువు చే హృదయదేశమందు అభివ్యక్తము, (ఆవరణము తొలగుట) అర్థ విశేష, శబ్ద విశేషములను వేరు వేరుగ ప్రకటింపజేయు బుద్ధిచే గ్రహింపబడు (జ్ఞాన విషయమగు) వాక్కు మధ్యమాయనబడును. ఇతరులకు వినబడునదియు,

ఎవరి హృదయ దేశమున అభివ్యక్తమో వారికి మాత్రము వినబడునదియు గనుక 'సూక్ష్మ' అని వ్యవహరింపబడును. స్వయముగ తన రెండు చెవులు మూసుకొనిన ఈ వాక్కును వినవచ్చును.

అర్థ బోధకము గనుక దీనికి స్ఫోటయని పేరు. మధ్యమావాక్కు జపాదుల యందు బుద్ధిచే గ్రహింపబడును. హిరణ్యగర్భుడు దీనికి అధిష్ఠాన దేవత.

పిమ్మట హృదయ దేశమునుండి ముఖమును చేరు వాయువు ఊర్ధ్వ దేశమునకు చేరి మూర్ధ దేశము యొక్క ఆఘాతము చేసి బయటకు వెడలుటకు మార్గము లేక అధోదేశమునకు మరలి ఉచ్చారణావయవములగు తాల్వాది స్థానములను చేరి ఆయాస్థానముల యందు అభివ్యక్తమగు మధ్యమా వాక్కు వైఖరి యనబడును. ఇది పరశ్రోత్ర గ్రహణ యోగ్యము. మధ్యమావాక్కు వక్తచే మాత్రము తెలుసుకోదగును. వైఖరీవాక్కు అందరికి వినబడునది. దీనికి అధిష్ఠాతృ దేవత విరాట్ భగవానుడు. మూలాధారమందభివ్యక్తమగు నాదాంశము పరావాక్కు. ఇదియే శబ్ద బ్రహ్మ. పరావాక్కు పశ్యన్తిగా, పశ్యన్తీవాక్కు మధ్యమగా, మధ్యమావాక్కు వైఖరిగా వివర్తమగు చున్నది. ప్రణవమే (సూక్ష్మరూపమగు నాదము) వ్యానోదానములచే అభివ్యక్తమై వైఖరీ రూపమును పొందుచున్నదని తాత్పర్యము. పరావాక్కు వర్ణాది విశేషరాహిత్యముచే అవ్యక్తము. లోకవ్యవహారాతీతము పశ్యన్తీ వాక్కు. కాని యోగులకు దానియందు కూడా ప్రకృతి ప్రత్యయ జ్ఞానము కలదు. కనుక పశ్యన్తీ - మధ్యమా - వైఖరీ వాక్కులు మూడే వ్యాకరణ శాస్త్రముచే సంస్కార్యములు. పరావాక్కు సూక్ష్మతమమగు ప్రణవరూపమగు స్వరూపజ్యోతి గనుక సంస్కారయోగ్యము గాదు. భర్తృహరి వాక్యపదీయమున -

స్వరూప జ్యోతిరేవాంతః పరా వాగన పాయినీ।
తస్యాం దృష్ట స్వరూపాయామధికారో నివర్తతే॥

వైఖర్యా మధ్యమాయాశ్చ పశ్యన్త్యా శ్చైతదద్భుతమ్।
అనేక తీర్థ భేదాయాస్త్రయ్యా వాచః పరం పదమ్॥

అని చెప్పెను. అనేక తీర్థభేదాయాః = తీర్థముపాయః। వ్యక్తవర్ణరూపము, అవ్యక్త వర్ణరూపము, సాధుత్వమును పొందినది, సాధుభావమును పొందనది, (వర్ణాంశమున భేదద్వయము, పదాంశమున భేదద్వయము) మరియు ధ్వన్యంశమున దుందుభివేణు వీణాది శబ్దరూపముగ అనేక భేదములు గల త్రివిధమగు వాక్కునకు ఏతత్ = వ్యాకరణము, పరం పదమితి = సంస్కారకమగుట అద్భుతమని సమన్వయము. ఋగ్వేదమంత్రమున వాక్కు యొక్క చాతుర్విధ్యము స్పష్టము.

చత్వారి వాక్పరిమితా పదాని।
తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః।
గుహా త్రీణి నిహితా నేఙ్గయన్తి।
తురీయం వాచో మనుష్యా వదంతి॥

వాచః పరిమితాని = శాస్త్రమందు నిర్ణీతములగు సూక్ష్మతర, సూక్ష్మ, స్థూలతర రూపావస్థలుగల-పరా- పశ్యన్తీ- మధ్యమా - వైఖరీ యని నాలుగు పదములని మనీషిణః = అధ్యాత్మకుశలురు తెలుసుకొనుచున్నారో వాని మధ్యలో మూడు పదములు = అవస్థలు గుహా = మూలాధార, నాభి, హృదయ దేశములయందు నిహితములై నేఙ్గయన్తి = సర్వులకు జ్ఞానవిషయము లగుటలేదు. నాల్గవది మాత్రము మనుష్య వదనమున వ్యక్తమగుచున్నదని ఋగ్భాష్యమున వ్యాఖ్యానింపబడినది.

మూలము :- యుగపదేవ మధ్యమావైఖరీభ్యాం నాద ఉత్పద్యతే। తత్ర మధ్యమానాదోఽర్థవాచకస్ఫోటాత్మక శబ్దవ్యంజకః। వైఖరీనాదో ధ్వనిః సకలజన శ్రోత్రమాత్రగ్రాహ్యో భేర్యాదినాదవన్నిరర్థకః। మధ్యమానాదశ్చ

సూక్ష్మతరః కర్ణపిధానే జపాదౌ సూక్ష్మతరవాయువ్యంగ్యః శబ్దబ్రహ్మరూపస్ఫోట వ్యంజకశ్చ। తాదృశమధ్యమానాదవ్యంగ్యః శబ్దః స్ఫోటాత్మకో బ్రహ్మరూపో నిత్యశ్చ। తదాహ హరిః -

అనాది నిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరమ్।
వివర్తతేఽర్థ భావేన ప్రక్రియా జగతో యతః॥

న చ యద్యప్యేకోఽఖండశ్చ, తథాపి పదం వాక్యం; జపాకుసుమాది లౌహిత్య పీతత్వాది వ్యంజకోపరాగవశాద్ లోహితః పీతః స్ఫటిక ఇతి భానవద్ వర్ణాదివ్యంగ్యః వర్ణరూపః పదరూపో వాక్యరూపశ్చ, యథా చ ముఖే మణి కృపాణ దర్పణ వ్యంజకోపాధివశాద్దైర్ఘ్య వర్తులత్వాది భానం తద్వత్।

తదుక్తమ్ -

పదే న వర్ణా విద్యంతే వాక్యేష్వవయవా న చ।
వాక్యాత్పదానామత్యంతం ప్రవివేకో న కశ్చన॥ ఇతి।

(వాక్యప. 1-73)

వ్యాఖ్యానము :- (ఇచ్చట వాక్యపదీయము, లఘుమంజూషలతో విరోధమున్నది. అయినను యథాతథముగ ననువదించి విశేషములలో స్ఫోట తత్త్వమును వివరించెదను.)

మధ్యమా వైఖరీ వాక్కులచే ఏకకాలమందు నాదము పుట్టును. వానిలో మధ్యమా నాదము అర్థమునకు వాచకమగు స్ఫోటాత్మక శబ్దమునకు వ్యంజకము. పరశ్రోత్రగ్రహణయోగ్యమగు వైఖరీనాదము భేర్యాది నాదమువలె నిరర్థకము. మధ్యమానాదము మిక్కిలి సూక్ష్మమయినది. ఇది చెవులు మూసుకొనినపుడును, జపాదులయందును సూక్ష్మతరవాయువుచే వ్యక్తమై అర్థబోధకమగు స్ఫోటకు వ్యంజకమగును. ఈ విధముగ

మధ్యమానాదముచే వ్యంగ్యమగు స్ఫోటాత్మకమగు శబ్దము బ్రహ్మరూపము నిత్యము. భర్తృహరి కారిక, ముందు వివరింప బడినది.

స్ఫోటాత్మక శబ్దము ఏకత్వవిశిష్టము మరియు అఖండము. అనగా నిరవయవము. అయినప్పటికి పదస్ఫోట, వాక్యస్ఫోటలుగ వ్యవహరింపబడుచున్నది. కారణమేమన - స్ఫటికమణి మిక్కిలి స్వచ్ఛముగ నున్నను జపాకుసుమాది సాన్నిధ్యముచే వాటి రంగు స్ఫటికమందు ప్రతిబింబించుటచే 'స్ఫటిక మణి ఎఱుపు, పసుపు' అను వ్యవహారము కలుగుచున్నది. వాస్తవికముగ మణియందట్టి ధర్మములు లేకపోయినను రక్త పీతాది వర్ణ ప్రకాశమగు వస్తు సంబంధముచే వాటి ధర్మములు మణియందు భాసించుచున్నవి. ఒకే ముఖము (వాస్తవికముగ ఆకార భేదము లేకపోయినప్పటికి) మణి, ఖడ్గము, అద్దము మున్నగు వాని యందు దీర్ఘముగ, వర్తులాకారముగ భిన్నభిన్న ఆకారములతో భాసించుచున్నది. అట్లే వాస్తవికముగ స్ఫోట నిరవయవము భేదరహితము అయినప్పటికి స్ఫోటాభివ్యంజకములగు వర్ణపదాదుల ధర్మములు దాని యందు భాసించుటచే వర్ణస్ఫోట, పదస్ఫోట మున్నగు భేదములంగీకరింప-బడుచున్నవి, అనగా వ్యంజకగత ధర్మారోపముచే స్ఫోటకు భేదముగాని వాస్తవికభేదము లేదు. ఈ విషయమునే భర్తృహరి 'పదే న వర్ణా విద్యంతే' అను కారికలో పేర్కొనినాడు. సుబంత తిజంత పదములయందు వర్ణవిభాగము అనగా ప్రకృతి ప్రత్యయ విభాగము, వర్ణములయందు అవయవ విభాగము అవాస్తవికము. అట్లే వాక్యమందు పదవిభాగము కూడా అవాస్తవికమే. ఉపాధివశముచే ఒకే ముఖాకృతి మణిదర్పణాదులయందు భిన్నభిన్నముగ కనిపించుచున్నదో అట్లే అఖండమగు స్ఫోట వ్యంజకధర్మములనాశ్రయించి భిన్న భిన్నముగ పదవాక్యభేదముచే గోచరించు చున్నది. అనగా అఖండ వాక్యస్ఫోట మాత్రమే సిద్ధాంత సిద్ధము.

ప్రక్రియా నిర్వాహము కొఱకు ప్రకృతి ప్రత్యయాది విభాగము శాస్త్రకారులచే కల్పించబడినది. అసత్యములగు వర్ణపదాదులను తెలుసుకొనిన సత్యమగు స్ఫోటను పొందుటకు మార్గము సుగమమగును. కనుకనే శాస్త్రకారులు -

ఉపాయాః శిక్షమాణానాం బాలానాముపలాలనాః ।
అసత్యే వర్త్మని స్థిత్వా తతస్సత్యం సమీహతే ॥

అని చెప్పుచున్నారు.

మూలము :- కించ వ్యంజకధ్వనిగతం కత్వగత్వాదికం స్ఫోటే భాసతే। బింబగత ధర్మ వైశిష్ట్యేనైవ ప్రతిబింబస్య లోకే అవధారణాద్ వ్యంజకరూపితస్యైవ స్ఫటికాదేర్భానాచ్చ। యథా చైకస్యాకాశస్య ఘటాకాశో మఠాకాశ ఇత్యౌపాధికో భేదః, యథా చైకస్యైక చేతనస్యౌపాధికో జీవేశ్వరభేదః జీవానాం చ పరస్పరం భేదః, ఏవం స్ఫోటే వ్యంజకధ్వనిగత కత్వాదిభానాత్ కకారో బుద్ధ ఇత్యౌపాధికో భేద వ్యవహారః।

ఔపాధికో భేద ఇత్యత్రోపాధిః ఘట కత్వాదిర్భిన్న ఉపాధేయస్తు ఆకాశ స్ఫోటాదిరేక ఏవేతి తాత్పర్యమ్ । పదవాక్యయోస్సఖండత్వపక్షే త్వంతిమవర్ణవ్యంగ్యః స్ఫోట ఏక ఏవ। పూర్వ పూర్వ వర్ణాస్తు తాత్పర్య గ్రాహకాః। న్యాయనయే చిత్రగురిత్యాదౌ చిత్రాదిపదవత్।

వ్యాఖ్యానము :- వైఖరీ రూప ప్రాకృత ధ్వనిచే స్ఫోట వ్యంగ్యమగును గాన వ్యంజకమగు ప్రాకృత ధ్వనిగత కత్వ గత్వాది ధర్మములు వ్యంగ్యమగు స్ఫోటయందు భాసించుచున్నవి. బింబగత ధర్మములు ప్రతిబింబమందు భాసించుట లోకసిద్ధమే. ( బింబగత ధర్మములతో కూడినదై ప్రతిబింబము లోకమున అవధారణ చేయబడుచున్నది) రంగురంగుల వస్తువుల సాన్నిధ్యముచే నాటి వాటి ధర్మములతో గూడి స్ఫటికాదులు ఆయా

రంగులు కలిగియున్నట్లు భాసించుచున్నవి. ఆకాశము (శూన్యము) ఏకము అఖండమయినను ఘటము, మఠము మున్నగు ఉపాధుల భేదముచే ఘటాకాశము మఠాకాశము' అను రీతిని ఆకాశమునకు భేదము కలుగుచున్నది. చైతన్యము (ఆత్మ) ఒక్కటే అయినను ఉపాధి భేదముచే జీవేశ్వర భేదము, జీవులకు పరస్పర భేదము సిద్ధించు చున్నది. ఈ విధముగ ప్రకృతమున స్ఫోట ఏకము, నిరవయవమయినప్పటికి కత్వగత్వాద్యుపాధిభేదముచే ఉపాధేయముగు స్ఫోటకు వర్ణపదాది భేదములంగీకరింపబడుచున్నవి. కనుక స్ఫోట అఖండమను పక్షమున ఒక్కొక్క వర్ణముచే స్ఫోట అభివ్యక్తమయినను అంత్య వర్ణముచే నభివ్యక్తమగు స్ఫోటయే స్పష్టముగ నర్థబోధను కలుగ జేయును. సఖండత్వ పక్షమున అంతిమ వర్ణ వ్యంగ్యమగు స్ఫోట ఒక్కటే. పూర్వ పూర్వ వర్ణములు తాత్పర్య గ్రాహకములు. ఈ పక్షమున అంతిమ వర్ణము మాత్రమే స్ఫోట వ్యంజకము, పూర్వ పూర్వ వర్ణములు తాత్పర్య గ్రాహకములగుటచే వానికి వైయర్థ్యము లేదు.

వైయాకరణులు సమాసాది వృత్తుల యందు విశిష్టశక్తి నంగీకరింతురు. సమాసాదుల యందు ఏకార్థీభావ సామర్థ్యము, వాక్యమందు వ్యపేక్షా సామర్థ్యమని వీరి యభిప్రాయము. ఏకార్థీభావ సామర్థ్యము నంగీకరింపని నైయాయికులు వైయాకరణుల విశిష్టశక్తి వాదమును నిరసింతురు. సమాసమందు విశిష్ట శక్తి నంగీకరింపక వీరు లక్షణా వృత్తి నాశ్రయించు చున్నారు. చిత్రాః గావః యస్యసః 'చిత్రగుః' అను బహువ్రీహి సమాసమున ఉత్తర పదమగు గోశబ్దమునకు చిత్రాభిన్న గోస్వామియందు లక్షణ. పూర్వపదము తాత్పర్యగ్రాహకము కనుక సమాసమున విశిష్ట శక్తి యవసరము లేదు. నైయాయికమతమున 'చిత్రగుః' మున్నగు స్థలములలో పూర్వపదమునకు తాత్పర్య గ్రాహకత్వ

ఘుంగీకరించినట్లు, పద వాక్యములకు సఖండత్వమంగీకరించువారి మతమున కూడా అంతిమ వర్ణముచే వ్యంగ్యముగు స్ఫోట వాచకము. పూర్వ పూర్వ వర్ణములు తాత్పర్య గ్రాహకములు.

మూలము :- ధ్వనిస్తు ద్వివిధః ప్రాకృతో వైకృతశ్చ । ప్రకృత్యాఽర్థబోధనేచ్ఛయా స్వభావేన వా జాతః స్ఫోటవ్యంజకః ప్రథమః ప్రాకృతః। తస్మాత్ ప్రాకృతాజ్జాతో వికృతి విశిష్టశ్చిరస్థాయీ నివర్తకో వైకృతికః। హరిరప్యాహ -

స్ఫోటస్య గ్రహణే హేతుః ప్రాకృతో ధ్వనిరిష్యతే।
శబ్దస్యోర్ధ్వమభివ్యక్తేర్వృత్తి భేదే తు వైకృతాః।
ధ్వనయః సముపోహంతే స్ఫోటాత్మా తైర్న భిద్యతే॥
(వాక్యప. 1-77) ఇతి॥

శబ్దస్యాభివ్యక్తే రూర్ధ్వం వైకృతా ధ్వనయో జాయంతే ఇతి శేషః। వృత్తి భేద ఇతి।

అభ్యాసార్థే ద్రుతా వృత్తిర్మధ్యా వై చింతనే స్మృతా।
శిష్యాణాముపదేశార్థం వృత్తిరిష్టా విలంబితా॥ ఇతి

తిసృషు వృత్తిషు సముపోహంతే = కారణాని భవంతి స్ఫోటస్తు తైర్న భిద్యత ఇతి తదర్థః।

వ్యాఖ్యానము :- స్ఫోటాభివ్యంజకమగు ధ్వని స్వరూపమును నిరూపించుచున్నాడు. ప్రాకృత వైకృత భేదముచే ధ్వని రెండు విధములు. ప్రకృత్యా = అర్థబోధను కలిగించవలెనను ఇచ్ఛతో లేక స్వాభావికముగ పుట్టినదియు, మరియు స్ఫోటకు వ్యంజకమగు ధ్వని ప్రాకృత ధ్వని యనబడును. ప్రాకృత ధ్వని వలన పుట్టునది, వక్త యొక్క ఆలస్యాది దోషములతో కూడినది (వికృతి విశిష్టము), ఇతర ధ్వనుల కంటె

చిరకాలముండునది, అన్య వైకృత ధ్వని నివర్తకమగు ధ్వని వైకృతధ్వని. ఇది వక్త యొక్క ఆలస్యాది దోషములచే పుట్టునది గనుక దీనికి వైకృత ధ్వనియని పేరు. ఈ సందర్భమున వాక్యపదీయకారుని ప్రమాణముగ చూపుచున్నాడు. అర్థ బోధకమగు స్ఫోటరూప శబ్దమును వ్యక్తము చేయుటలో ప్రాకృత ధ్వని కారణముగ చెప్పబడుచున్నది. స్ఫోటాత్మక శబ్దమభివ్యక్తమయిన పిదప పుట్టునవి వైకృత ధ్వనులు. ఇవి ద్రుతా - మధ్యమా - విలంబితా యను వృత్తిభేదమునకు కారణములగుచున్నవి. స్ఫోటకనంతర కాలమందు పుట్టిన వైకృతధ్వనులచే స్ఫోటకు ఎట్టి భేదము కలుగదు. వృత్తి భేదములు :-

అభ్యాసార్థము = గ్రంథాదులను పునః పునః అధ్యయనము చేయుటకు ఆశ్రయింపబడు శీఘ్రోచ్చారణ రూపమగు వ్యాపారము 'ద్రుతా' యనబడును. చింతనమందు మధ్యావృత్తి, శిష్యులకుపదేశించుటయందు విలంబితావృత్తి అభీప్సితము.

**విశేషము** :- ప్రాకృతధ్వని- స్ఫోట- వైకృతధ్వని అని క్రమము. ప్రాకృతధ్వని వలన వ్యంగ్యమగు స్ఫోట అర్థబోధకము. తదుత్తరకాలమందు పుట్టునది వైకృతధ్వని. ద్రుతాదివృత్తి భేదమునకు వైకృతధ్వనులు కారణము. ప్రాకృతధ్వన్యవహితోత్తరకాలమందు వ్యంగ్యమగు స్ఫోట యందు వ్యంజక ప్రాకృతధ్వని గత హ్రస్వత్వదీర్ఘత్వాది ధర్మములు ఆరోపించబడుచున్నవి. వైకృత ధ్వని స్ఫోటాత్మక శబ్దమును చిరకాలపర్యంతము గోచరింపజేయుటలో సహకరించుచున్నది. స్ఫోటాభివ్యక్త్యనంతరకాలమందు పుట్టిన వైకృత ధ్వని యొక్క ధర్మములు స్ఫోటయందారోపించుటకవకాశము లేదు. కనుక వైకృత ధ్వని భేదముచే స్ఫోటకు భేదము లేదు.

మూలము :- అత్రేదం బోధ్యమ్ - కేనచిత్ ఘటమానయేతి వైఖరీనాదః ప్రయుక్తః, స కేనచిచ్ఛ్రోత్రేన్ద్రియేణ గృహీతః స నాద ఇంద్రియ ద్వారా బుద్ధిహృద్గతస్సన్ అర్థబోధకం శబ్దం స్వనిష్ఠకత్వాదినా వ్యంజయతి తస్మాదర్థబోధః । స్ఫుటత్యర్థోఽస్మాదితి వ్యుత్పత్త్యా స్ఫోటః । ఉచ్చారయితుస్తు యుగపదేవ మధ్యమావైఖరీభ్యాం నాద ఉత్పద్యతే, తత్ర వైఖరీనాదో వహ్న్యేదేః ఫూత్కారాదివన్మధ్యమానాదోత్సాహకః, మధ్యమానాదః స్ఫోటం వ్యంజయతీతి శీఘ్రమేవ తతోఽర్థబోధః, పరస్య విలంబేనానుభవసిద్ధత్వాత్ । అత ఏవ "శ్రోత్రోపలబ్ధిర్బుద్ధి నిర్గ్రాహ్యః ప్రయోగేణాభిజ్వలిత ఆకాశదేశః శబ్ద" ఇత్యాకరగ్రంథస్సంగచ్ఛతే। కత్వాదినా శ్రోత్రోపలబ్ధిత్వం స్ఫోటాత్మక పదాది రూపేణ తు బుద్ధినిర్గ్రాహ్యత్వమ్, స చ ప్రయోగేణ వైఖరీ రూపేణాభిజ్వలితః స్వరూప రూషితః కృత ఇతి తదర్థః । తత్రాపి శక్యత్వస్యేవ శక్తతావచ్ఛేదికాయా వర్ణపద వాక్యనిష్ఠజాతేర్వాచకత్వమ్। తదుక్తమ్ -

అనేకవ్యక్త్యభివ్యంగ్యా జాతిః స్ఫోట ఇతి స్మృతా।

(వాక్యప. 1-93) ఇతి।

తస్మాదష్టవిధస్ఫోటాత్మకశ్శబ్దో వృత్త్యాశ్రయః । వస్తుతస్తు వాక్యస్ఫోటో వాక్యజాతిస్ఫోట ఏవ వా వృత్త్యాశ్రయః । తత ఏవ లోకేఽర్థబోధ ఇత్యాద్యుక్తత్వాదితి సర్వం సుస్థమ్।

ఇతి స్ఫోటనిరూపణమ్।

వ్యాఖ్యానము :- 'అత్రేదం బోధ్యమ్' అనుగ్రంథముచే స్ఫోటాత్మక శబ్దమర్థబోధకమెట్లగునో నిరూపించుచున్నాడు - తన యభిప్రాయమును ప్రకటించవలెనని యిచ్ఛకలిగిన వక్త 'ఘటమును తీసుకుని రమ్ము' అని వైఖరీ నాదమును ప్రకటించును. (ఉచ్చరించును) శ్రోత శ్రవణేంద్రియము ద్వారా వక్త ప్రయోగించిన శబ్దమును వినును. అనగా శబ్ద జ్ఞాన మతనికి

కలుగును. పిమ్మట వైఖరీధ్వని శ్రవణేంద్రియము ద్వారా బుద్ధిని, హృదయదేశమును ప్రవేశించి (అంతఃకరణము యొక్క నిశ్చయాత్మకవృత్తిబుద్ధి, స్మరణాత్మకవృత్తి హృదయము లేక చిత్తము) తన యందలి = వైఖరీ ధ్వనియందలి కత్వగత్వాది ధర్మములతో గూడిన మధ్యమానాదవ్యంగ్యమగు స్ఫోటాత్మక శబ్దమును వ్యక్తము చేయును. (వస్తుతః స్ఫోటయందు ఎట్టి ధర్మములు లేవు). అదియే అర్థబోధకము. దేని వలన అర్థబోధ కలుగునో దానికి స్ఫోటయని పేరు. అనగా మధ్యమావాక్కు స్ఫోటగా వ్యవహరింపబడుచున్నది. ఈ విధముగ శ్రోతకు వైఖరీనాదముచే అభివ్యక్తమయిన స్ఫోటవలన అర్థబోధ కలుగుచున్నది. ఇక వక్తకు ఏకకాలమందు మధ్యమావైఖరులచే నాదముత్పన్నమగును. ఈ రెండిటిలో వైఖరీ నాదము ఫూత్కారముచే అగ్నిని ప్రజ్వలింపజేసినట్లు స్ఫోటాభివ్యంజకమగు మధ్యమానాదమును ప్రేరేపించును. ఇట్లు వైఖరీనాదముచే ప్రేరేపింపబడిన మధ్యమానాదము స్ఫోటను అభివ్యక్తము చేయును. ఇట్లు వక్తకు శీఘ్రాతిశీఘ్రముగ అర్థబోధకలుగగ, శ్రోతకు వక్త్రపేక్షయా ఈషద్విలంబేన అర్థబోధ కలుగుచున్నది. అనగా ఏకకాలమందే వక్తకు మధ్యమావైఖరీనాదములు పుట్టుటచే త్వరితగతిని అర్థబోధ కలుగును. శ్రోతకు మొదట వైఖరీనాదమును వినుట ద్వారా, అది బుద్ధి హృదయదేశములను ప్రవేశించి మధ్యమానాదవ్యంగ్యమగు స్ఫోటను వ్యక్తము చేయుటచే కొంత ఆలస్యముగ అర్థజ్ఞానము కలుగును. ఈ విధముగ చెప్పుట వలన (శ్రోత్రే ఉపలబ్ధిః = ప్రాపణం యస్యసః శ్రోత్రోపలబ్ధిః) శ్రోత్రేంద్రియమును పొందింపబడునది, బుద్ధిచే గ్రహింపబడునది మరియు ఉచ్చారణముచే అభివ్యక్తమగునదియునగు ఆకాశస్థానీయము శబ్దము' అను అ ఇ ఉ ణ్ సూత్రస్థభాష్యము సంగతమగుచున్నది. ఆకాశదేశమగు శబ్దము కత్వగత్వాది ధర్మములతో గూడి శ్రోత్రేంద్రియముచే గ్రహింపబడుచున్నది. స్ఫోటాత్మకశబ్దరూ[illegible]మున

బుద్ధిచే గ్రహింపబడుచున్నది. బుద్ధిగ్రాహ్యమగు స్ఫోటాత్మక శబ్దము వైఖరీరూపముతో రూషితమగుచున్నది. అనగా వైఖరీవాక్కు యొక్క కత్వగత్వాది ధర్మములు స్ఫోటయందు భాసించుచున్నవని భాష్య తాత్పర్యము. వ్యక్తియందు శక్తిని స్వీకరించిన అనేక వ్యక్తి శక్తికల్పనా ప్రయుక్త గౌరవము గాన తత్పరిహారము కొఱకై జాతిశక్తి వాదము నంగీకరింతురు. అనగా శక్యము = వాచ్యము జాతి. శక్తములు వర్ణపదవాక్యములు. తద్గత వర్ణత్వ పదత్వాది జాతులు శక్తతావచ్ఛేదకములు. జాతికి శక్యత్వమంగీకరించినట్లు శక్తతావచ్ఛేదకమగు వర్ణ పదాది గతజాతికి మాత్రమే వాచకత్వమంగీకరింపవలెను. వ్యక్తికి కాదు.

''అనేక వర్ణపదవ్యక్తులచే అభివ్యక్తమగు జాతి స్ఫోట'' అని జాతిస్ఫోటకు వాచకత్వము భర్తృహరిచే పేర్కొనబడినది. ఈ విధముగా శక్యము జాతి, మరియు శక్తతావచ్ఛేదకములగు ఘటపదత్వాదిజాతులు వాచకములని సిద్ధించినది. వర్ణవ్యక్తిస్ఫోట, పదవ్యక్తిస్ఫోట, వాక్యవ్యక్తిస్ఫోట, వర్ణజాతిస్ఫోట, పదజాతిస్ఫోట, వాక్యజాతిస్ఫోట, అఖండపదస్ఫోట, అఖండవాక్యస్ఫోట అని ఎనిమిది విధములగు స్ఫోటాత్మక శబ్దము వృత్తికి ఆశ్రయము. వస్తుతః వాక్యజ్ఞానము వలన అర్థ బోధలోకానుభవసిద్ధమగుటచే వాక్యస్ఫోట లేక వాక్యజాతి స్ఫోట వృత్త్యాశ్రయమగు శబ్దముగ తెలుసుకొనవలెను.

**విశేషము** :- స్ఫోటను గూర్చి మరికొంత వివరించెదను. పరా, పశ్యన్త్యాదివాగ్భేదములలో పరా మరియు పశ్యన్తి రెండును యోగి జ్ఞాన విషయములు. విమర్శకము, విమృశ్యమని మధ్యమానాదాంశములు రెండు. విమృశ్యమగు అర్థమునకు వాచ్యత్వము చెప్పబడినది. విమర్శకమగు శబ్దరూపాంశము స్ఫోటగా వ్యవహరింపబడుచున్నది. ఇదియే వాచకము. సముదాయ ఘటకమగు ప్రత్యేకవర్ణముచే స్ఫోటరూపమగు

మధ్యమానాదాంశమభివ్యక్తమయినను దాని వలన అర్థబోధకలుగదు. పూర్వపూర్వ వర్ణానుభవ జనిత సంస్కార సహకృతమగు అంత్యవర్ణబుద్ధిచే అభివ్యక్తమగు స్ఫోట మాత్రమే అర్థబోధ హేతువు.

స్ఫోటకు వ్యంజకమగు వైఖరీధ్వని రూపము మధ్యమా వాక్కు యొక్క నాదాంశమందు ప్రతిబింబించుట వలన ధ్వనిరూపముతో వ్యాప్తమై స్ఫోట వ్యంగ్యమగుచున్నది, కనుకనే స్ఫోట అఖండమయినను తద్వ్యంజకమగు ధ్వని వర్ణపదాదిభేదముచే భిన్నభిన్నమగుటచే స్ఫోటకూడా భిన్నభిన్నమని ఆభాస కలుగుచున్నది. ఈ విషయము వాక్యపదీయమున భర్తృహరిచే

**యథా మణికృపాణాదౌ రూపమేకమనేకధా ।**
**తథైవ ధ్వనిషు స్ఫోట ఏక ఏవ విభిద్యతే ॥**

అని చెప్పబడినది.

సందర్భవశమున ఆయా పదార్థముల అనుభవము ( జ్ఞానము) కలిగి, శబ్ద, బుద్ధి, కర్మలు ద్విక్షణావస్థాయులగుటచే జ్ఞానము నష్టమయినను తత్తత్పదార్థ సంస్కారములు అంతఃకరణమందు స్థిరముగ నుండును. వైఖరీ ధ్వని శ్రవణముచే అవి ఉద్బుద్ధములై ధ్వని యొక్క ప్రతిబింబ సమర్పణమందు సహకరించుచున్నవి. అనగా వ్యంగ్యమగు స్ఫోటాత్మక నాదాంశమందు ధ్వనియొక్క ప్రతిబింబమునాపాదించునవి ప్రాగుక్త సంస్కారములే. సంస్కారములు స్థిరములయినను అవి ఉద్బుద్ధములు కానప్పుడు ప్రతిబింబనములేకపోవుటచే అర్థబోధకలుగదు. ఏ వర్ణానుపూర్వితో అంతఃకరణమందు సంస్కారములు కలుగుచున్నవో అదే క్రమముతో ధ్వనిరూప వ్యంజకముచే స్ఫోట అభివ్యాప్తమగుటచే సరః- రసః, నదీ - దీనః మున్నగు స్థలములలో అభేద సంభావన లేదు. ఘటాది స్ఫోటబోధ్యమగు ఘటాద్యర్థాకారవృత్తి ( అర్థాకార వృత్తి వలన

అర్థబోధ కలుగును. ) తత్ప్రతిబింబనాశకమగుటచే స్ఫోట అభివ్యక్తమయి ఎల్ల వేళలందు అర్థబోధ కలుగునను ఆపత్తిలేదు. హృదయ దేశమందభివ్యక్తమగుటచే ఆంతరమగు స్ఫోట తత్త్వము శ్రోత్రేంద్రియముచే గ్రహింపబడు వైఖరీ వాక్కుచే సంస్కరింపబడిన అంతకరణముచే (స్ఫోట) గ్రహింపబడును. అనగా మానస ప్రత్యక్షవిషయము. ధ్వని రూప వ్యంజకముతో వ్యాప్తమైన స్ఫోట శబ్దమునకు తత్తదర్థములయందు శక్తి యని శక్తిజ్ఞానము కలుగుచున్నది. కనుక అప్రసిద్ధపద శ్రవణము వలన శక్తి జ్ఞానము లేకపోవుటచే అర్థబోధ కలుగదు.

(1) ప్రాణాది రూపమగు వాయువు యొక్క పరిణామము,

(2) శబ్ద తన్మాత్రాది రూప పరమాణువుల పరిణామము,

(3) వక్తృజ్ఞానము యొక్క పరిణామము వైఖరీ వాక్కుయని భిన్న భిన్న మతములు కనిపించుచున్నవని భర్తృహరి పేర్కొనెను.

వాయోరణూనాం జ్ఞానస్య శబ్దత్వాపత్తిరిష్యతే।
కైశ్చిద్దర్శన భేదోఽత్ర ప్రవాదేష్వనవస్థితః॥

(వాక్యప. 1-107) అని

ఆత్మా బుద్ధ్యా సమేత్యార్థాన్ మనో యుఙ్క్తే వివక్షయా।
మనః కాయాగ్నిమాహన్తి స ప్రేరయతి మారుతమ్॥
సోదీర్ణో మూర్ధ్న్యభిహతో వక్త్రమాపద్య మారుతః।
వర్ణాన్ జనయతే।

(పాణినీయ శిక్ష)

''ఆత్మా = అంతఃకరణము సంస్కారరూపముగ తనయందుండిన అర్థములను బుద్ధ్యా = స్వవృత్తిచే, సమేత్య = ఏక బుద్ధి విషయములుగా చేసుకొని మనస్సుతో కలియును. స్వగతములగు నర్థములను వ్యక్తము

చేయవలెనను ఇచ్ఛకల్గిన మనస్సుచే జఠరాగ్నికి ఆఘాతము కలుగును. ఆహతమగు కాయాగ్నిచే ప్రేరితమగు వాయువు మూర్ధ దేశమునకు చేరి క్రిందికి మరలి ముఖదేశమందలి అవయవములను జేరి పరాదిరూపమునన్న శబ్దమును వైఖరీ వాక్కుగ వ్యక్తము జేయునని శిక్షావాక్యమునకర్థము.

నాదము చిదచిత్తుల మిశ్రమము. మధ్యమా వాక్కు నందు నాదాంశమగు శబ్దము స్ఫోటగా వ్యవహరింపబడుచున్నది. స్ఫుటతి అర్థః యస్మాత్ సః స్ఫోటః స్ఫుట్యతే = ధ్వనిభిః వ్యజ్యత ఇతి స్ఫోటః'

లఘుమంజూష కుంజికా టీకాకారులు ''అయం భావః - స్ఫోటో ద్వివిధః ఆభ్యంతరో బాహ్యశ్చ । తత్రాభ్యంతరో బుద్ధ్యనుసంహృతిరూపః । బాహ్యస్తు జాతివ్యక్తి భేదాద్ ద్వివిధః । సంఘాతవర్తినో జాతిరేవ వాచికేత్యాద్యః । ఏకోఽనవయవః శబ్ద ఇతి వ్యక్తిస్ఫోటః'' అని స్ఫోటకు ఆభ్యంతరము, బాహ్యమని రెండు భేదములు చూపి నాగేశుడు, భర్తృహరి ఇరువురు చూపిన స్ఫోట స్వరూపమున సమన్వయ మార్గమునకు పునాది వేసెను.

నాగేశభట్టు (అయఞ్చ ఆంతరత్వాత్ శ్రోత్రగ్రాహ్య వైఖరీ సంస్కృతాంతఃకరణ గ్రాహ్య ఏవ'') స్ఫోటను ఆంతరము గనుక మధ్యమానాదముచే వ్యంగ్యము మరియు అంతఃకరణ గ్రాహ్యముగ పేర్కొనెను.

భర్తృహరి -

స్ఫోటస్య గ్రహణే హేతుః ప్రాకృతో ధ్వని రిష్యతే ।
వృత్తిభేదే నిమిత్తత్వం వైకృతః ప్రతిపద్యతే ॥

మున్నగు కారికలచే స్ఫోటను వైఖరీవాక్కుచే అభివ్యంగ్యము మరియు పరశ్రోత్ర గ్రాహ్యమని చెప్పుచు బాహ్యముగ సూచించెను. వైఖరీ వాక్కుచే

వక్తకు శ్రోతకు స్ఫోట అభివ్యక్తమగును. మధ్యమానాదమును వక్త మాత్రమే వినగలడు. కనుక మధ్యమానాదముచే హృదయదేశమందు వ్యంగ్యమగు బుద్ధిగ్రాహ్యమగు స్ఫోట ఆంతరము. ఇది వక్తృదృష్ట్యా చెప్పబడినది. శ్రోతకు వైఖరీ ధ్వని వినుట వలన దానిచే హృదయ దేశమునకు బయట ముఖదేశమందు వ్యంగ్యమగు స్ఫోట బాహ్యమగును.

విశేష విచారము కొఱకు వైయాకరణ సిద్ధాన్త లఘుమంజూషను చూడవలెను.

## స్ఫోటనిరూపణము సమాప్తము

## అథ శాబ్దబోధ సహకారికారణనిరూపణమ్

మూలము :- అథ శాబ్దబోధ సహకారికారణాని ఆకాంక్షా యోగ్యతా- ఆసత్తి-తాత్పర్యాణి। వాక్య సమయగ్రాహికా ఆకాంక్షా। సా చైక పదార్థజ్ఞానే తదర్థాన్వయ యోగ్యార్థస్య యజ్ఞానం తద్విషయేచ్ఛా 'అస్యాన్వయ్య ర్థః కః। ఇత్యేవం రూపా పురుషనిష్ఠైవ, తథాపి తస్యాః స్వవిషయేఽర్థే ఆరోపః। అయమర్థోఽర్థాన్తర మాకాంక్షతీతి వ్యవహారాత్। ఇదమేవాభిధానా పర్యవసానముచ్యతే। పదే తు నారోపః, అర్థబోధోత్తరమేవాకాంక్షోదయాత్। పదం సాకాంక్షమితి తు సాకాంక్షార్థ బోధక మిత్యర్థకమ్। తదుక్తం 'సమర్థః పదవిధిః' ఇతి సూత్రే భాష్యే (2-1-1) - ''పరస్పరవ్యపేక్షాం సామర్థ్యమేకే। కా పునశ్శబ్దయోర్వ్యపేక్షా ? న బ్రూమశ్శబ్దయోరితి। కిం తర్హి ? అర్థయోరితి।''

ఈదృశ జిజ్ఞాసోత్థాపకం చైక పదార్థేఽపర పదార్థ వ్యతిరేక ప్రయుక్త స్యాన్వయ బోధాజనకత్వస్య జ్ఞానమితి తద్విషయే తాదృశాన్వయ- బోధాజనకత్వేఽప్యాకాంక్షేతి వ్యవహారః।

వ్యాఖ్యానము :- వృత్తి విశిష్ట జ్ఞానము శాబ్దబోధకు కారణమని,

వృత్త్యాశ్రయమగు శబ్దము స్ఫోటయని నిరూపించబడినది. ఇప్పుడు శాబ్దబోధకు సహకారి కారణములు నిరూపించబడుచున్నవి. ఆకాంక్ష, యోగ్యత, ఆసత్తి, తాత్పర్యమని శాబ్దబోధ సహకారికారణములు నాలుగు. ముఖ్య, సహకారిభేదముచే కారణము భిన్నభిన్నము. అందు ముఖ్యకారణము కంటె భిన్నమై, ముఖ్యకారణముచే కలుగు కార్యమును పుట్టించునవి సహకారికారణములనబడును. శాబ్దబోధయనగా వాక్యార్థజ్ఞానము. దీనికి వృత్తిజ్ఞానము ముఖ్యకారణము. ఆకాంక్షాదులు సహకారికారణములు. వాక్యసమయగ్రాహకము ఆకాంక్ష. సమయ మనగా సంకేతము. వాక్య సంబంధ్ధమగు సంకేతము యొక్క బోధకు కారణము ఆకాంక్షయని యర్థము. అనగా దేనివలన వాక్య సంకేత విషయక జ్ఞానము కలుగునో దానినాకాంక్ష యందురు. ఆకాంక్ష వాక్యసంకేత గ్రాహకము ఎట్లగునో చెప్పుటకు ఆకాంక్షా స్వరూపమును నిరూపించుచున్నాడు.

ఏదేని పదము యొక్క అర్థజ్ఞానము కలిగిన పిమ్మట, ఇది యన్వయించు మరియొక యర్థమేదను అర్థజ్ఞాన విషయక ఇచ్ఛనే ఆకాంక్షయందురు. ఘట పటాది పదార్థజ్ఞానానంతరము దాని కన్వయ యోగ్యమగు ఆనయనాది పదార్థ జిజ్ఞాస కలుగును. అనగా పద సముదాయ రూపమగు వాక్యమున ఒక పదమున కర్థము తెలియ బడిన పిమ్మట, జ్ఞాతమగు పదార్థమున కన్వయ యోగ్యమగు పదార్థాంతరజిజ్ఞాసయే ఆకాంక్షయనబడును. ఈ విధముగ యీ యర్థమున కన్వయ యోగ్యమగు అర్థాంతరమేదను జిజ్ఞాసారూపమగు నాకాంక్ష పురుష నిష్ఠమైనను, విషయంతా సంబంధవుుచే ఆకాంక్ష అర్థవుందుండుటచే ఆకాంక్షావిషయమగు నర్థమందు కూడా ఆరోపించబడుచున్నది. అనగా ఆకాంక్ష పురుష నిష్ఠమనుట ముఖ్యము; అర్థమందు గౌణము. అభిధానము= అర్థోపస్థితి యొక్క అపర్యవసానము = అపరి సమాప్తి అనగా

అర్థబోధనము సమాప్తము కాకుండుట ఆకాంక్షయను వృద్ధ వచనము కూడా ఆకాంక్ష నర్థమందారోపించుటలో కారణమగుచున్నది. కనుకనే ఈ యర్థమర్థాంతర మునాకాంక్షించుచున్న' దను వ్యవహారముపపన్న మగుచున్నది. పై యుక్తులచే ఆకాంక్షకర్థ నిష్ఠత్వము సిద్ధించినది. అర్థబోధ కలిగిన పిమ్మటనే దీనికి సంబంధియగు అర్థమేదను జిజ్ఞాస కలుగుటచే ఆకాంక్ష నర్థమందారోపించుటయే యుక్తము. ప్రమాణమేదియు లేకపోవుటచే ఆకాంక్ష నర్థ బోధకమగు పదమందారోపించుట యుక్తము గాదు.

ఆకాంక్షను పదమందారోపించక పోయిన 'సాకాంక్షము పదము' అను వ్యవహారమెట్లు ఉపపన్నమగునను శంకకు సమాధానము చెప్పుచున్నాడు - 'సాకాంక్షము పదము' అను వ్యవహారమునకు 'సాకాంక్షార్థబోధ జనకము పదమ' ని యర్థము. ఇచ్ఛారూపమగు ఆకాంక్ష పురుషనిష్ఠమైనప్పటికి అర్థమందారోపించుటలో సమర్థ సూత్ర భాష్యమును ప్రమాణముగా చూపుచున్నాడు.

సమర్థః పదవిధిః (అష్టాధ్యాయి. 2-1-1) అను సూత్రభాష్యమున ''కొందరు ఆచార్యులు పరస్పరవ్యపేక్షను (ఆకాంక్ష) సామర్థ్యముగా చెప్పుచున్నారు. 'శబ్దములకు పరస్పర వ్యపేక్షఎట్లు కుదురునని' ప్రశ్నించగా పరస్పరాకాంక్ష అర్థములకు కాని శబ్దములకు కాదని సమాధానము. రాజ్ఞః పురుషః అను స్థలమున రాజ పదార్థము 'ఇతడు నావాడను విధముగ పురుష పదార్థమును, అట్లే పురుష పదార్థము 'ఇతడు నా ప్రభువు' అను విధముగ రాజ పదార్థమును అపేక్షించును. ఈ విధముగ మొదట శబ్ద జ్ఞానము, పిమ్మట అర్థ జ్ఞానము, ఆ పైన జిజ్ఞాస కలుగుటచే ఆకాంక్షనర్థమందారోపించుట యుక్తమే. ఘటాది పదార్థములయందు ఆనయనాది పదార్థ విషయక జ్ఞానాభావముచే అన్వయబోధ కలుగక పోవుట

యను జ్ఞానము ప్రాగుక్తజిజ్ఞాసకుత్థాపకము. జిజ్ఞాసోత్థాపకమగు అన్వయబోధాజనకత్వ జ్ఞాన విషయమగు అన్వయబోధాజనకత్వము కూడా ఆకాంక్షగా వ్యవహరింపబడుచున్నవి.

మూలము :- ఉత్థాపకతా విషయతాన్యతర సంబంధేనోభయసంబంధేన వాఽర్థాంతరజిజ్ఞాసా ఆకాంక్షా । ఆద్యమ్ - 'పశ్య మృగో ధావతి' ఇతి, అత్ర దర్శనార్థస్య కారకధావనాకాంక్షోత్థాపకత్వం ధావనం తు తద్విషయ ఏవ । అంత్యం తు 'పచతి తండులం దేవదత్తః' ఇత్యాదౌ, క్రియాకారకయోర్ద్వయోరపి పరస్పరం తదుత్థాపకత్వాత్తద్విషయత్వాచ్చ ।

అత ఏవ ఘటః కర్మత్వమ్ ఆనయనం కృతిరిత్యతో ఘటమానయేతివన్నాన్వయబోధః, ఆకాంక్షా విరహాత్ । ఘటమానయేతి విభక్త్యంతాఖ్యాతాంతయోరేవ సాకాంక్షత్వాచ్చ ।

ఇత్యాకాంక్షా నిరూపణమ్

వ్యాఖ్యానము :- మరియొక విధముగ నాకాంక్షాస్వరూపమును నిరూపించుచున్నాడు యద్వేతి. ఉత్థాపకతా - విషయతా సంబంధములలో ఏదో యొక సంబంధముతో లేక రెండు సంబంధములతో అర్థాంతర జిజ్ఞాస ఆకాంక్ష యనబడును. ఇందు మూడు అంశములు గలవు. (1) ఉత్థాపకత్వ సంబంధముతో (2) విషయత్వ సంబంధముతో లేక (3) ఉభయ సంబంధముతో అర్థాంతర జిజ్ఞాస ఆకాంక్ష. అన్యతర సంబంధముచే అర్థాతర జిజ్ఞాసకుదాహరణ - 'పశ్య మృగో ధావతి'. ఇచ్చట 'పశ్య' = చూడుము అని పలుకగా, దేనిని చూడవలయునని కర్మకారక జిజ్ఞాస కలుగును. దర్శన క్రియతో ధావనమును కర్మకారకమన్వయించును. మృగధావనమును చూడుమని అర్థము. మృగకర్తృకధావనరూపకర్మ యొక్క జిజ్ఞాసకు ఉత్థాపకము పశ్యపదార్థము కనుక ఉత్థాపకతా సంబంధముచే ధావన

రూపకర్మకారక విశిష్టము దర్శనము. అనగా పశ్య పదార్థముచే ధావన రూపకర్మయొక్క జిజ్ఞాస కలుగుటచే దర్శనమందు జిజ్ఞాస యొక్క ఉత్థాపకత్వము కలదు. జిజ్ఞాసలో విషయము ధావనరూపకర్మ కనుక, ధావన రూపకర్మ యందు జిజ్ఞాసావిషయత్వము కలదు. కనుక విషయతా సంబంధముచే దర్శన విశిష్టము ధావనము. ఈ విధముగ 'చూడుమని పలుకగా దేనిని చూడవలెనను కర్మాకాంక్ష కలుగగా మృగధావనము కర్మకారకముగా ఉపస్థితమగుటచే ఉత్థాపకతా సంబంధముచే అర్థాంతర జిజ్ఞాస కలుగుచున్నది. ధావన రూప కర్మయందు జిజ్ఞాసా విషయత్వముండుటచే విషయతా- సంబంధముచే అర్థాంతర జిజ్ఞాస కలుగుచున్నది. ఉత్థాపకతా సంబంధముచే జిజ్ఞాస పశ్య అనుచోట, విషయతా సంబంధముచే మృగోధావతి అనుచోటనుండును. ఉభయ సంబంధముచే అన్యార్థ విషయక జిజ్ఞాసకుదాహరణము 'పచతి తండులం దేవదత్తః'. ఇచట దేవదత్తకర్తృక తండుల కర్మక విక్లిత్త్యనుకూల వ్యాపారమను బోధ కలుగును. ఈ వాక్యమున పచతి అను పాకక్రియ 'దేవదత్తః' అనుకర్తృకారకమును, 'తండులమ్' అను కర్మకారకమును అపేక్షించుచున్నది. అట్లే కారకములు క్రియనపేక్షించుచున్నవి గనుక క్రియ కారకాకాంక్షకు, కారకము క్రియాకాంక్షకు ఉత్థాపకములగుచున్నవి. ఈ విధముగ క్రియాకారకములు రెండును పరస్పరము ఆకాంక్షోత్థాపకములు మరియు ఆకాంక్షా విషయములగుటచే సంబంధద్వయముచే అన్యార్థ విషయక జిజ్ఞాసారూపమగు నాకాంక్ష సిద్ధించుచున్నది.

అర్థాంతర జిజ్ఞాసారూపమగు నాకాంక్షకు శాబ్దబోధ కారణత్వమంగీకరించుటచే 'ఘటమానయ' అను వాక్యమున అర్థాంతర జిజ్ఞాసారూపమగు నాకాంక్షయుండుటచే అన్వయబోధ కలుగునట్లు ఘటః, కర్మత్వమ్, ఆనయనమ్, కృతిః అనుస్థలమున ఆకాంక్ష లేకపోవుటచే శాబ్దబోధ కలుగదు. ఘటమ్, ఆనయ అను విభక్త్యంత,

ఆఖ్యాతప్రత్యయాంతములు సాకాంక్షములు కావు గనుక శాబ్దబోధ కలుగదు.

ఆకాంక్షానిరూపణము సమాప్తము

## అథ యోగ్యతానిరూపణమ్

మూలము :- యోగ్యతా చ పరస్పరాన్వయ ప్రయోజక ధర్మవత్త్వమ్। తేన 'పయసా సిఞ్చతి' ఇతి వాక్యం యోగ్యమ్। అస్తి చ సేకాన్వయ ప్రయోజక ద్రవద్రవ్యత్వయోగ్యతా జలే, కరణత్వేన జలాన్వయ ప్రయోజకార్ద్రీకరణత్వ-యోగ్యతా సేకక్రియాయామ్।

అత ఏవ 'వహ్నినా సిఞ్చతి' ఇతి వాక్యమయోగ్యమ్ వహ్నేః సేకాన్వయ ప్రయోజక ద్రవద్రవ్యత్వాభావాత్।

ఏతాదృశస్థలేషు నాన్వయబోధః, కింతు ప్రత్యేకం పదార్థబోధమాత్రమితి నైయాయికాః। తన్న। బౌద్ధార్థస్యైవ సర్వత్ర బోధ విషయత్వేన బాధస్యాభావాత్।

హరి రప్యాహ -

''అత్యంతాసత్యపి హ్యర్థే జ్ఞానం శబ్దః కరోతి చ''

(వా.ప.) ఇతి।

అతో వన్ధ్యాసుతాది శబ్దానాం ప్రాతిపదికత్వమ్। వహ్నినా సిఞ్చతీత్యతో బోధాభావే తద్వాక్యప్రయోక్తారం ప్రతి 'అద్రవేణ వహ్నినా కథం సేకం బ్రవీషి' ఇత్యుపహాసానాపత్తేశ్చ। వాక్యార్థ బోధే జాతే బుద్ధార్థ విషయే ప్రవృత్తిస్తు న భవతి, బుద్ధార్థేఽప్రామాణ్య గ్రహాదిత్యన్యత్ర విస్తరః।

ఇతి యోగ్యతానిరూపణమ్

వ్యాఖ్యానము :- ప్రాభాకర, భర్తృహర్యాది సంమతమగు యోగ్యతా-స్వరూపమును ప్రతిపాదించుచున్నాడు. యోగ్యతాచేతి. పరస్పరాన్వయ=

శాబ్దబోధప్రయోజకమగు ధర్మము 'యోగ్యత' యనబడును. శాబ్దబోధకారణముగ యిట్టి యోగ్యతను స్వీకరించుట వలన 'పయసా సిఞ్చతి' అను వాక్యము ఉక్త యోగ్యతా విశిష్టమగుట వలన శాబ్దబోధ కలుగుచున్నది. సేచనము = తడుపుట ద్రవద్రవ్యమునకు మాత్రము సంభవించును. సేకాన్వయ ప్రయోజకమగు ద్రవద్రవ్యత్వ రూపయోగ్యత పయస్సు = జలమందు గలదు. అట్లే సేచన రూపక్రియయందు జలాన్వయ ప్రయోజకార్ద్రీకరణత్వరూప యోగ్యత కలదు. ఈ విధముగ పరస్పరాన్వయ ప్రయోజకధర్మములగు ద్రవద్రవ్యత్వము, ఆర్ద్రీకరణత్వము జల - సేచన క్రియల యందుండుటచే 'పయసా సిఞ్చతి' అను వాక్యము యోగ్యతా విశిష్టము.

నైయాయికమతమును నిరాకరించుచున్నాడు - ఏతాదృశేతి. యోగ్యతా జ్ఞానము లేనిచో అయోగ్యమగు 'వహ్నినా సిఞ్చతి' మున్నగు వాక్యములను వినుట వలన శాబ్దబోధ కలుగదు. కేవలము పదార్థ బోధ మాత్రమే కలుగునని నైయాయిక మతము.

**విశేషము** :- యోగ్యతా స్వరూపమును నిరూపించుటలో నైయాయికులకు సంబంధించి రెండు మతములు కలవు. తాత్పర్య విషయీభూత సంసర్గవృత్తి ధర్మమగు సంసర్గతావచ్ఛేదకమున సంబంధి నిష్ఠాత్యంతాభావ ప్రతియోగితావచ్ఛేదకత్వము యొక్క అభావము యోగ్యతయని మొదటి మతము. 'తాత్పర్య విషయీభూత సంసర్గమున సంబంధినిష్ఠాత్యంతాభావ ప్రతియోగిత్వా భావము యోగ్యత' యని లఘులక్షణము. 'రాజ్ఞః పురుషః' అను స్థలమున తాత్పర్య విషయీభూత సంసర్గము = స్వ స్వామిభావ సంబంధము. సంసర్గత సంసర్గమందుండును. స్వస్వామిభావ సంబంధమందు గల స్వస్వామి భావ సంబంధత్వము సంసర్గతావచ్ఛేదకము. అవచ్ఛేదకమనగా విశేషణము. సంసర్గమగు స్వస్వామి

భావ సంబంధమున విశేషణమగు స్వస్వామి భావ సంబంధత్వము సంసర్గతావచ్ఛేదకము. స్వస్వామిభావ సంబంధమున సంబంధులు రాజ పురుష పదార్థములు. పురుషరూపసంబంధియందుండు అభావము = 'రాజప్రతియోగిక క్రియాకారక భావ సంబంధో నాస్తి'. అను అభావము. ప్రతియోగితావచ్ఛేదకము క్రియాకారకభావ సంబంధత్వము. ప్రతియోగితావచ్ఛేదకత్వము కియాకారకభావ సంబంధత్వ-రూపధర్మమున గలదు. ప్రతియోగితావచ్ఛేదకత్వాభావము స్వస్వామిభావ సంబంధత్వమున కలదు గనుక యోగ్యత కలదు.

'వహ్నినా సిఞ్చతి' అను స్థలమున వహ్ని సేకక్రియతో సేకకరణ కత్వ సంబంధముతో అన్వయించును. తాత్పర్య విషయీభూత సంసర్గము సేకకరణ కత్వసంబంధము. సేకరూపసంబంధియందు గల అభావము = వహ్నికరణకత్వాభావము. తత్ప్రతియోగిత్వము స్వకరణకత్వమందు కలదు. తదభావము= సంబంధినిష్ఠాత్యన్తాభావ ప్రతియోగిత్వాభావము తాత్పర్యవిషయీభూత సంసర్గమున లేదు. అనగా తాత్పర్యవిషయీభూత సంసర్గము సంబంధి నిష్ఠాత్యంతాభావ ప్రతియోగి యగుటచే ప్రతియోగిత్వాభావము దానియందు లేకపోవుటచే యోగ్యత లేదు గనుక 'వహ్నినా సిఞ్చతి' అను వాక్యము వినుట వలన శాబ్దబోధ కలుగదు. లేదా వహ్నినిరూపిత - స్వరూప సంబంధావచ్ఛిన్నాధేయత్వము (వహ్ని సంసర్గము) తాత్పర్యవిషయీ భూత సంసర్గము. సంబంధియగు సేకరణత్వమందు గల అభావము = వహ్ని నిరూపిత స్వరూప సంబంధావచ్ఛిన్నాధేయత్వం నాస్తి (వహ్ని సంసర్గో నాస్తి) అను అభావము. తత్ప్రతియోగిత్వమే స్వరూప సంబంధావచ్ఛిన్నాధేయత్వరూప సంసర్గమందుడుటచే యోగ్యత లేదు.

'పయసా సిఞ్చతి' అను స్థలమున పయోనిరూపిత స్వరూప సంబంధావచ్ఛిన్నాధేయత్వము తాత్పర్య విషయీభూత సంసర్గము.

సంబంధియగు సేకకరణత్వమందు పయోనిరూపిత స్వరూప సంబంధావచ్ఛిన్నాధేయత్వముండుటచే 'పయో నిరూపిత స్వరూప సంబంధా వచ్ఛిన్నాధేయత్వం నాస్తి' అను అభావము రాదు. అభావాంతరమును తీసుకొనిన తత్ప్రతి యోగిత్వము పయోనిరూపిత స్వరూప సంబంధావచ్ఛిన్నాధేయత్వమందుండదు కనుక తత్ప్రతియోగిత్వాభావము సిద్ధించును. అదియే యోగ్యత. యోగ్యతాజ్ఞానము శాబ్దబోధకారణము. తాత్పర్య విషయీభూత సంసర్గమందు సంబంధి నిష్ఠాత్యంతాభావ ప్రతియోగిత్వాభావము యోగ్యత యని లఘువుగా చెప్పక అవచ్ఛేదకత్వ పర్యంతము లక్షణము చెప్పుట పర్యాప్తి నివేశమునకు సూచకము. కనుక 'రాజపురుషః' మున్నగుచోట పురుషుని యందు పశ్వాది వృత్తిత్వ విశిష్టస్వస్వామిభావ సంబంధము లేక స్వస్వామిభావ ఘట ఏతదుభయము లేకపోవుటచే తదభావమున్నను విశిష్టాభావము లేక ఉభయత్వాది ధర్మావచ్ఛిన్నాభావము తీసుకుని అవ్యాప్తిరూపదోషములేదు. తద్వత్తాబుద్ధిని గూర్చి తదభావవత్తా నిశ్చయము ప్రతిబంధకమగుటచే హ్రదము వహ్నిమత్తు అను నిశ్చయమును గూర్చి హ్రదము వహ్న్య భావవత్తు అను నిశ్చయము ప్రతిబంధకము. ప్రకృతమున సేకకరణత్వమందు వహ్న్యధేయత్వాభావనిశ్చయము వహ్న్యధేయతావత్తు సేకకరణత్వమను బోధను గూర్చి ప్రతిబంధకమగుటచే ప్రతిబంధకజ్ఞానము చేతనే వహ్నినా సిఞ్చతి అను స్థలమున శాబ్దబోధ కలుగుట లేదు. కనుక శాబ్దబోధను గూర్చి యోగ్యతా జ్ఞానమునకు కారణత్వమేల యంగీకరించవలెనను శంకకు సమాధానముగ నవ్యతార్కికులు అయోగ్యతానిశ్చయమునకు శాబ్దబోధ ప్రతిబంధకత్వమంగీకరించిరి. సంసర్గతావచ్ఛేదక రూపమగు తాత్పర్య విషయీభూత సంసర్గవృత్తి ధర్మమందు సంబంధినిష్ఠాత్యంతాభావ ప్రతియోగితావచ్ఛేదకత్వ-రూపాయోగ్యతా నిశ్చయము శాబ్దబోధ ప్రతిబంధకమని తాత్పర్యము.

'వహ్నినా సిఞ్చతి' అను వాక్యమున వహ్నికరణకత్వ సంబంధమున సంసర్గతావచ్ఛేదకవము వహ్నికరణకత్వవము. సంబంధియగు సేకక్రియయందుగల అభావము = వహ్ని కరణకత్వ సంబంధమందుగలదు. అదియే సంసర్గతావచ్ఛేదకవము. ఇట్టి అయోగ్యతానిశ్చయవము శాబ్దబోధప్రతిబంధకవము. ప్రాచీన నైయాయిక మతమున యోగ్యతాజ్ఞానవము లేకపోవుటచే, నవ్యనైయాయికమతమున అయోగ్యతానిశ్చయము ప్రతిబంధకమగుటచే 'వహ్నినా సిఞ్చతి' మున్నగు స్థలములలో శాబ్దబోధ కలుగదు, కేవలము పదార్థబోధ మాత్రము కలుగును.

వ్యాఖ్యానము :- నైయాయిక మతమును నిరాకరించుచున్నాడు - తన్నేతి. వైయాకరణమతానుసారము సమస్త పదార్థములు బౌద్ధములు = బుద్ధిస్థములుగ అంగీకరింపబడుచున్నవి. బౌద్ధపదార్థములే శాబ్దబోధ విషయవములు. బౌద్ధవములగు అగ్న్యాది పదార్థవములయందు బాహ్యాధర్మములగు దాహకత్వాదులెట్లుండును ? కనుక శాబ్దబోధనుగూర్చి ఏదియు ప్రతిబంధకము కానేరదు. వాక్యపదీయకారుడగు భర్తృహరి - 'ప్రపంచమున అత్యంతమప్రసిద్ధమగు పదార్థము యొక్క జ్ఞానము శబ్దము వలన కల్గునని' చెప్పినాడు. కనుక శాబ్దబోధను గూర్చి బాధజ్ఞానమునకు ప్రతిబంధకత్వవము లేదు. బౌద్ధార్థవమును స్వీకరించుట వలన 'వంధ్యాపుత్రుడు' మున్నగు శబ్దముల వలన అర్థబోధ కలుగుటచే వంధ్యాపుత్రాది శబ్దములకు అర్థవత్వ్యాత్రవముచే ప్రాతిపదిక సంజ్ఞ సిద్ధించుచున్నది.

'వహ్నినా సిఞ్చతి' అను వాక్యము వలన అర్థబోధ కలుగక పోయిన అట్టి వాక్యమును ప్రయోగించువాని నుద్దేశించి 'అద్రవమగు వహ్నితో తడుపుటను ఎట్లు పలుకుచున్నావు ? అని పరిహసించుట అనుపపన్నవగును. వాక్యార్థబోధ కలిగిన పిమ్మట జ్ఞాతవగు

నర్థమందప్రామాణ్య బుద్ధి కలుగుటచే శ్రోత అట్టి యర్థమందు ప్రవర్తించడు.

**విశేషము** :- సమభివ్యాహృత పద బోధ్య కార్య నిరూపిత శక్తి యోగ్యత యని, అది శాబ్దబోధలో భాసించునని నాగేశభట్టు లఘుమంజూషలో పేర్కొనినాడు. 'ఘటేన జలమాహర' = కడవతో నీళ్ళు తీసుకొని రమ్ము అనుచోట జలాహరణ రూపకార్యానుకూలశక్తి రూపయోగ్యతచే ఘటమందు సచ్ఛిద్రేతరత్వప్రకారకబోధ కలుగుచున్నది. నీటిని తీసుకువచ్చు సామర్థ్యము రంధ్రములు లేని ఘటమునకు మాత్రముపపన్నముగాన ఘటమందు విశేషణముగ రంధ్రములు లేకపోవుట కూడ బోధలో భాసించును) అట్లే ఘటమందు ఘటత్వము కూడ విశేషణముగ భాసించును. సర్వత్ర ప్రవృత్తినిమిత్తము కార్యశక్తిరూప యోగ్యతకుపలక్షణము. అనగా లక్షణావృత్తిచే తెలియబడుచున్నది. ప్రవృత్తి నిమిత్త సామానాధికరణ్యేన కార్యశక్తి రూపయోగ్యత శాబ్దబోధలో భాసించునని ఫలించినది.

యోగ్యతానిరూపణము సమాప్తము

## అథాసత్తి నిరూపణమ్

మూలము :- ప్రకృతాన్వయబోధానుకూల పదావ్యవధానమాసత్తిః। గిరిరగ్నిమాన్ ఇత్యాసన్నమ్। అనాసన్నం చ 'గిరిర్భుక్తమగ్నిమాన్ దేవదత్తేన' ఇతి। ఆసత్తిరపి మందబుద్ధేరవిలంబేన శాబ్దబోధే కారణమ్। అమందబుద్ధే-స్త్వాసత్త్యభావేఽపి పదార్థోపస్థితావాకాంక్షాదితోఽవిలంబే నైవ బోధో భవతీతి నబోధే తస్యాః కారణత్వమ్। ధ్వనితం చేదం 'న పదాన్త' (1-1-58) సూత్రభాష్యే।

స్థాల్యామోదనం పచతీత్యాదౌ స్థాల్యామిత్యస్యౌదనపదేన వ్యవధానే సత్యపి ప్రకృతాన్వయబోధానుకూలత్వాదాసన్నత్వాక్షతిః।

ఇత్యాసత్తినిరూపణమ్

వ్యాఖ్యానము :- పదార్థము పదార్థాంతరముతో ఏదోయొక సంబంధముతో నన్వయించును. సంబంధమున సంబంధులు అనగా ప్రతియోగి (విశేషణము) అనుయోగి (విశేష్యము) అను రెండు పదార్థములుండును. పదార్థముల పరస్పర సంబంధమే శాబ్దబోధ. ప్రకృతాన్వయబోధకు అనను కూలమగు అర్థమును చెప్పు పదములతో వ్యవధానము లేకపోవుట ఆసత్తి. అవిలంబేన పదోచ్చారణము ఆసత్తియని నైయాయికులు. 'గిరిరగ్నిమాన్' అను వాక్యము ఆసత్తి కల్గినది. ఇట్టి జ్ఞానము శాబ్దబోధకు కారణము. గిరిః భుక్తమ్ అగ్నిమాన్ దేవదత్తేన అనువాక్యమున గిరిః అగ్నిమాన్ అను పదముల మధ్య ప్రకృతాన్వయబోధాననుకూలమగు భుక్తమాన్ అనుపదము వ్యవధానముగనున్నది. అట్లే భుక్తమ్ - దేవదత్తేన అను పదములనడుమ అగ్నిమాన్ అను పదము వ్యవహితముగనుండుటచే ఆసత్తిలేదు. ఆసత్తి మందబుద్ధికి శీఘ్రముగ శాబ్దబోధ కలుగుటకు కారణము. అమందబుద్ధికి=సునిశితమగు బుద్ధికలవానికి ఆసత్తి లేకపోయినను ఆకాంక్షాదివశముచే శీఘ్రముగ శాబ్దబోధ కలుగును గాన ఆసత్తి శాబ్దబోధ కారణము కాజాలదు. మందబుద్ధికి కూడా శీఘ్రముగ బోధ కలుగుటకు ఆసత్తి కారణమయినను ఆలస్యముగ బోధకలుగుటలో కారణము కాజాలదు. 'న పదాన్త' సూత్ర భాష్యమున ఈ విషయము సూచింపబడినది.

'స్థాల్యామోదనం పచతి' అను వాక్యమున అధికరణమగు స్థాలీశబ్దమునకు పచతి యను క్రియకు ఓదన శబ్దముతో వ్యవధానమున్నను అట్టి వ్యవధానము ప్రకృతాన్వయబోధకు అనుకూలమగుటచే ఆసత్తికి హాని లేదు. ప్రకృతాన్వయబోధాననుకూలమను విశేషణము లేకపోయిన ప్రాగుక్తస్థలమున ఓదన పదముతో వ్యవధానముండుటచే ఆసత్తి లేకపోవును.

తీక్ష్ణబుద్ధికి ఆసత్తి లేకపోయినను అవిలంబముగ శాబ్దబోధ

కలుగును. మందబుద్ధికి విలంబముగ కలుగును. కావున శాబ్దబోధను గూర్చి ఆసత్తికారణము కాజాలదని నాగేశుని యభిప్రాయము.

ఆసత్తినిరూపణము సమాప్తము

## అథ తాత్పర్య నిరూపణమ్

మూలము :- ఏతద్వాక్యం పదం వా ఏతదర్థబోధాయోచ్చారణీయ-మితీశ్వరేచ్ఛా – తాత్పర్యమ్ । అత ఏవ సతి తాత్పర్యే 'సర్వే సర్వార్థ వాచకాః' ఇతి శాబ్దికనయే ఘటశబ్దాత్ పటప్రత్యయో నేత్యాద్యుక్తమ్ । నానార్థ స్థలే లోకే తాత్పర్యన్తు 'ఏతత్పదం వాక్యం వా ఏతదర్థ ప్రత్యయాయ మయోచ్చార్యతే' ఇతి ప్రయోక్తురిచ్ఛారూపమ్ । తాత్పర్యనియామకం చ లోకే ప్రకరణాదికమేవ । అతో భోజన ప్రకరణే సైంధవ మానయేత్యుక్తే సైంధవపదేన లవణప్రత్యయః, యుద్ధావసరేఽశ్వప్రత్యయః । వేదవాక్యే చైశ్వర తాత్పర్యాదర్థబోధః ।

నను ప్రకరణాదీనాం శక్తినియామకత్వే శక్త్యైవ నిర్వాహే కిం తాత్పర్యేణేతి చేన్న । అస్మాచ్ఛబ్దాదర్థ ద్వయ విశేష్యకో బోధో జాయతే, అర్థద్వయే శక్తిసత్వాత్; తాత్పర్యం తు క్వేతి న జానీమ ఇత్యనుభవ విరోధాత్। అత ఏవ చ పయ ఆనయేత్యుక్తే అప్రకరణజ్ఞస్య దుగ్ధం జలం వా ఆనేయ మితి ప్రశ్నః సంగచ్ఛతే ।

ఇతి తాత్పర్య నిరూపణమ్

వ్యాఖ్యానము :- శాబ్దబోధ సహకారికారణములలో నాల్గవదగు తాత్పర్యమును నిరూపించుచున్నాడు. ఈ వాక్యము లేక పదము ఈ యర్థమును బోధించుటకుచ్చరించవలెనను ఈశ్వరేచ్ఛ తాత్పర్యము. తాత్పర్యజ్ఞానమునకు శాబ్దబోధను గూర్చి కారణత్వమంగీకరించుటచే సర్వశబ్దములు సర్వార్థ వాచకములను వైయాకరణమతమున సమస్త శబ్దములు సర్వార్థములను బోధించునవైనప్పటికి ఘట శబ్దము

ఘటరూపార్థమును బోధించవలయునను తాత్పర్యనిశ్చయము వలన ఘటశబ్దము నుచ్చరించుటచే ఘటరూపార్థబోధ కలుగును గాని పటరూపార్థబోధ కలుగదు. నానార్థకస్థలమున ఈ పదము లేక వాక్యముచే ఈ యర్థబోధ కలుగవలయునని నాచే ఉచ్చరింపబడుచున్నదను ప్రయోక్త యొక్క ఇచ్ఛయే తాత్పర్యము. కనుక అనేకార్థక పదశ్రవణముచే అనేకార్థ బోధాపత్తి లేదు. తాత్పర్య నియామకములగు ప్రకరణాదులు పూర్వ ప్రకరణమున నిరూపింపబడినవి. సైంధవ మానయ అను వాక్యమున సైంధవ పదముచే లవణ బోధ, యుద్ధ ప్రకరణమున అశ్వబోధ కలుగును. వేద వాక్యముల విషయములో ఈశ్వరీయ తాత్పర్యముచే అర్థబోధ కలుగును. 'సంయోగో విప్రయోగశ్చ' అనుకారికలచే సంయోగాదులకు శక్తి నియామకత్వము చెప్పబడినది. తాత్పర్య నియామకత్వము కూడా వీటికే చెప్పబడుటచే శక్తిచే ఇష్టసిద్ధి కలుగుచుండగా తాత్పర్యమునకు ఆవశ్యకత ఏమియను శంకకు సమాధానము చెప్పుచున్నాడు - అస్మాదితి. నానార్థక శబ్ద ప్రయోగమున ఈ శబ్దము అర్థ ద్వయమందు శక్తమగుటచే అర్థ ద్వయ విషయక బోధ కలుగుచున్నది. కాని తాత్పర్యము ఏ యర్థమందో తెలియుట లేదను సర్వజనుల అనుభవముచే తాత్పర్యమునకు శక్తిచే గతార్థత లేదు. తాత్పర్యజ్ఞానమునకు శాబ్దబోధ కారణత్వమంగీకరించుటచే 'పయ (పాలు, నీళ్ళు) ఆనయ' అని ప్రయోగించిన ప్రకరణ జ్ఞానము లేని శ్రోత పాలు తేవలయునా ? లేక జలమా? అని ప్రశ్నించుట సంగతమగుచున్నది. తాత్పర్యజ్ఞానమునకు శాబ్దబోధకారణత్వమంగీకరించుట తార్కికమతము ననుసరించి, నాగేశభట్టు మతమున తాత్పర్యజ్ఞానమునకు శాబ్దబోధకారణత్వము లేదు. శాబ్దబోధకు ప్రామాణ్య నిశ్చయముకలిగించి ప్రవర్తింపజేయుటలో తాత్పర్యజ్ఞానము కారణమని యాతని యభిప్రాయము.

**విశేషము** :- వైయాకరణ సిద్ధాన్త లఘుమంజూషలో నాగేశభట్టు తాత్పర్యజ్ఞానము శాబ్దబోధకారణమను న్యాయదర్శనకారుల మతమునను

వాదముజేసి ఖండించెను. అది యెట్లన:- ఘటమానయ అను వాక్యము ఘటకర్మ కానయన విషయక బోధ కలుగవలయునను ఇచ్ఛతో నుచ్చరింపబడలేదను జ్ఞానమున్నప్పుడు లేదా ఘటమానయ అను వాక్యము పటకర్మకానయన విషయకబోధ కలుగవలయునను ఇచ్ఛతో నుచ్చరింపబడిన దను జ్ఞానముండగ ఘటమానయ అనువాక్యమువలన ఘటకర్మకానయన విషయకబోధను గూర్చి ప్రతిబంధకత్వము కల్పించవలెను. అట్లైన గౌరవము గనుక నైయాయికులు ఘటకర్మకానయనబోధను గూర్చి ''ఘటమానయ అను వాక్యము ఘటకర్మకానయన బోధేచ్ఛతో ఉచ్చరితమ''ను వక్తృతాత్పర్యజ్ఞానమునకు కారణత్వమంగీకరించిరి.

ఖండనము:- చిలుక మున్నగువాని పలుకులవలన, దేవతల అనుగ్రహము లేక పూర్వజన్మ సంస్కారముచే మూర్ఖబాలునిచే చేయబడిన ఉత్తమకావ్యము వినుట వలన వక్తృతాత్పర్యాభావ నిశ్చయమున్నను శాబ్దబోధకలుగుచుండుటచే తాత్పర్యజ్ఞానమునకు శాబ్దబోధకారణత్వము చెప్పుట సరిగాదు. (శుకము, మూర్ఖబాలుడు మున్నగువానికి వాక్యార్థబోధయే లేకపోవుటచే 'శ్రోతకు ఇట్టి వాక్యార్థబోధకలుగవలయునను తాత్పర్యమెట్లుండును) శాబ్దబోధ యనెడి కార్యము కలిగిన పిమ్మట ఈశ్వరీయ తాత్పర్యముననుమానము చేసినను శాబ్దబోధకు ముందు దానిననుమానము చేయుట సంభవించదు గనుక శుకవాక్యము మున్నగు స్థలములలో ఈశ్వరీయ తాత్పర్యమంగీకరించుట యుక్తముగాదు.

నానార్థ స్థలమున అర్థద్వయ విషయక బోధ కలుగుచున్నను వక్తృతాత్పర్యమేయర్థమందో తెలియుటలేదను సర్వజన సిద్ధ అనుభవవిరోధము వలన తాత్పర్య నిశ్చయమునకు బోధకారణత్వ ముచితము గాదు. అట్లుగాకున్న వక్తృతాత్పర్య నిశ్చయము లేకపోయినను అర్థద్వయ విషయకబోధ కలుగుచున్నదను ప్రతీతి ఎట్లు ఉపపన్నమగును? తాత్పర్యజ్ఞానమునకు బోధహేతుత్వ మంగీకరించకపోవుటవలననే 'పయ



ఆనయ' అని పలుకగ ప్రకరణజ్ఞానము లేనివాడు పాలుతేవలయునా ? లేక నీళ్ళు తేవలయునా ? అని ప్రశ్నించుట ఉపపన్నమగుచున్నది. తాత్పర్యజ్ఞానమునకు బోధకారణత్వమంగీకరించిన వక్తృతాత్పర్యము లేకపోవుటచే ఉభయ విషయక జ్ఞానమే కలుగదు గనుక ప్రశ్నించుట యనుపపన్నమగును. వక్తృతాత్పర్యమునకు శాబ్దబోధహేతుత్వనిరాసము సంఖ్యాసంజ్ఞాసూత్రభాష్యమున స్పష్టము. ''ఇహార్థముత్తరార్థం చ ఉద్దేశ్యకోటౌ సంఖ్యాగ్రహణం కర్తవ్యమితరథా హ్యసంప్రత్యయః అకృత్రిమత్వాద్యథా లోకే'' అని చెప్పి ''ఆద్యఫలార్థం న కర్తవ్యమ్, అర్థాత్ ప్రకరణద్వా లోకే కృత్రిమాకృత్రిమయోః కృత్రిమే కార్యసంప్రత్యయో భవతి- అర్థో వాఽస్యైవ సంజ్ఞకేన భవతి, ప్రకృతం వా తత్ర భవతి ఇదమేవం సంజ్ఞకేన కర్తవ్యమితి। అతశ్చార్థాత్ ప్రకరణాద్వా। అఙ్గ హి భవాన్ గ్రామ్యం పాంసులపాదమప్రకరణజ్ఞమాగతం బ్రవీతు గోపాలకమానయ కటకజమానయేతి, ఉభయగతిస్తస్య భవతి సాధీయో వా యష్టిహస్తం గమిష్యతి'' అని భాష్యకారులు పేర్కొనిరి. కనుక తాత్పర్యజ్ఞానము బోధహేతువు కాదని సిద్ధించినది.

ఏ వాక్యార్థమందు ప్రామాణ్యాభావ నిశ్చయము లేక ప్రామాణ్య సంశయముండునో దానివలన తత్తత్కార్యములయందు ప్రవృత్తి లేక నివృత్తి సంభవించదు గనుక ప్రామాణ్యనిశ్చయమునకు ప్రవృత్తిహేతుత్వ మంగీకరించవలెను. తాత్పర్యనిశ్చయము శాబ్దబోధయందు ప్రామాణ్యనిశ్చయము కలిగించుటద్వారా తత్తత్కార్య ప్రవృత్తిలో కారణమగును. అనేక పదార్థములకు అన్వయ యోగ్యత్వము ప్రసక్తమగుచుండగ దేనినధ్యాహారము చేయవలయునను విషయమున తాత్పర్యనిర్ణయముపయోగించునని నాగేశభట్టు వివరించెను. సమగ్ర విచారమునకై లఘుమంజూషను చూడవలెను.

తాత్పర్య నిరూపణము సమాప్తము.

